# వైద్యగ్రంథములు

| | రూ. | అ. | | రూ. | అ. |
|---|---|---|---|---|---|
| సిద్ధమూలికారహస్యము | 1 | 0 | బాలగ్రహచికిత్సలు | 0 | 6 |
| పులిప్పాణి వైద్యము | 1 | 8 | డిటో (చిన్నది) | 0 | 2 |
| యూనాని వైద్యామృతము | 0 | 12 | అనుపానమంజరి | 0 | 8 |
| కుసుమరోగనివారిణి | 0 | 12 | సహదేవపశువైద్యము | 0 | 8 |
| గృహవైద్యము 1 వ భా॥ | 0 | 12 | వ్రణచికిత్సలు | 0 | 8 |
| డిటో 2 వ భా॥ | 0 | 12 | నాడీనక్షత్రమాల | 0 | 6 |
| ఆయుర్వేద వైద్యామృతము | 0 | 12 | భస్మప్రదీపిక | 0 | 12 |
| సుఖరోగ చికిత్సలు | 0 | 8 | వసిష్ఠప్రోక్తము (పులిప్పాణి) | 1 | 8 |
| విషవైద్యము | 0 | 8 | సర్పశాస్త్రము | 0 | 8 |
| రసప్రదీపిక | 0 | 12 | షడ్రసనిఘంటువు | 0 | 12 |
| సద్వైద్యజీవనము | 0 | 12 | రసయోగరత్నాకరము | 1 | 0 |
| వైద్యశతశ్లోకి | 0 | 12 | మసూచికము | 0 | 6 |
| బంగారుయోగములు | 0 | 8 | ఆంగ్లేయ చికిత్సాసంగ్రహము | 2 | 8 |
| 3 నాడులు కలిగిన పుస్తకము | 0 | 12 | ఆంగ్లేయ వైద్యచింతామణి | 6 | 0 |
| గోసాయిచిటికలు (పెద్దది) | 0 | 8 | ఆంగ్లేయ ఔషధగుణదీపిక | 6 | 0 |
| బైరాగిచిటికలు డిటో | 0 | 8 | ఆంగ్లేయ ఔషధయోగములు | 1 | 4 |
| నాడీపరిజ్ఞానము | 0 | 8 | మూలికాయోగతరంగిణి | 0 | 12 |
| నలభీమపాకశాస్త్రము | 0 | 12 | ఆయుర్వేదసారసంగ్రహనిధి | | |
| మిలటరీపాకశాస్త్రము | 0 | 12 | 600 పేజీలు | 3 | 0 |
| వస్తుగుణప్రదర్శిని 800 పే॥ | 3 | 0 | తిబ్బెఅక్బరుషాహీ | 7 | 0 |
| ధన్వంతరీవిజయము | 0 | 10 | పేరగాశీయము (పద్య తాత్పర్య | | |
| స్త్రీజనకల్పతరువు | 1 | 0 | సహితము 200 పేజీలు) | 2 | 0 |
| దంతవైద్యము | 0 | 8 | అనుభవదీపిక | 1 | 8 |
| అశ్వలక్షణసారము | 0 | 8 | భస్మప్రకాశిక | 2 | 0 |
| షర్బత్తుపాకావళి | 0 | 8 | వైద్యవిజ్ఞానము | 2 | 0 |
| వైద్యరహస్యచింతామణి 1 భా॥ | 0 | 12 | **జ్యోతిష గ్రంథములు** | | |
| డిటో 2 భా॥ | 0 | 12 | జ్యోతిష ప్రథమబోధిని | 0 | 8 |
| చికిత్సారత్నము శ్లో॥ | 0 | 12 | జాతకమార్తాండము 1 వ భా॥ | 2 | 0 |
| శతలేహ్యపాకావళి | 0 | 8 | డిటో 2 వ భా॥ | 2 | 0 |
| నేత్రదర్పణము | 0 | 8 | డిటో 3 వ భా॥ | 2 | 0 |

శ్రీ సత్యనారాయణ బుక్ డిపో, రాజమండ్రి.

# భర్తృహరిసుభాషితము



నీతినిధి

శృంగారనిలయము

వైరాగ్యఖని

( శతకత్రయము )

ఏనుగు లక్ష్మణకవి పద్యములతో

తాత్పర్యసహితము.





ప్రకాశకులు:

శ్రీ సత్యనారాయణ బుక్ డిపో,

బుక్ సెల్లర్స్ అండ్ పబ్లిషర్సు,

రాజమండ్రి.

కాపీరైట్ రిజిష్టర్డు ]    1950    [ వెల రు 1—4—0

# ఉపోద్ఘాతము

"విద్వానేవ విజానాతి విద్వజ్జన పరిశ్రమం।
నహి.....విజానాతి,........॥"

పాఠకమహాశయులారా!

భారతదేశమంతటిలోను తెలుగుదేశము ఆధ్యాత్మికప్రభా భాగ్యమున నితోధికముగ తులతూగుచున్నదని పలువురు చరిత్రకారులు వ్రాసియున్నారు. దానికిఁ బ్రధానకారణ మాదినుండియు నాంధ్రదేశము నైతికప్రజ్ఞయందు విఖ్యాతినిగడించుటయే. రాజకీయ వాతావరణమొకప్రక్క వివిధరీతుల ప్రణాళికాభేదములతో నాట్యమాడుచున్నను భక్తిపారతంత్ర్యము నాంధ్రులు మరవలేదు. ఆధ్యాత్మికప్రభానిలయంబులగు ననేకోద్గ్రంథములు మాతృభాషయందు జనించి పలువురు పండితప్రకాండుల మూలమున నాంధ్రమున వెలువడి యాంధ్రుల తటింపఁజేసినవి. అట్టివానిలో నీభర్తృహరి సుభాషిత మగ్రస్థానము వహించుననుట సాహసము కానేరదు. మరియు కేవల నైతికసాంప్రదాయములనే గాక వివిధ శృంగారరీతుల నిందు బొందు పరచి వైరాగ్యపుటాలవాలముగఁ జేసి యాగ్రంథమును రచియించిన భర్తృహరియొక్క ప్రజ్ఞాపాండిత్యవిశేషము నుగ్గడింప సామాన్యులవ శ్యాలు. ఈతని మాతృభాషా మాతృకకు విలువతగ్గకుండ నాంధ్రమున కనువదించిన ఏనుఁగు లక్ష్మణాదికవీంద్రుల ప్రజ్ఞాబాహుళ్యమనంతమే. ఇట్టిదానికి తాత్పర్యమును వ్రాయబూనుట నావంటివానికి సాహసమున వచ్చును. కాని గ్రంథపఠనోత్సుకతయందలివాత్సల్యమే దీనికి హేతువు.

ఇట్లు,

వ్యాఖ్యాత.

తా. కాలము దిశలు మొదలగువాని కపరిచ్ఛిన్నంబును స్వానుభవమువలననే తెలిసికొనఁదగినదై శాంతస్వరూపంబగు పరంజ్యోతి రూపంబునకే నమస్కారము జేయుచున్నాను.

అవతారిక. గ్రంథకర్త తాను రచింపఁబోవు శతకత్రయంబందు మొదట నీతిశతకముఁ జెప్పుచున్నాడు. అందు తొలుత మూర్ఖపద్ధతిని గైకొని వర్ణించుచున్నాఁడు.

---

# నీతిశతకము.

## ౧ మూర్ఖపద్ధతి.

శ్లో. బోద్ధారో మత్సరగ్రస్తాః ప్రభవ స్స్మయ దూషితాః
అబోధోపహతాశ్చాన్యే జీర్ణమంగే సుభాషితం.

తే. గీ. బోద్ధలగువారు మత్సర । పూర్ణమతులు
ప్రబలగర్వవిదూషితుల్ । ప్రభువులెన్న
నితరమనుజు లబోధోప । హతులు గాన
భావమున జీర్ణ మయ్యె సు । భాషితంబు. 2

తా. విద్వాంసులు నే చెప్పుమాట మంచిదని యెఱింగియు అసూయచే దాని నంగీకరింపరు. ఇఁక ప్రభువులన్ననో గర్వాంధులై నామాట వినరు, ఇఁక నితర జనులకు నే చెప్పునది వినతగిన యర్హతలేదు. కావున సుభాషితము (మంచిమాట) భావమందే అణఁగి యున్నది. ఐనను ఎటులనో చెప్పెదను.

శ్లో. అజ్ఞ స్సుఖ మారాధ్య స్సుఖతర మారాధ్యతే విశేషజ్ఞః,
జ్ఞానలవదుర్విదగ్ధం బ్రహ్మాపి నరం న రంజయతి.

క. తెలియని మనుజుని
దెలుపందగు సుఖతరముగఁ । దెలుపగ వచ్చుం
దెలిసినవానిం దెలిసియు
దెలియని నరు దెల్ప బ్రహ్మ । దేవునివశమే. 3

తా. ఏమియు జ్ఞానములేని వాని కేవిషయమైన సుఖముగాఁ దెలియజేయ వచ్చును. జ్ఞానము కలవానికి సుఖతరముగా తెలియజేయవచ్చును. కాని కొంత తెలిసియుఁ గొంత తెలియకయు మేలగువాని కేవిషయమైన బ్రహ్మగూడ బోధింపఁ జాలఁడు. ఇతరు లసలే తెలుపలేరు.

శ్లో. ప్రసహ్యమణి ముద్ధరే న్మకరవక్త్రదంష్ట్రాన్తరాత్
సముద్ర మపి సంతరే త్ప్రచలదూర్మిమాలాకులం
భుజంగ మపి కోపితం శిరసి పుష్పవ ద్ధారయేత్
న తు ప్రతినివిష్టమూర్ఖజనచిత్త మారాధయేత్. 4

చ. మకరముఖాంతరస్థ మగు మానికముం బెకలింపవచ్చుఁ బా
యక చలదూర్మికానికర మైనమహోదధి దాటవచ్చు మ
స్తకమునఁ బూవుదండవలె సర్పమునైన భరింపవచ్చు మ
చ్చిక ఘటియింప మూర్ఖజన చిత్తముఁ దెల్ప నసాధ్యమేరికిన్ 4

తా. ఒకానొకప్పుడు శింశుమారము = మొసలినోటియందుండు మాణిక్యమును సులభముగాఁ దీయవచ్చును. సదా తరంగములతోఁ గూడిన మహాసముద్రమునైనను దాటవచ్చును. బుసకొట్టుచున్న సర్పమును ఎట్లో మంత్రణాద్యుపాయములచేతనైనఁ బుష్పదామముగా తలయందు ధరింపవచ్చును. ఐనను మూర్ఖుని మనసు రంజింపఁ జేయుట సాధ్యముగాదు. ఎవ్వరికిని శక్యము కాదు.

శ్లో. లభేత సికతాసు తైల మపి యత్నతః పీడయన్
పిబేచ్చ మృగతృష్ణికాసు సలిలం పిపాసార్దితః
కదాచి దపి పర్యటన్ శశవిషాణ మాసాదయేత్
న తుప్రతినివిష్ట మూర్ఖజనచిత్తమారాధయేత్. 5

తే. గీ. తివిరి యిసుమునఁ దైలంబు దీయవచ్చు
దవిలి మృగతృష్ణలో నీరు ద్రావవచ్చు
దిరిగి కుందేటి కొమ్ము సాధింపవచ్చుఁ
జేరి మూర్ఖుల మనసు రంజింప రాదు, 5

తా. ఏవిధముగానైనను యిసుకలో నూనె తీయవచ్చును. ఎట్లయినను ఎండమావులలో పరుగెత్తి నీరు త్రావవచ్చును, తేజాలని కుందేటి కొమ్ము నెట్లయినను ప్రయత్నించి తేవచ్చును. కాని మూర్ఖుని జేరదీసి వానిని సంతోషపెట్టుటసాధ్యముగాని పని.

శ్లో. వ్యాళం బాలమృణాళతంతుభి రసౌ రోద్ధుం సముజ్జృంభతే
ఛేత్తుం వజ్రమణీం శిరీషకుసుమప్రాన్తేన సన్నహ్యతి

మాధుర్యం మధుబిన్దునా రచయితుం క్షారామ్బుధేరీహతే
మూర్ఖాన్ యః ప్రతినేతు మిచ్ఛతి బలాత్సూక్తై స్సుధాస్యందిభిః.

మ. కరిరాజున్ బిసతంతుసంతతులచే గట్టన్ విజృంభించు వాఁ
డురువజ్రంబు శిరీషపుష్పములచే నూహించు భేదింపఁ దీ
పరచింతన్ లవణాబ్ధికిన్ మధుకణ ప్రాప్తిం బ్రవర్తించు ని
ద్ధరణిన్ మూర్ఖుల దెల్ప నెవ్వఁడు సుధాధారానుకారోక్తులన్

తా. తామర తూండ్లయందలి దారములతో మదపుటేనుఁగును గట్టఁజూచు వాఁడును, మిక్కిలి కఠినమైనదగు వజ్రమును దిరిసెన పువ్వుతో కోయఁజూచు వాఁడును, ఒకస్వల్పమైన నీటిపట్టుగాక భూమికి మూఁడురెట్లు పెద్దదగు మహాసముద్రమునందు మధుకణ మొకటి జారవిడిచి తీపిచేయుదలఁచువాఁడును, ఎంత యవివేకులో అట్లే అమృతము లొలుకు మాటలచే మూర్ఖుని రంజింపజేయ దలఁచు వాఁడు నంతకంటె మిక్కిలి యవివేకి.

శ్లో. స్వాయత్తమేకాంత హితంవిధాత్ర
వినిర్మితం ఛాదన మజ్ఞతాయాః।
విశేషత స్సర్వవిదాం సమాజే
విభూషణం మౌన మపండితానామ్. ౭

తే. గీ. స్వవశము హితము మూఢతా చ్ఛాదనంబు
గాఁగ నీగతి నిర్మించె కమలభవుఁడు
సర్వవిదులగు సుజనుల సభలలోన
మౌనమె విభూషణము మూఢ మానవులకు. ౭

తా. మూర్ఖులు తమ మూఢత్వమును మూసిపెట్టుకొనుటకై బ్రహ్మ వారికి మౌనము సృజించినాడు. మౌనమే వారికి పండిత జనుల నడుమ నొకయలంకారము వలె నున్నది కాన వారు మాటలాడకుండుటయే శ్రేయము.

శ్లో. యదా కించిజ్జ్ఞోహం గజఇవ మదాంధస్స మభవం
తదా సర్వజ్ఞోస్మీ త్యభవ దవలిప్తం మమ మనః।
యదాకించి త్కించి ద్బుధజన సకాశా దవగతం
తదా మూర్ఖోస్మీతి జ్వరఇవ మదో మే వ్యపగతః. ౮

చ. తెలివి యొకింత లేనియెడ దృప్తుఁడనై కరిభంగి సర్వముం
దెలిసితి నంచు గర్వితమతిన్ విహరించితిఁ దొల్లి యిప్పు డు
జ్జ్వల మతులైన పండితుల సన్నిధి నించుక బోధశాలినై
తెలియని వాఁడనై మెలఁగితిం గతమయ్యె నితాంతగర్వమున్. 8

తా. నేను స్వల్పజ్ఞానముగలవాఁడనై మదించిన యేనుఁగువలె కన్నుమిన్ను గానక సర్వము తెలిసికొంటి నని గర్వించితిని ఇప్పుడు పండిత లోకమువలన శాస్త్రముల బోధించు నాచారము కొంచెము కొంచెముగాఁ దెలిసికొనినవాఁడనై యిం వరకుండు గర్వమును విడిచి తెలియనివాఁడనై మెలఁగితినిగదా యని తెలిసికొంటిని.

శ్లో. క్రిమికులచితం లాలాక్లిన్నం విగంధిజుగుప్సితం
నిరుపమరసప్రీత్యా ఖాదన్ ఖరాస్థి నిరామిషం
సురపతి మపి శ్వా పార్శ్వస్థం విలోక్య న శఙ్కతే
నహి గణయతి క్షుద్రో జన్తుః పరిగ్రహఫల్గుతాం.

చ. క్రిమిసముదాయసంకులము గేవలనింద్యము పూతిగంధచే
యమును నిరామిషంబును ఖరాంగభవంబగు నెమ్ముఁ గుక్క దా
నమలుచుఁ జెంతనున్న సురనాథునిఁ గాంచి సిగ్గుఁ జెంద ద
ల్పమని నిజస్వభావము దలంపదు నీచపుఁ బ్రాణియెయ్యెడన్.

తా. ఒకకుక్కకు నొకయెముక దొరకెను. అది గాడిదయెముక. దాని యందు మాంసలేశమైనయు లేదు. పైగా పుచ్చిపోయి దుర్వాసన కలిగి యున్నది. అటువంటి యెముకను కుక్క ప్రేమతోఁ దినుచున్నది. ఆసమయమున దేవేంద్రుఁడు దగ్గరనున్నను లజ్జించునదికాదు. అనగా నీచజంతువు తానొకవస్తువు స్వీకరించుటనే జూచునుగాని యది యెంత అసహ్యకరమైనను దానిని పాటింపదు.

అవతారిక. అజ్ఞానమువలన గలుగు చెడుగులనుఁ దెల్పుచు జ్ఞానమే యావశ్యకమైనదని తెలుపుచున్నాడు.

శ్లో. శిరః శ్శార్వం స్వర్గా త్పశుపతి శిరస్తః క్షితిధరం
మహీధ్రాదుత్తుంగా దవని మవనే శ్చాపి జలధిం
అధో గంగా సేయం పద ముపగతా స్తోకమథవా
వివేకభ్రష్టానాం భవతి వినిపాత శ్శతముఖం. 10

శా. ఆకాశంబుననుండి శంభునిశిరం బందుండి శీతాద్రి సు
శ్లోకంబైన హిమాద్రినుండి భువి భూలోకంబు నందుండి యు
స్తోకాంభోధిఁ బయోధినుండి పవనాంధోలోకముం జేరె గం
గాకూలంకష పెక్కుభంగులు వివేకభ్రష్టసంపాతముల్. 10

త్రిలోకంబులందును ఖ్యాతివహించిన గంగానది మొదట స్వర్గమందుండి మహేశ్వరుని మస్తకమునందును, అక్కడనుండి హిమాలయ పర్వతముమీదను, గుల మెత్తయిన హిమవత్పర్వతమునుండి భూమియందును, దానినుండి సముద్రము నందును, సముద్రమునుండి పాతాళలోకమునకును వరుసగా పడుచువచ్చెను. ఈవిధముగ స్థానమునుండి జారిన వారికనేకవిధముల క్రిందుగాబోవుట కలుగుచున్నది. అట్లే మూర్ఖుల పాట్లనేకవిధములుగా నుండును.

శ్లో. శక్యో వారయితుం జలేన హుతభుక్ఛత్రేణ సూర్యాతపో
నాగేంద్రో నిశితాంకుశేన సమదో దండేన గోగర్ధభః।
వ్యాధిర్భేషజసంగ్రహైశ్చ వివిధైర్మంత్రైః ప్రయోగైర్విషం
సర్వస్యౌషధమస్తి శాస్త్రవిహితం మూర్ఖస్య నాస్త్యౌషధమ్. 11

చ. జలముల నగ్ని ఛత్రమున నెండ మయూఖుని దండతాడనం
బుల వృషగార్ధభంబులను బొల్పగు మత్తకరీంద్రమున్ సృణిన్
జెలఁగెడు రోగ మౌషధము చే విషముం దగు మంత్రయుక్తిని
మ్ములఁ దగఁజక్కఁజేయునగు మూర్ఖుని మూర్ఖత మాన్పవచ్చునే.

తా. నీటిచేత నిప్పును, గొడుగువలన ఎండను, కొట్టుటచే వృషభ గార్ధభములను, శూలముచే మదించిన యేనుగును, ఔషధమువలన రోగమును, మంత్రముచే విషమును నివారింపవచ్చును. కాని మూర్ఖుని మూర్ఖత్వమును మాన్పదగిన ఔషధము గాని మంత్రములు గాని లేవని చెప్పవచ్చును.

## అథ విద్వత్పద్ధతి.

అవతారిక. మూర్ఖపద్ధతికి వ్యతిరేకమయిన విద్వత్పద్ధతిని విశదీకరించుచున్నాను.

శ్లో. శాస్త్రోపస్కృతశబ్దసుందరగిరః శిష్యప్రదేయాగమా
విఖ్యాతాః కవయో వసంతి విషయే యస్య ప్రభోర్నిర్ధనాః।

తజ్జాడ్యం వసుధాధిపస్య సుధియ స్త్వర్థం వినాపీశ్వరాః
కుత్స్యాస్స్యుః కుపరీక్షకై ర్నమణయోయై ర ర్ఘతః పాతితాః 12

చ. సకలకలాభిభూషితులు ♦ శబ్దవిధుల్ నయతత్త్వ బోధకుల్
ప్రకటకవీంద్రు లేన్నృపతి ♦ కజ్జను నిర్ధనులై చరింతు రా
వికృతపుజాడ్య మా దొరది ♦ విత్తము లేకయ వారు పూజ్యులం
ధతజనదూషితంబులు ఘ ♦ నంబులుగావె యమూల్యరత్నముల్.

తా. సమస్తశాస్త్రముల నభ్యసించి నీతివేదాంత శాస్త్రముల నుపదేశింప సమర్థులైన కవులే రాజుదగ్గర నైన యుండగా వారు దరిద్రులైనచో నా లోపమా ప్రభువులదే గాని వారిదిగాదు. జాత్యంధులు రత్నములం జూచి తిరస్కరించిన మాత్రమున వానివిలువ తగ్గునా?

శ్లో. హర్తు ర్యాతి నగోచరం కిమపి శం పుష్ణాతి యత్సర్వదా
ప్యర్థిభ్య స్తః ప్రతిపాద్యమాన మనిశం ప్రాప్నోతి వృద్ధిం పరామ్।
కల్పాన్తేష్వపి న ప్రయాతి నిధనం విద్యాఖ్య మన్తర్ధనం
యేషాం తాన్ప్రతిమాన ముజ్ఝత నృపాః కస్తైస్సహాస్పర్థతే. 12

ఉ. హర్తకుఁ గాదు గోచర మ♦హర్నిశమున్ సుఖపుష్టి సేయు స
త్కీర్తిఘటించు విద్యయను♦దివ్యధనం బఖిలార్థ కోటికిం
బూర్తిగ నిచ్చినం బెరుఁగు♦బోదు యుగాంతపు వేళనైన భూ
భర్తలు తద్ధనాధికుల♦పట్టున గర్వము మాను టొప్పగున్.

తా. ధనమును తస్కరులు తస్కరించెదరు కాని విద్యాధనమటు తస్కరించుటకు శక్యముగానిది విద్యదివారాత్రములందు సుఖమిచ్చును. నిష్కళంకమగు కీర్తినిచ్చును. ధనమెవరికైననిచ్చిన తరుగును. కాని విద్యాధన మెందర కిచ్చినను దరుగదు. ప్రళయకాలమందైనను విద్యనశింపులేదు. కనుక విద్యాధికులవద్ద ధనపదులగు రాజులు గర్వముదక్కియుండుట మంచిది.

శ్లో. అధిగతపరమార్థాన్ పండితాన్ మావమంస్థా
స్తృణమివ లఘులక్ష్మీర్నైవ తాన్ సంరుణద్ధి।
అభినవమద రేఖాశ్యామగండస్థలానాం
న భవతి బిసతంతు ర్వారణం వారణానామ్.

తే. గీ. ప్రభులు పండితు లగువారి ♦ వలన గర్వ
కలన మానుడు వారు మీ ♦ కలిమి తృణము
లీలఁ బోలింప లేమి మ్మ ♦ ణాళ గుణము
భూరి మదవారణములకు ♦ వారణంబె. 14

తా. మదగజమును గాలి కెగిరిపోవు తామరతూండ్ల దారములచే బంధింప లేనట్లు రాజులధనము పండితులను స్వాధీనపరచుకోలేదు. పండితులు రాజులను తృణమట్లు చూచినను పండితులపట్ల రాజులోకము గర్వము లేకుండవలయును.

శ్లో. అమ్భోజినీవనవిహారవిలాసమేవ
హంసస్య హన్తి నితరాం కుపితో విధాతా
నత్వస్య దుగ్ధజలభేదవిధౌ ప్రసిద్ధాం
వైదగ్ధ్యకీర్తి మపహర్తు మసౌ సమర్థః. 15

చ. వనజభవుండు కోపమున ♦ వాహనమైన మరాళభర్తకున్
వనజవనీ విహార కల ♦ నంబుఁ దొలంగఁగ జేయుఁ గాని గుం
భనమున దుగ్ధజీవనవి ♦ భాగవిధాన నిరూఢనైపుణీ
జనిత మహా యశోవిభవ ♦ సారము హంసకు మాన్పఁ జాలునే ?

తా. విధాతదానెక్కు హంసనుకోపంబుచే తామరవనమునందు విహరించు వేడుకనుండి మాన్పగలడు. గానినీటినిపాలను విడదీయుటవలన బుట్టిన దానికీర్తిఁ బోగొట్టఁజాలడు. అటులనే పండితులపై రాజులకుఁ గోపమువచ్చిన తమదేశమం దుండి లేవగొట్టగలరు గాని వారిసర్వశాస్త్ర పరిశీలనాచాతుర్యము జెరుపజాలరు.

శ్లో. కేయూరాణి న భూషయన్తి పురుషం హారా న చంద్రోజ్జ్వలా
న స్నానం న విలేపనం నకుసుమం నాలంకృతా మూర్ధజాః
వాణ్యేకా సమలంకరోతి పురుషం యా సంస్కృతా ధార్యతే
క్షీయన్తే ఖలభూషణాని సతతం వాగ్భూషణం భూషణమ్. 16

ఉ. భూషలుగావు మర్త్యులకు ♦ భూరి మయాంగద తారహారముల్
భూషిత కేశ పాశమృదు ♦ పుష్పసుగంధజలాభిషేకముల్
భూషలు గావు పూరుషుని ♦ భూషితుఁ జేయుఁ బవిత్రవాణి వా
గ్భూషణమేసుభూషణము ♦ భూషణముల్ నశియించునన్నియున్

తా. పురుషులకు గొప్పవగు బంగారునగలు అందముకలుగఁజేయవు. వివిధ పుష్పములచే నలంకరించుటచేతను గంధము పన్నీరు మొదలగువాసన ద్రవ్యముల మైపూతలును అందముకలిగింప నేరవు. పురుషునికందమైనది వాక్చాతురియే అదియే అందమైనది. నశింపనిది. మిగిలిన వన్నియును నశించుననిభావము.

శ్లో. విద్యానామ నరస్య రూప మధికం ప్రచ్ఛన్నగుప్తం ధనం
విద్యా భోగకరీ యశస్సుకరీ విద్యా గురూణాం గురుః
విద్యా బంధుజనో విదేశగమనే విద్యాపరాదేవతా
విద్యా రాజసుపూజితా నహి ధనం విద్యావిహీనః పశుః

ఉ. విద్య నిగూఢగుప్త మగు ♦ విత్తము రూపము పూరుషాళికిన్
విద్య యశస్సు భోగకరి ♦ విద్య గురుండు విదేశబంధుడున్
విద్య విశిష్టదైవతము ♦ విద్యకు సాటిధనంబు లేదిలన్
విద్య నృపాలపూజితము♦ విద్య నెఱుంగనివాడు మర్త్యుడే. 17

తా. మనుజులకు విద్యయే దాచుకొనినధనము. విద్యయేరూపమును. కీర్తిని దెచ్చును. సుఖింపజేయునది విద్యయే. విద్యగురువువంటిది. దేశాంతరముల కేగిన విద్యయేబంధువు. విద్యాధనమునకు దగినధనమీప్రపంచమున లేదు విద్య యున్న దేవునిసహాయమున్నట్లే. పండితులగురాజులు విద్యనుపూజింతురు. ఇటువంటివిద్య నెఱుంగనివాడు రెండుపాద పశువని చెప్పుదురు.

శ్లో. క్షాన్తిశ్చే త్కవచేన కిం కిమరిభిః క్రోధోస్తి చే ద్దేహినాం
జ్ఞాతిశ్చే దనలేన కిం యదిసుహృద్దివ్యౌషధైః కిం ఫలం
కింసర్పై ర్యదిదుర్జనాః కిముధనై ర్విద్యానవద్యాయది
వ్రీడాచేత్కిము భూషణైస్సుకవితా యద్యస్తి రాజ్యేనకిం. 18

చ. క్షమ కవచంబు క్రోధ మది ♦ శత్రువు జ్ఞాతి హుతాశనుండు మి
త్రము దగుమందు దుర్జనులు♦దారుణ పన్నగముల్ సువిద్య వి
త్తము తెగులజ్జ భూషణము♦దా త్తకవిత్వము రాజ్య మీక్షమా
ప్రముఖపదార్థముల్ గలుగు ♦ పట్టునఁ దత్కవచాదు లేటికిన్? 18

తా. క్షమగలిగియున్నచో బాధలుదప్పించుకొనుటకు వేఱుగాకవచమక్కర లేదు. క్రోధమునుమించినశత్రువులేదు. సమస్తము నిర్మూలించుటకుదాయాదియున్న చాలును. వేఱుగానక్షి హోత్రము అక్కరలేదు. స్నేహితుని మించిన ఔషధము

లేదు. ప్రాణములుకోయుటకు దుర్జనులున్నచో సర్పములక్కఱలేదు. విద్యయేధనము. తగినంత లజ్జకలిగియుండుటయే అలంకారము. లోకులనువశము చేసికొనుటకు మంచి పాండిత్యముగాని కవిత్వముగాని యుండినచాలును. రాజ్యమక్కఱలేదు.

శ్లో. దాక్షిణ్యం స్వజనే దయా పరిజనే శాఠ్యం సదా దుర్జనే
ప్రీతి స్సాధుజనే నయో నృపజనే విద్వజ్జనే చార్జవమ్
శౌర్యం శత్రుజనే క్షమా గురుజనే కాంతాజనే ధృష్టతా
యే చైవం పురుషాః కలాసు కుశలా స్తే ష్వేవలోకస్థితిః 19

చ. వరకృప భృత్యులందు నిజ వర్గమునం దనుకూలవృత్తి కా
పురుషులయందు శాఠ్యమును బుద్ధులయం దనురక్తి దాల్మి స
ద్గురువులయందు గౌరవము కోవిదులందు నయంబు రాజులం
దరిజనులందు శౌర్యము మృగాక్షులయందుఁ బ్రగల్భభావ మీ
వరుసఁ గళాప్రవీణులగు వారలయందు వసించు లోకముల్. 19

తా. దాసులయందును బంధువులయందిష్టతయు, దుర్జనులందు శాఠ్యము, మంచివారలందు అనురాగము, ఓర్మి పెద్దలయందును, గౌరవము గురువులయందును, ప్రభువులయందు నీతివర్తనయు, శత్రువులయందు శౌర్యము, అంగనలందు గాంభీర్యము కలిగి యీవిధముగానడచుకొను వారలయందు లోకమనుకూలముగా నుండును.

శ్లో. జాడ్యం ధియో హరతి సించతి వాచి సత్యం
మానోన్నతిం దిశతి పాపమపాకరోతి
చేతః ప్రసాదయతి దిక్షు తనోతి కీర్తిం
సత్సంగతిః కథయ కిం న కరోతి పుంసామ్. 20

తే. గీ. సత్యసూక్తి ఘటించు ధీజడిమ మాన్చు
గౌరవ మొసంగు జనులకుఁ గలుష మడఁచుఁ
గీర్తిఁ బ్రకటించుఁ జిత్తవిస్ఫూర్తిఁ జేయు
సాధుసంగంబు సకలార్థసాధనంబు. 20

తా. సజ్జనుల స్నేహము సకలార్థసాధనము. ఎట్లనసత్యసంభాషణ కలిగించుచున్నది. బుద్ధిమాంద్యముఁ బారఁద్రోలుచున్నది. గౌరవముఁ దెచ్చుచున్నది. చెడు

బుద్ధులనడంచుచున్నవి. యశశ్చంద్రికల నిశాంతములవరకుఁగ వ్యాపించుచున్నది. మనస్సును రంజింపఁజేయుచున్నది. సాధుసంగమము మనుష్యులకుఁజేయని మేలొక్కటి యుఁగూడలేదు.

శ్లో. జయంతి తే సుకృతినో రససిద్ధాః కవీశ్వరాః
నాస్తి తేషాం యశః కాయే జరామరణజం భయమ్

క. సుకృతాత్ములు రససిద్ధులు
సుకవీంద్రులు విజయ నిధులు ♦ సుమ్ము తదీయా
ధిక కీర్తి శరీరంబులు
ప్రకట జరామరణ జన్మ ♦ భయ రహితంబుల్, 21

తా. కవిసత్తములు ధన్యాత్ములు రసపూర్తియుగలవారు. అందుచే సత్తమ జయస్వభావులు కనుక దమకీర్తి దేహములకు చావు పుట్టుకల భయములేక యుందురు.

# 3 మానశౌర్య పద్ధతి.

శ్లో. క్షుత్క్షామోపి జరాకృశోపి శిథిలప్రాయోపి కష్టాం దశా
మాపన్నోపి విపన్నదీధితిరపి ప్రాణేషు నశ్యత్స్వపి
మత్తేభేంద్ర విభిన్నకుంభ పిశితగ్రాసైక బద్ధస్పృహః
కిం జీర్ణం తృణ మత్తి మానమహతామగ్రేసరః కేసరీ. 22

ఉ. గ్రాసములేక స్రుక్కి జ ♦ రాకృశమైన విశీర్ణమైన సా
యాసమునైన నష్టరుచి ♦ యైనను ప్రాణభయార్తమైన సం
త్రాస మదేభకుంభ పిశి ♦ తగ్రహలాలనశీలసాగ్రహా
గ్రేసరభాసమాన మగు ♦ కేసరి జీర్ణతృణంబు మేయునే?

తా. సింగమంత యాకలిచేమాడినను, ముసలితనముచే నెంతచిక్కినను, అవయవపటుత్వము దప్పినను, ఆయాసస్థితియందున్నను, కాంతిఁ దప్పినను ప్రాణము పోవునంతటి విచారమైనను భయముచే నాలగు మత్తేభ కుంభస్థలము నే దినునుగాని గడ్డిమాత్రము దినుట కిచ్చగించునా? ఇచ్చగింపదు. ఇట్లేమానము గలవాఁడెన్నటికిని చెడ్డపనులను జేయఁబూనఁడు.

శ్లో. స్వల్పస్నాయువసావశేషమలినం నిర్మాంసమప్యస్థికం
శ్వా లబ్ధ్వా పరితోష మేతి నచ తత్తస్యక్షుధా శాంతయే

సింహో జంబుక మంక మాగత మపి త్యక్త్వా నిహంతిద్విపం
సర్వః కృచ్ఛ్రగతోఽపి వాంఛతి జన స్సత్త్వానురూపం ఫలమ్. 23

ఉ. స్నాయువసావశేషమలి ♦ నమ్మగు నెమ్ము గ్రహించి జాగిలం
బాయతమోద మందు జనఁ ♦ దాఁకలి దానికిఁ జెంతనున్న గో
మాయువు దానిఁ జూచి పరి ♦ మార్పక సింగము దంతిఁ గూల్చు నీ
చాయల నెల్లవారు నిజ ♦ సత్త్వ సమాన ఫలార్థులే గదా 23

తా. అసహ్యకరమగు కంపుకలిగిన యొకసన్నని పశువు యెముక మాంసము లేనిది కుక్కకు దొరకినచో నది సంతోషించును. కాని దాని యాకలిదీరదు. సింహము దగ్గర నక్కయున్నను మదగజమును నేచంపును. జంతుజాలమంతయు తమ శక్తి లక్షించిన ఫలమునే కోరును.

శ్లో. లాంగూలచాలన మధశ్చరణావఘాతం
భూమౌ నిపత్య వదనోదరదర్శనం చ।
శ్వా పిండదస్య కురుతే గజపుంగవ స్తు
ధీరం విలోకయతి చాటుశతైశ్చ భుంక్తే. 24

ఉ. వాలముఁ ద్రిప్పు నేలఁబడి ♦ వక్త్రము కుక్షియుఁ జూపు గ్రిందటం
గాలిడు ద్రవ్వుఁ బిండదుని ♦ కట్టెదుటన్ శునకంబు భద్రశుం
డాలము శాలితండుల గు ♦ డంబులు చాటువచశ్శతంబుచే
నోలి భుజించు ధైర్యగుణ ♦ యుక్తిగఁ జూచు మహోన్నతస్థితిన్. 24

తా. శునకము ఆకలిగానున్నప్పుడు తనకుఁ బిండము వేయువానిదగ్గరకుఁ జేరి నోటిని పొట్టను జూపును. క్రిందబడి పొర్లును. నేలను ద్రవ్వును, అది నీచజంతు వగుటచే యట్లు చేయుచున్నది గాని మదపుటేనుఁగు మంచిమాటలతో మావటీడు తనకు బెల్లము, బియ్యము బెట్టుచుండఁ దినుచు ధైర్యముగా నుండును.

శ్లో. పరివర్తిని సంసారే మృతః కో వా న జాయతే।
స జాతో యేన జాతేన యాతి వంశ స్సమున్నతిమ్. 25

తే. గీ. ప్రాణిలోకంబు సంసార ♦ పతిత మగుట
వసుధపై నిట్టె పుట్టని ♦ వాఁడు గలఁడె?

వానిజన్మంబు సఫలమౌ ♦ జ్ఞాని వలన
వంశ మధికోన్నతి వహించి ♦ వన్నెకెక్క. 25

తా. ప్రాణికత్తాను జేసికొనిన పుణ్యపాపములననుసరించి చావుపుట్టుకలు కలుగును తిరిగితిరిగి సంసారచక్రమునందు వగుల్పుచునివ్వాని వాఁడెవ్వఁడుగలఁడు? పుట్టినవాఁడు ఊరక పుట్టినంతమాత్రమునఁ బ్రయోజనములేదు. ఎవ్వఁడు పుట్టి తన వంశమునకు వన్నెదెచ్చునో యాతని పుట్టుకయే పుట్టుక. తేనియెడల యాతని పుట్టుక వ్యర్థము.

శ్లో. కుసుమ స్తబకస్యేవ ద్వయీవృత్తి ర్మనస్వినః
మూర్ధ్ని వా సర్వలోకస్య శీర్యతే వనఏవ వా. 26

తే. గీ. కుసుమగుచ్ఛంబునకుఁ బోలె ♦ బొసగు శౌర్య
మానవంతున కివి రెండు ♦ మహితగతులు
సకలజనమ స్తకప్రదే ♦ శముల నైన
వనమునం దైన జీర్ణ భా ♦ వంబుఁ గనుట.

తా. ఏమనుష్యునకు మానధైర్యములు గలవో వాఁడు పుష్పమునకువలె రెండు మార్గములు గలవాఁడగుచున్నాఁడు. పుష్పము మనుజుల తలయందుండి కాలచక్రమున జీర్ణించును లేక వనమునందే జీర్ణించును. అట్లే మనుజుఁడుగూడ సకలజనులచేతను శిరసావహింపఁబడి కాలక్రమమున జీర్ణించును, లేదా వనమునందే జీర్ణించుచున్నాఁడు.

శ్లో. సన్త్యన్యేపి బృహస్పతిప్రభృతయః సంభావితాః పంచషా
స్తాన్ప్రత్యేషవిక్రమరుచీ రాహుర్న వైరాయతే।
ద్వావేవ గ్రసతే దివాకరనిశాప్రాణేశ్వరౌ భాస్వరౌ
భ్రాతః పర్వణి పశ్య దానవపతి శ్శీర్షావశేషాకృతిః. 27

మ. గురుముఖ్యుల్ గల తేవురార్వురుశుభాంగుల్ ఖేచరుల్ వారితో
పరాక్రాంతివిహారి రాహు వెపుడున్ ♦ వైరంబుసేయండు భా
స్వరులన్ భాస్కరయామినీచరులనే ♦ బాధించుచున్నాఁడు వి
స్ఫురతన్ మస్తకశేషమూర్తియగు నా ♦ దైత్యుండుగర్వంబునన్.

తా. మంగళస్వరూపులును, తేజోవంతులు నగు బృహస్పతి మొదలగు వారైదారుగురుండగా రాహువు పరాక్రమవంతుఁడగువారలతో వైరమూనక తేజోవంతులగు శశిసూర్యులనే పర్వదినములందు బాధించుచున్నాఁడు.

శ్లో. వహతి భువనశ్రేణిం శేషః ఫణాఫలకస్థితాం
కమఠపతినా మధ్యే పృష్ఠం సదా స చ ధార్యతే।
తమపి కురుతే క్రోడాధీనం పయోధి రనాదరా
దహహ మహతాం నిస్సీమాన శ్చరిత్రవిభూతయః. 28

మ. భువనశ్రేణి వహించు శేషుఁడు ఫణా ♦ భోగంబుపై సంతతం
బవలీలన్ ధరియించుఁ బృష్ఠమున గూ ♦ ర్మాధీశ్వరుం డాతనిన్
ధవళక్రోడ వశాత్ముఁ జేయు నతనిన్ ♦ వారాశి యుక్రాంతిచే
నవురా! ధీరచరిత్రసంపద లసం ♦ ఖ్యాత ప్రభావోన్నతుల్.

తా. పదునాల్గు లోకములు నొకదానిపై నొకటి దొంతిగాయుండ వానిని ఆదిశేషుఁడు తనపడగలచే మోయుచున్నాఁడు. ప్రళయకాలమందుఁ బాతాళమంటిన యాకూర్మమును ఆదివరాహము ధరించుచున్నది కాన ఘనశౌర్యవంతుల ప్రభావము లాశ్చర్యకరములుగదా.

శ్లో. వరం ప్రాణోచ్ఛేద స్సమదమఘవన్ముక్తకులిశ
ప్రహారై రుద్గచ్ఛద్బహుళదహనోద్గార గురుభిః
తుషారాద్రేస్సూనో రహహ పితరి క్లేశవివశే
న చాసౌ సంపాతః పయసి పయసాం పత్యు రుచితః 29

చ. సమధికభీషణ జ్వలన ♦ జాలవినిర్గమదుస్సహంబుచే
సమదసురేంద్రముక్తకులి ♦ శక్షతిచే నుచితంబు ప్రాణఘా
తము హిమవత్కుమారునకుఁ ♦ దండ్రి నిశాతశతారపాతఖే
దమున మునుంగుచున్నతఱిఁ ♦ దా జలరాశిఁ దొలంగ నర్హమే.

తా. దేవేంద్రుండు తనవజ్రాయుధముచే హిమవంతుని గొట్టుచుండ హిమవంతుని కుమారుఁడగు మైనాకుండు సముద్రములోదాగుట పాడిగాదు. ఇంద్రుఁడు గర్జించి వజ్రాయుధముచే నగ్నికణములు రేగునట్లు కడుదుస్సహముగా వేయు వేట్లులచే జచ్చుట చాలమంచిది. అంతియేకాని తండ్రి బాధపడుచుండగా తాను దాగుటఁదగదు.

శ్లో. యదచేతనోపి పాదైః స్పృష్టః ప్రజ్వలతి సవితురినకాన్తః
తత్తేజస్వీ పురుషః పరకృతనికృతిం కథంసహతే.

తే. గీ. అర్కకాంత మచేతనం బయ్యు సవితృ
పాదములు సోకినంతనే ప్రజ్వరిల్లు
మానవుఁ డభిమానవంతుఁ డైన శత్రు
కృతతిరస్కార మెట్లు సహింపనేర్చు ? 30

తా. సూర్యుని కిరణములు సోకినంతనే సూర్యకాంతమణి మండుచున్న ఆది అచేతనము, అచేతనవస్తువులే మండుచుండ శత్రువుల యనాదరము మాన శౌర్య సంపన్నుఁడైన పురుషుఁడెట్లు సహించగలడు.

శ్లో. సింహః శిశురపి నిపతతి మదమలినకపోలభిత్తిషు గజేషు।
ప్రకృతి రియం సత్త్వవతాం న ఖలు వయ స్తేజసాం హేతుః.

క. విదళింప నుఱుకుసింగపుఁ
గొదమయు మదమలినగండ కుంజరములపై
నిది బలశాలికి నైజము
గద తేజోనిధికి వయసు కారణమగునే ?

తా. కేసరికిశోరము మదించిన ఏనుఁగునుజూచి దానిమీద కెగిరిపడుటకై ప్రయత్నించును. బలవంతుల కిలక్షణము (స్వభావము) తేజోవంతులకును, బలవంతులకును వయస్సుతోఁ బనిలేదు.

## ౪ అర్థపద్ధతి.

శ్లో. జాతి ర్యాతు రసాతలం గుణగణ స్తత్రాప్యధో గచ్ఛతాత్
శీలం శైలతటా త్పతత్వభిజన స్సందహ్యతాం వహ్నినా
శౌర్యే వైరిణి వజ్రమాశు నిపత త్వర్థోస్తు నః కేవలం
యే నైకేన వినా గుణా స్తృణలవప్రాయా స్సమస్తా ఇమే. 32

ఉ. జాతి దొలంగుఁగాత గుణశక్తి రసాతలసీమఁ గుంజనుం
గాత కులంబు బూదియగుఁ గాత నగంబుననుండి శీలముం
బాతముఁ జెందుఁ గాత బహుభంగుల విత్తమె మాకు మేలు వి
ఖ్యాత గుణంబులెల్లఁ దృణకల్పము లొక్క ధనంబు లేవడిన్. 33

తా. కులము చెడిపోయినను, గుణసామర్థ్యంబు అడుగంటినను వంశము బూదియైనను స్వభావము పర్వతాగ్రమునుండి పడి యధోగతి పాలైనను మాకు ధనమే ప్రధానము. ప్రసిద్ధికెక్కిన పూర్వోక్తగుణములు విడుచుటేల యనగా ధనములేక పోవుటచే యవియన్నియు నిష్ప్రయోజనములు.

శ్లో. యస్యాస్తి విత్తం సనరః కులీనః సపండిత స్సశ్రుతవాన్ గుణజ్ఞః
సఏవ వక్తాసచ దర్శనీయః సర్వేగుణాః కాంచన మాశ్రయన్తి.33

క. ఏనరునకు విత్తముగల
దానరుఁడు కులీనుఁ డధికుఁ ♦ డార్యుఁ డతండే
ధీనిధి ధన్యుఁడు నేర్పరి
నానాగుణగణము కాంచ ♦ నంబున నిలుచున్.

తా. ప్రపంచమున ద్రవ్యమునకి గలవాఁడు విద్య, మంచినడవడి, బుద్ధి కలవాఁడు పుణ్యాత్ముఁడు, సామర్థ్యములు గలవాడునగుచున్నవాఁడు. సకల గుణములును బంగారమును బట్టియేయుండును.

శ్లో. దౌర్మంత్ర్యాన్నృపతి ర్వినశ్యతి యతి స్సంగాత్సుతో లాలనా
ద్విప్రోనధ్యయనాత్కులం కుతనయా చ్ఛీలం ఖలోపాసనాత్
హ్రీర్మద్యా దనవేక్షణా దపి కృషిః స్నేహః ప్రవాసాశ్రయా
న్మైత్రించాప్రణయా త్సమృద్ధిరనయాత్త్యాగాత్ప్రమాదాద్ధనమ్.34

మ. యతి సంగంబున బాలుఁ డాదరముచే ♦ జ్యాభర్త దుర్మంత్రిచే
శ్రుతహీనిన్ ద్విజుఁ డన్వయంబు ఖలుచే ♦ గ్రూరాప్తిచే శీలము
ద్ధతిచే మిత్రత చూపులేమి కృషి మ ♦ ద్యప్రాప్తిచే సిగ్గు దు
ర్మతిచే సంపదలున్ నశించు జెడున ♦ ర్థంబుల్ ప్రమాదంబునన్.

తా. యోగిసంగమమువలన, పుత్రుఁడులాలనముచేయుట చేతను, రాజు దుర్మంత్రుల మాటవినుట చేతను, బ్రాహ్మణుఁడు వేదశాస్త్రాధ్యయనము లేక పోవుటచేతను, దుష్పుత్రుని వలన కులము, దుర్జనులస్నేహముచే శీలము, కల్లు త్రాగుటవలన లజ్జయు, అనురాగములేమి మైత్రియు, పరామర్శములేమి పొలము, నీతిలేమివలన సంపదయు, ప్రమాదమువలన ధనము నశించిపోవును.

శ్లో. దానం భోగో నాశ స్తిస్రోగతయోభవన్తి విత్తస్య
యోన దదాతి న భుంక్తే తస్య తృతీయాగతి ర్భవతి.

క. దానము భోగము నాశము
పూనికతో మూడు గతులు భువి ధనమునకున్
దానము భోగము నెఱుగని
దీనుని ధనమునకు గతి దృతీయమె పొసఁగన్.

తా. దానము, భోగము, నాశము యనిమూఁడు మార్గములుగా ధనము భూమియందు ఖర్చగును. ఒకరికీయక దాననుభవింపక యుంచు ధనమునకు మూఁడవదియగు నాశనమే ప్రాప్తించును.

శ్లో. మణి శ్శాణోల్లీఢ స్సమరవిజయీ హేతిదళితో
మదక్షీణో నాగ శ్శరది సరి దాశ్యానపులినా
కమలాశేష శ్చంద్ర స్సురతమృదితా బాలవనితా
తనిమ్నా శోభన్తే గళితవిభవా శ్చార్థిషు నరాః. 36

ఉ. శాణవిఘృష్టరత్నమును శస్త్రహతుం డగుశూరుఁడున్ మద
క్షీణగజంబు సైకతవిశిష్టశరన్నదియున్ నవక్షపా
ప్రాణవిభుండు చండసురతాలసబాలికయున్ ధనైకవి
శ్రాణనశూరులుం గృశత్వమునం బ్రభఁ గాంతురిద్ధరన్. 36

తా. రత్నమును సానమీద యరుగదీయుట చేతను, శూరుఁడు శస్త్రములచే దెబ్బలుదినుటవలననుఁ మదజలము స్రవించుటచేయేనుఁగయుశరత్కాలమందుకొంచెమెండి యిసుకతిన్నెలుగల నదియు, ఒకేకళగల చంద్రుఁడును, ముగ్ధబాలికగాఢరతివలనను, ద్రవ్యము యాచకులకిచ్చి దరిద్రుఁడైనయాతఁడును, ఎంతకృశించినను ఆదాతృత్వమే వారికి శోభ కలిగించును.

శ్లో. పరిక్షీణః కశ్చిత్ స్పృహయతి యవానాం ప్రసృతయే
స పశ్చాత్సంపూర్ణః కలయతి ధరిత్రీం తృణసమామ్
అతి శ్చానేకాన్తా గురులఘుతయార్థేషు ధనినా
మవస్థా వస్తూని ప్రథయతిన సంకోచయతిచ,

ఉ. చేరి యొకండు నెవ్వఁబడు ♦ చిక్కుచుఁ జేరెడు శాలిధాన్యమే
కోరు నతండు పిమ్మట న ♦ కుంఠధనోన్నతుఁడై వసుంధరం
బూరికె సాటిగాఁ దలఁచు ♦ భూరి ధనాఢ్యుల చొప్పనేకమై
గౌరవమున్ లఘుత్వమును ♦ గైకొను వస్తువులందు నెల్లెడన్. 37

తా. ఒకఁడు దారిద్ర్యముచే బాధపడుచున్నప్పుడు పుడిసెడుయవలనేకోరుచున్నాఁడు. గాని యేకారణము వలననైన వానికే భాగ్యమబ్బినచో భూమిని గడ్డిపోచవలె తృణీకరించును. ఏమనుజులకైనను ధనమధిక మగుటవలన వారల క్రమమునేకరీతులమారి ఒకేవస్తువునందు యెక్కువ తక్కువ భేదము సూచింతెదరు.

శ్లో. రాజన్ దుధుక్షసి యది క్షితిధేను మేనాం
తేనాద్య వత్స మవలోక మముం పుషాణ
తస్మింశ్చ సమ్య గనిశం పరిపుష్యమాణే
నానాఫలం ఫలతి కల్పలతేవ భూమిః

తే. గీ. ధరణి ధేనువుఁ బిదుకంగ ♦ దలచి తేని
జనులఁ బోషింపు మధిపవ ♦ త్సముల మాడ్కి
జనులు పోషింపఁబడుచుండ ♦ జగతి కల్ప
లతి తెఱంగున సకలఫ ♦ లంబు లొసంగు.

తా. భూమియను ధేనువును పిదుకదలచినచో జనుల నందఱను దూడ్డలవోలె గాపాడుము. అవిఘ్నముగా రక్షించినచో భూమి కల్పవృక్షమువలె కోరిన వానినన్నింటిని యిచ్చును.

శ్లో. సత్యానృతాచ పరుషా ప్రియభాషిణీచ
హింసా దయాళు రపి చార్థపరా వదాన్యా
నిత్యవ్యయా ప్రచురనిత్యధనాగమాచ
వారాంగనేవ నృపనీతి రనేకరూపా.

తే. గీ. సత్య మనృతంబు పరుషోక్తి ♦ సరసభాష
ప్రాణి హింసయు దయయును లో ♦ భంబు నీగి

కనకసంగ్రహావ్యయములు ♦ గలుగు వార
రమణి కైవడి బహురీతి ♦ రాజనీతి.

తా. వెలయాలివలె రాజనీతి నిజము పలుకుటొకప్పుడును, అబద్ధములాడు టొకప్పుడును, మఱొకతరిఁ జంపుటయును, వేరొకమారు కనికరము కలిగియుండు టయు ధనలోభముఁ జూపు టొకరియు, దానముసేయు టొకప్పుడును, ప్రతిరోజు ధనవ్యయము గలిగియుండుటయు, ప్రతిరోజు ధనసంగ్రహము కలిగియుండుటయు నానావిధములుగా నుండును.

శ్లో. ఆజ్ఞా కీర్తిః పాలనం బ్రాహ్మణానాం
దానం భోగో మిత్రసంగక్షణంచ
యేషా మేతే షడ్గుణాన ప్రవృత్తాః
కోర్థ స్తేషాం పార్థివోపాశ్రయేణ

తే. గీ. ఆజ్ఞయును గీర్తియును భూసు ♦ రావనంబు
దానమును భోగమిత్రసం ♦ త్రాణనములు
షడ్గుణంబులు గలుగ వే ♦ జనులయందు
వారిఁ గొల్చిన ఫల మేమి ♦ వసుమతీశ.

తా. ఏరాజునందు శాసనము, దిశాంతములవరకు వ్యాపించిన కీర్తియు, బ్రాహ్మణ రక్షణ, పాత్రాపాత్రత నెఱింగి దానముచేయుట, లోభత్వములేక సేవించుట నిష్ప్రయోజనము.

శ్లో, యద్ధాత్రా నిజఫాలపట్టలిఖితం స్తోకం మహద్వా ధనం
తత్ప్రాప్నోతి మరుస్థలేపి నితరాం మేరౌచ నాతోధికమ్
తద్ధీరో భవ విత్తవత్సు కృపణాం వృత్తిం వృథా మాకృథాః
కూపే పశ్య పయోనిధా వపి ఘటో గృహ్ణాతి తుల్యం జలమ్.

చ. వనజభవుండు నెన్నొసట ♦ వ్రాసినసొమ్ము ఘనంబొ కొంచమో
విను మరుభూమికేగిన లభించును మేరువుఁ జేరఁ బోయినన్

ధనమధికంబు రాదు కదు ♦ దైన్యముమూరు ధనాఢ్యులందు న
వ్వననిధి నూతఁ దుల్యముగ ♦ వారిగ్రహించుఘటంబుచూడుమా

తా. ఏమనుజునకైనను బ్రహ్మదేవుఁడు నొసటయందెంతధనము కలుగునట్లు వ్రాసినాఁడో యాధనము ఈషణ్మాత్రమైనను తక్కువగాక శ్మశానభూమియందైనను లభించును. బంగారమునిండిన మేరుపర్వతను జేరినను నంతకంటె నెక్కువ లభింపదు. కావున ధనవంతులయొద్ద దీనముగా నుండుటచేత నిందగలుగునేగాని ధనమెక్కువరాదు. బావియందు కుండ ఎంతనీరుగ్రహించునో సముద్రమునందంతే గ్రహించును. గాని బావికంటె సముద్రము పెద్దదయినను ఎక్కువనీరు గ్రహింపదుగదా ?

## 5 దుర్జనపద్ధతి

శ్లో. అకరుణత్వ మకారణవిగ్రహః
పరధనే పరయోషితి చ స్పృహా
సుజనబన్ధుజనే ష్వసహిష్ణుతా
ప్రకృతిసిద్ధ మిదంహి దురాత్మనామ్॥ 42

తే. గీ. కారణము లేనికలహంబు ♦ గరుణలేమి
పరవధూపరధనవాంఛ ♦ బంధుసాధు
జనములం దసహిష్ణుత్వ ♦ మనఁగ జగతిఁ
బ్రకృతి సిద్ధంబు లివి దుష్టనికరమునకు. 43

తా. దుర్జనుల నాదరింప గూడదెందుచేత ననగా దయ యుండదు. కారణములేకుండగనే పోట్లాడుదురు. పరస్త్రీలను సదా కోరుచుందురు. పరధనాపహరణమునకై ప్రయత్నింతురు. సుజనులయందు బంధువులయందు ఓర్మి కలిగి యుండరు.

శ్లో. దుర్జనః పరిహర్తవ్యో విద్యయాలంకృతోఽపిసన్
మణినా భూషిత స్సర్పః కి మసౌ న భయంకరః॥ 43

తే. గీ. విద్యచే భూషితుండయి ♦ వెలయుచున్నఁ
దొడరి వర్జింప నగుఁ జుమీ ♦ దుర్జనుండు

చారుమాణిక్యభూషిత ♦ శస్తమస్త
కం బయినపన్నగము భయం ♦ కరముగాదె? 43

తా. పాముపడగయందు రత్నమున్నను యాజంతువు క్రూరమైనదగుటచేఁ బరిత్యజించుచున్నాము. అట్లే దుర్జనుఁడు చదువుకొన్నవాఁడైనను వానిదుష్టత్వమును బట్టి త్యజింపవలయును.

శ్లో. జాడ్యం హ్రీమతి గణ్యతే వ్రతరుచౌ దంభశ్శుచౌ కైతవం
శూరే నిర్ఘృణతా మునే ర్విమతితా దైన్యం ప్రియాలాపిని
తేజస్విన్యవలిప్తతా ముఖరతా వక్తర్యశక్తిః స్థిరే
తత్కో నామగుణో భవేత్స గుణినాం యో దుర్జనైర్నాంకితః॥44

శా. హ్రీరమ్యుం జడుఁగాఁగ సువ్రతుని మా ♦ యింగా శుచిం దంభిగా
శూరున్ నిర్దయుఁగా మునిన్ విమతిగా ♦ శ్రోత్రప్రియాలాపు ని
స్సారుంగా బలవంతు గర్వితునిగా ♦ సద్వక్త వాచాలుఁగాఁ
గ్రూరుం డెన్న సుధీగుణంబు దురితా ♦ రూఢంబు జేయుంగదా.

తా. దుర్జనులు లజ్జగలవానిని వివేకములేనివానిగను, వ్రతానుష్ఠుని డాంబికునిగాను, సహజనిర్మలుండగువానిని కపటిగాను, శౌర్యవంతుల నిర్దాక్షిణ్యవంతులుగాను, మౌనుని తెలివిలేనివానిగాను అమృతములొలుకునట్లు మాటలాడువానిని గస హీనునిగాను, తేజముగలవానిని గర్విగాను, పండితుని వాచాలునిగాను దలంచెదరు.

శ్లో. లోభ శ్చేదగుణేన కిం పిశునతా యద్యస్తి కిం పాతకైః
సత్యం చే త్తపసా చ కిం శుచి మనో యద్యస్తి తీర్థేన కిం
సౌజన్యం యది కిం బలేన మహిమా యద్యస్తి కిం మండనైః
సద్విద్యా యది కిం ధనై రపయశో యద్యస్తి కిం మృత్యునా. 45

చ. వగగొనులోభముం బిశున ♦ భావము సత్యము చిత్తశుద్ధియుం
దగుసుజనత్వమున్ సుమహి ♦ తత్వము విద్యయు లోకనిందయుం
దగిలిన దుర్గుణంబు దురి ♦ తంబుఁ దపంబును తీర్థసేవ భృ
త్యగణము సొమ్ములుం ధన ♦ చయంబును జావును వేఱయున్నదే.

తా. దుర్గుణములలో లోభమే మిగుల నింద్యార్హమైనది. పాతకములలో మొదటిపాతకము కొండెములు చెప్పుటయే దానివలన నరకకూపమున బడవలసి వచ్చును. నియమములో సత్యనియమమును మించినదిలేదు. నిర్మలమైన మనస్సుగలిగి యుండుటయు మోక్షదాయకమైన పుణ్యతీర్థము. మంచితనముకన్న సేవకొనసమూహమును గౌరవముకన్న యలంకారమును, సువిద్యకంటె మించిన ధనమును ప్రపంచమునందు లేవు.

శ్లో. శశీ దివసధూసరో గళితయౌవనా కామినీ
సరో విగతవారిజం ముఖ మనక్షరం స్వాకృతేః
ప్రభు ర్ధనపరాయణ స్సతతదుర్గతి స్సజ్జనో
నృపాంగణగతః ఖలో మనసి స ప్త శల్యాని మే॥ 46

చ. దినమలినాంగుఁడైనహిమ♦దీప్తియు బ్రాయముదప్పునాతియున్
నరుహశూన్యమౌకొలను ♦ వర్ణితరూపు నిరక్షరాస్యమున్
నపరుఁడైనరాజు సత ♦ తంబును లేమిని గుందుసాధువున్
నపతిచెంత దుర్జనుఁడు ♦ శల్యము లేడివి నామనంబునన్. 46

తా. పగలు తేజముపోయిన చంద్రుడును, యౌవనముగడచిన వనితయు, తామరపువ్వులు లేని తటాకము, అందకాడము చదువులేకపోవుటయు, మిగుల ద్రవ్యాశకల, ప్రభువు, సదా దారిద్ర్యముగలిగిన సజ్జనుండును, రాజువద్ద దుర్మార్గుండును యీ యేడునునాకు శల్యములవలె దోచును.

శ్లో. న కశ్చిచ్చణ్డకోపానా మాత్మీయోనామభూభుజామ్
హోతారమపి జుహ్వానం స్పృష్టో దహతి పావకః॥

క. మనుజులలో నెవ్వఁడు దగఁ
దనవాఁ డనువాఁడు దుష్ట ♦ ధరణీశునకుం
దనకయి వ్రేలిమి వ్రేల్చెడు
జనుని తనువుఁ గాల్చు వాయుఁ ♦ సఖుఁ డదయుండై. 47

తా. తనకొఱకేమిఁ జేయుమన్నను సిద్ధపడియున్న వానిశరీరముగూడ గాల్చునట్టి నిప్పుఁవంటివాఁడగు రాజున కెంతయిష్టముగా మెలగినను రాజానుగ్రహుఁడు కానేరఁడు కావున వాని నాశ్రయించ గూడదు.

శ్లో. మౌనాన్మూకః ప్రవచనపటు ర్వాచకో జల్పకో వా
ధృష్టః పార్శ్వే భవతి చ వసన్ దూరతోఽప్యప్రగల్భః
క్షాంత్యా భీరుర్యది న సహతే ప్రాయశో నాభిజాతః
సేవాధర్మః పరమగహనో యోగినామప్యగమ్యః॥ 48

ఉ. మౌనముచేత మూగయు స ♦ మంచితవక్త ప్రలాపి చెంగటం
బూని వసింప దిట్టదను ♦ ముందట దవ్వుగ నుండె నే? శా
లీనుఁడు దాల్మి భీరుఁడవ ♦ లిప్తుఁడు దాలిమి లేనిబంటు భూ
జానులసేవ దుష్కర మ ♦ సాధ్యము యోగులకైననిద్ధరన్. 48

తా. ప్రభువులు నితిగా మాటాడినవానిని మూగవానిగను, యుక్తియుక్తముగా మాటాడిన ప్రేలరిగాను, ఎల్లప్పుడు దగ్గరగాయున్న దిట్టదనము గలవాఁడనియు దూరముగా నున్నచో శక్తిలేని వాఁడనియు, ఓర్మి కలిగియున్నచో పిరికియనియు, ధైర్యవంతుడయిన శాంతము లేనివాఁడనియుఁ జెప్పుదురు. కావున రాజులను గొల్చుట మునులకైనను కష్టతమమయినది.

శ్లో. ఉద్భాసితాఖిలఖలస్య విశృంఖలస్య
ప్రోద్గాఢవిస్మృతనిజాధమకర్మవృత్తేః
దైవాదవాప్తవిభవస్య గుణద్విషోఽస్య
నీచస్య గోచరగతైస్సుఖమాప్యతే కైః. 49

చ. ఖలు లగువారలం దురధి ♦ కారసమర్థులఁజేసి తా నిర
ర్గళగతియై నికృష్టనిజ ♦ కర్మము విస్మృతిపాలొనర్చి ని
శ్చలగుణవైరి యైవిధివ ♦ శంబున సంపద గాంచి క్రుళ్ళుచున్
మెలఁగు నృపాలుదేశమున ♦ మేలులభించునె యెట్టివారికిన్. 49

తా. సుజనుల నిష్టపడక కుజనుల కధికారములిచ్చి గొప్పను దెచ్చినట్టివాఁడును తన యిష్టానుసారము సంచరించువాఁడును సిగ్గులేనివాఁడయి పూర్వము జేసిన నీచపు బనులను మంచి అదృష్టవశమున కలిగిన యైశ్వర్యముచే మదించి సుగుణంబుల నొల్లక యుండువాఁడును నీచుఁడునైన ప్రభువుయొక్క పాలనమందు నివసించువాఁడెవ్వండును సుఖింప నేరఁడు.

శ్లో. ఆరంభగుర్వీ క్షయిణీ క్రమేణ
లఘ్వీ పురావృద్ధిముపైతి పశ్చాత్

దినస్య పూర్వార్థ పరార్థ భిన్నా
చ్ఛాయేవ మైత్రీ ఖలసజ్జనానామ్॥ 50

తే. గీ. మొదలఁ జూచిన గడుగొప్ప ♦ పిదపఁ గుఱుచ
యాదిఁ గొంచము తర్వాత ♦ నధిక మగుచుఁ
దనరు దనపూర్వపరభాగ ♦ జనితమయిన
చాయపోలిక గుజన స ♦ జ్జనులమైత్రి. 50

తా. కుజనుల స్నేహము ఉదయకాలమందలి నీడవలె మొదట పెద్దదిగా నుండి క్రమముగా తగ్గిపోవును. సుజనుల స్నేహము మధ్యాహ్నపు నీడవలె చిన్నదిగాయుండి క్రమక్రమముగా హెచ్చును. ఈరెంటిలో నేది శ్రేయమో విచారించి కొనవలయును.

శ్లో. మృగమీనసజ్జనానాం తృణజలసంతోషవిహితవృత్తీనాం
లుబ్ధకధీవరపిశునా నిష్కారణ మేవ వైరిణో జగతి॥

తే. గీ. కసవుచే నీటిచే మోద ♦ కలనచేత
బ్రతుకు మృగ మీన సజ్జన ♦ ప్రకరమునకు
శబరకైవర్తసూచక ♦ జనులు జగతిఁ
గారణము లేనిపగవారు ♦ గారె తలఁప. 51

తా. నీటిచేఁ జేపలును, గడ్డిచే జంతువులును, సంతోషముచే సజ్జనులును, బ్రతుకుచుండగాఁ జేపలను జాలారివాండ్రును మృగములను కిరాతులునుసజ్జనులను కొండెగాండ్రును బాధపెట్టుచున్నారు. పైవన్నియు, కారణములేని కలహములే కదా!

## ౬ సుజన పద్ధతి.

శ్లో. వాంఛా సజ్జనసంగతౌ పరగుణే ప్రీతి ర్గురౌ నమ్రతా
విద్యాయాం వ్యసనం స్వయోషితిరతి ర్లోకాపవాదా ద్భయం
భక్తి శ్శూలిని శక్తి రాత్మదమనే సంసర్గముక్తిః ఖలై
రేతే యేషు వసంతి నిర్మలగుణా స్తేభ్యోనమః కుర్మహే॥ 52

మ. సుకృతిశ్రేష్ఠులగోష్ఠియుం బరగుణ ♦ స్తోమంబునం బ్రీతి దే
శికసంసేవయు విద్యయందు రుచి స్వ ♦ స్త్రీ కేళి లోకాపవా
దకథాభీతియు విష్ణుభక్తి దమనో ♦ ద్యచ్ఛక్తియున్ సాధుదూ
షక సాంగత్యవిముక్తియుం గలమనీ ♦ షావంతులం గొల్చెదన్. 52

తా. సుజన సహవాసమందాసక్తియు, పరుల మంచిగుణములకు సంతోషించుట, సువిద్యలయందాసక్తియుండుట స్వస్త్రీకేళినే కోరుట, లోకాపవాద భీతియు దైవభక్తియుండుట. యనునీగుణంబు లెవ్వరికి గలవో వారు వందనార్హులు గాన వందనము జేయుచున్నాను.

శ్లో. విపది ధైర్య మథాభ్యుదయే క్షమా
సదసి వాక్పటుతా యుధి విక్రమః
యశసి చాభిరతి ర్వ్యసనం శ్రుతౌ
ప్రకృతిసిద్ధమిదం హి మహాత్మనామ్॥ 53

ఉ. ఆపదలందు ధైర్యగుణ ♦ మంచితసంపదలందు దాల్మియున్
భూపసభాంతరాళమునఁ ♦ బుష్కలవాక్చతురత్వ మాజి బా
హాపటుశక్తియున్ యశము ♦ నందనురక్తియు విద్యయందు వాం
ఛాపరివృద్ధియున్ బ్రకృతి ♦ జన్యగుణంబులు సజ్జనాళికిన్. 53

తా. మనోధైర్యము ఆపత్కాలమందు గలిగియుండుట సంపదలున్న కాలమందు ఓర్పు కలిగియుండుట విద్వత్సభలందు వాక్చాతుర్య మగపడునట్లు మాటలాడుట రణమునందు భుజశక్తి గలిగియుండుట, కీర్తి నిచ్చుకొనుటయందాసక్తియు విద్యయందు మిగుల నాసక్తియు నెడి యీగుణములు మహాత్ములకు స్వభావసిద్ధములై యుండును.

శ్లో. కరే శ్లాఘ్య స్త్యాగ శ్శిరసి గురుపాదప్రణయితా
ముఖే సత్యావాణీ విజయి భుజయోర్వీర్య మతులం
హృది స్వచ్ఛా వృత్తి శ్శ్రుత మధిగతంచ శ్రవణయో
ర్వినా ప్యైశ్వర్యేణ ప్రకృతి మహతాం మండనమిదం. 54

చ. కరమున నిత్యదానము ము ♦ ఖంబున సూనృతవాణి యౌదలం
గురుచరణాభివాదన మ ♦ కుంఠిత వీర్యము దోర్యుగంబునన్

వరహృదయంబునన్ విశద ♦ వర్తన మంచితవిద్య వీనులన్
సురుచిరభూషణంబు లివి ♦ సూరులకున్ సిరిలేనియప్పుడున్.

తా. చేతులతో సదా దానముచేయుట, సదా సత్యము నే మాటాడుట, గురు పాదారవిందములను శిరస్సున దాల్చుట, భుజయుగమునకు జయమునిచ్చు బలమును నిర్మలమగు మనస్సును, చెవులకు శాస్త్రశ్రవణమును నివి సత్పురుషులకు నైశ్వర్యములు లేకపోయినను గొప్ప యలంకారములు.

శ్లో. ప్రాణాఘాతా న్నివృత్తిః పరధనహరణే సంయమ స్సత్యవాక్యం
కాలే శక్త్యా ప్రదానం యువతిజనకథామూకభావః పరేషామ్
తృష్ణా స్రోతో విభంగో గురుషు చ వినయస్సర్వభూతానుకంపా
సామాన్యం సర్వశాస్త్రేష్వనుపహతవిధి శ్శ్రేయసా మేషపంథా

మ. పరహింసాపరకీయవిత్తహరణా ♦ భావంబు సత్య వ్రతా
దరముం దానపరత్వ మన్యవనితో ♦ దంతోక్తి మూకత్వముం
బరతృష్ణాఝురిభంజనంబు గురున ♦ మ్రత్వ బునుం బ్రాణభృ
త్కరుణాశాస్త్రసమత్వసద్విధులు భ ♦ ద్రప్రాప్తికిన్మార్గముల్. 55

తా. ఇతరులను హింసింపకుండుటయు, యితరుల ధనాపహరణోద్యుక్తుండు గాకుండుటయు, సత్యమునందాసక్తియు, శక్త్యానుసారంబుగా దానముం జేయుటయు, పరాంగనలమాటలు చెప్పకొనకుండుటయు, గురుజనులందు వినయవర్తనమును జంతుసముదాయమందు దయయుననునవి మంచిమార్గములు.

శ్లో. సంపత్సు మహతాం చిత్తం భవే దుత్పల కోమలం
ఆపత్సు చ మహాశైల శిలాసంఘాతకర్కశమ్.

తే. గీ. సంపదలుగల్గుతఱి మహా ♦ జనులహృదయ
మభినవోత్పలకోమలం ♦ బగుచు వెలయు
నాపదల నొందునపుడు మహా ♦ మహీధ
రాశ్మసంఘాతకర్కశ ♦ మై తనర్చు. 56

తా. మహానుభావులు సంపదగలిగియున్నప్పుడు గర్వముఁజెందక యప్పుడు వికసించినతామరపువ్వుబోలె నుందురు. దారిద్ర్యముచే కృశించినను పెనుకొండ యొక్క గండశిలవలె ధైర్యము చెడకయుందురు.

శ్లో. ప్రియా న్యాయ్యావృత్తి ర్మలిన మసుభఙ్గే ప్యసుకరం
త్వసన్తో నాభ్యర్థ్యా స్సుహృదపినయాంచ్యః కృశధనః
విపద్యుచ్చై ర్థైర్యం పదమనువిధేయంచ మహతా
సతాం కేనోద్దిష్టం విషమ మసిధారావ్రత మిదమ్.

మ. అసమానప్రియనీతివర్తనము ప్రా ♦ ణాంతంబునందున్ మలీ
మస మగ్రాహ్య మనుష్టయాచన మసం ♦ పత్ప్రార్థనాభావమున్
వ్యసనావాప్తిని ధైర్యముం బుధజనా ♦ త్యంతానుకూలత్వమీ
యసిధారావ్రతచర్య యెవ్వఁడు మహా ♦ ర్యశ్రేణికిం దెల్పెనో. 57

తా. న్యాయమగు నడవడి నే యిష్టపడుట. ప్రాణాపాయమందైనను దుష్కార్యములు చేయకుండుట, ఏవిషయమందును గాని నీచుల ప్రార్థింపకుండుట, ప్రాణస్నేహితుఁడైనను ధనహీనుఁడైనప్పుడు యాచింపకుండుట, ఆపత్కాలమందు ధైర్యమును గలిగియుండుట పండితుల కిష్టమైన వ్యాపారంబు నే చేయుట అనెడి యీ దుస్సాధ్యమైన అసిధారావ్రతము నెవ్వరు మహాత్ములకు బోధించిరో తెలియదు.

శ్లో. ప్రదానం ప్రచ్ఛన్నం గృహ ముపగతేసంభ్రమవిధిః
ప్రియంకృత్వా మౌనం సదసి కథనం చాప్యుపకృతేః
అనుత్సేకో లక్ష్మ్యాం నిరభిభవసారాః పరకథాః
సతాం కేనోద్దిష్టం విషమ మసిధారావ్రత మిదమ్. 58

మ. పొసగం దానము గుప్త మర్థిభవనం ♦ బుం జేరుచో సంభ్రమో
ల్లసదుత్థానవిధానముం బ్రియవిధుల్ ♦ గావించి మౌనంబు రా
జసభన్ మిత్రకృతప్రకాశనము గు♦ త్సాకర్మనై ముఖ్య మీ
యసిధారావ్రతచర్య యెవ్వఁడు ♦ మహార్యశ్రేణికం దెల్పెనో. 58

తా. చేసినదానము ఇతరులకు తెలియకుండుట, యింటికివచ్చినయాచకు నాదరించుట, అతనికి గావలసినదిచేసి యన్యున కెరుకపరచకుండుట, రాజవిద్వత్సభలందు తన స్నేహితుఁడు చేసినయుపకారము వెల్లడించుట, సంపదయున్నతటి గర్వములేకుండుట, ఇతరుల విషయముల్లు నిందారహితముగా మాటాడుట, యనెడి యీయసిధారావ్రత మెవ్వఁడు జనబృందమునకు నేర్పెనో కదా.

శ్లో. సంతప్తాయసి సంస్థితస్య పయసో నామాపినశ్రూయతే
ముక్తాకారతయా తదేవనలినీ పత్రస్థితం దృశ్యతే
అంతస్సాగర శుక్తి మధ్య పతితం తన్మౌక్తికం జాయతే
ప్రాయేణాధమమధ్యమోత్తమజుషా మేవంవిధావృత్తయః

ఉ. నీరము తప్తలోహమున నిల్చి యనామకమై నశించు నా
నీరమె ముత్యమట్లు నళినీదళసంస్థితమై తనర్చు నా
నీరమె శుక్తిలోఁబడి మణిత్వముఁ గాంచు సమంచిత ప్రభం
బౌరుషవృత్తు లిట్లధము మధ్యము నుత్తముఁగొల్చువారికిన్. 59

తా. కాలిన యినుముపై జలముఁ బోసినచో పేరులేకుండ నశించును. ఆ నీరే తామరాకుపైబడి తళతళ ముత్యమువలె ప్రకాశించును. ఆనీరే ముత్యపు చిప్పలోబడి రత్నరూపము పొందును. ఆవిధముగానే లోకంబునఁ నధముని మధ్యముని ఉత్తముని సేవింపని వారి కధమమధ్యమోత్తమ గుణంబులు పట్టుబడును.

శ్లో. ప్రీణాతి యస్సుచరితైః పితరం సపుత్రో
యద్భర్తురేవ హిత మిచ్ఛతి తత్కళత్రమ్
తన్మిత్రమాపది సుఖేచ సమక్రియం య
దేతత్త్రయం జగతి పుణ్యకృతో లభంతే.

చ. జనకుని బూజలం గడు బ్రసన్నుని జేయునతండు పుత్త్రుఁడే
వనిత మెలంగు భర్తృవశవర్తినియై యది సత్కళత్ర మే
జనుఁడు విపత్తిసౌఖ్యసదృశక్రియుఁ డాతఁడు మిత్త్రుఁ డీత్రయం
బును జగతిన్ లభించు గడు పుణ్యముఁ జేసిన యట్టివారికిన్. 60

తా. భక్తిమీర తండ్రిని బూజించి యాతని మెప్పుబడయునతండే నిజమయిన పుత్త్రుఁడు, భర్త సుఖముగోరునదే మంచి భార్య కష్టమందు గాని సుఖమందు గాని చెలిమి గలిగియుండు వాఁడే నిజమైన స్నేహితుఁడు. అత్యధిక పుణ్యాత్ములకే యిట్టి ముగ్గురు లభింతురు.

శ్లో. నమ్రత్వేనోన్నమంతః పరగుణకథనైః స్వాన్గుణాన్ఖ్యాపయన్త
స్స్వార్థాన్ సంపాదయంతో వితతపృథుతరారంభయత్నాః పరార్థే

క్షాంత్యైవాక్షేపరూక్షాక్షరముఖరముఖాందుర్జనా న్దుఃఖయన్తః
సంతస్సాశ్చర్య చర్యా జగతి బహుమతాః కస్యనాభ్యర్చనీయాః

చ. నతులగుచున్ మహోన్నతిఁ ♦ దనర్చుచునన్యగుణోక్తిచే గుణో
న్నతిఁ బ్రకటించుచుం బరజ ♦ నప్రియకార్యసమర్థతన్ సమం
చిత నిజకార్య సంగ్రహముఁ ♦ జేయుచు నిష్ఠుర వాదులన్ క్షమా
ధృతి నిరసించుచుం బరఁగు ♦ ధీరులు పుణ్యులు గారెయేరికిన్. 61

తా. వినయవర్తనచే గొప్పదనమందుచు పరులమంచిగుణంబుల నగ్గడించుచు దనుగుణంబుల బయలుపెట్టుకొనుచు నితరకార్యార్థమై దిరుగుచు దమకార్యము చక్కబెట్టుకొనుచు తమ్ముకఠినముగా మాటాడువారిని తమయోరిమిచే దిరస్కరించెడి మహాత్ములకు నమస్కారము చేయుచున్నాను.

## ఉపరోపకారపద్ధతి.

శ్లో. భవంతి నమ్రా స్తరవః ఫలోద్గమై
ర్నవాంబుభి ర్భూరివిలంబినో ఘనాః
అనుద్ధతా స్సత్పురుషా స్సమృద్ధిభిః
స్వభావ ఏవైష పరోపకారిణామ్.

తే. గీ. తరువు లతిరసఫలభార ♦ గురుతఁ గాంచు
నింగి వ్రేలుచు నమ్రత ♦ మొసంగు మేఘుఁ
డుద్ధతులు గారు బుధులు స ♦ మృద్ధి చేత
జగతి నుపకర్తలకు నిది ♦ సహజ గుణము. 62

తా. రసాల పనసాది వృక్షములు ఫలభారముచే వంగియున్నవి. నూత్న జలభారముచే మేఘములు వంగియున్నవి. సుజనులు సర్వసంపదలతోఁ గూడిన వారైనను గర్వముఁ జెందక గాంచింపకయే దానధర్మములుఁ జేయుదురు. పరోపకారాసక్తుల కది సహజగుణముకదా?

శ్లో. శ్రోత్రం శ్రుతేనైవ నకుండలేన
దానేన పాణి ర్నతుకంకణేన

విభాతి కాయః కరుణాపరాణాం
పరోపకారేణ న చందనేన

తే. గీ. అమరుఁ జెవి శాస్త్రమునఁ గుండ ♦ లమునఁ గాదు
వలయమున నొప్పు దీవిచే ♦ వెలయుఁ బాణి
యురుదయాఢ్యుల మేను ప ♦ రోపకార
కలన రాణించు గంధంబు ♦ వలనగాదు.

తా. పరోపకారశీలురకు శాస్త్రశ్రవణమువలననే కర్ణములకలంకార మగునుగాని బంగారు కుండలములచేత గాదు. సత్పాత్రదానమే వారి చేతుల కలంకారముగాని కంకణముచేత గాదు. వాని శరీరమునకు పరోపకారమే యలంకారముగాని చందనాది మైపూతలచేత గాదు.

శ్లో. పద్మాకరం దినకరో వికచం కరోతి
చంద్రో వికాసయతి కైరవచక్రవాలమ్
నాభ్యర్థితో జలధరోపి జలం దదాతి
సంతస్స్వయం పరహితే విహితాభియోగాః

తే. గీ. ద్యుమణి పద్మాకరము విక ♦ చముగఁ జేయుఁ
గుముదహర్షంబుఁ గావించు ♦ నమృతసూతి
యర్థితుఁడు గాక జల మిచ్చు ♦ నంబుధరుఁడు
సజ్జనులు దారె పరహితా ♦ చరణమతులు. 64

తా. తామరలచే సూర్యుఁడు యాచింపబడకయే వానిని వికసింపఁ జేయుచున్నాఁడు. కలువలచే యాచింపబడకయే చంద్రుఁడు వానిని వికసింపఁజేయుచున్నాడు. జనులచే మేఘుఁడు యాచింపబడకయే జలము గురియించుచున్నాడు కావున సుజనులు పరులు యాచింపకయే వారలకు సహాయముఁ జేయుదురు.

శ్లో. ఏతే సత్పురుషాః పరార్థఘటకా స్స్వార్థాన్ పరిత్యజ్యయే
సామాన్యాస్తు పరార్థ ముద్యమభృతః స్వార్థావిరోధేనయే
తేమీ మానుషరాక్షసాః పరహితం స్వార్థాయ నిఘ్నంతియే
యేతు ఘ్నంతినిరర్థకం పరహితం తే కే నజానీమహే, 65

మ. తమకార్యంబుఁ బరిత్యజించియుఁ బరా♦ర్థ ప్రాపకుల్ సజ్జనుల్
తమకార్యంబుఘటించుచుం బరహితా♦ర్థవ్యాపృతుల్ మధ్యముల్
తమకై యన్యహితార్థ ఘాతుకజనుల్♦ దైత్యుల్ వృథాన్యార్థఘం
గముగావించెడు వార లెవ్వరొ యెఱుం♦గన్ శక్యమే యేరికిన్

తా. తమకార్యములను విడిచి పరుల కుపకారమొనర్చువారు సత్తములు. తమ కార్యములఁ జేసికొనుచు నితరుల కుపకారమొనరించెడివారు మధ్యములు. తమకార్యము కొఱకు నితరకార్యములఁ జెడఁగొట్టువారు మనుష్యులను రక్కసులుగాన నధములు. తమకేప్రయోజనము లేకయే యితరుల కార్యముల జెరచువారెట్టి వారో తెలిసికొన శక్యముగాదు.

శ్లో. పాపా న్నివారయతి యోజయతే హితాయ
గుహ్యం నిగూహతి గుణాన్ ప్రకటీకరోతి
ఆపద్గతం చ న జహాతి దదాతి కాలే
సన్మిత్రలక్షణ మిదం ప్రవదంతి సన్తః

తే. గీ. అఘమువలన మఱల్చు హి♦తార్థకలితుఁ
జేయు గోప్యంబు దాఁచుఁ బో♦షించు గుణము
విడువఁ డాపన్ను లేవడి♦ వేళ నిచ్చు
మిత్రుఁ డీలక్షణంబుల♦ మెలఁగు చుండు. 66

తా. సుజనులు పాపకృత్యమునుండి మరల్చుట, మంచికర్మముల జేయుచు మిత్రుని రహస్యముల గుప్తముగానుంచుట, సుగుణంబుల నభివృద్ధిం జేసికొనుచు సహాయముఁ జేయుచుండుట, మొదలగు గుణంబులు మిత్రుని యందుండునని చెప్పిరి.

శ్లో. క్షీరేణాత్మగతోదకాయ హి గుణా దత్తాః పురా తేఖిలాః
క్షీరోత్తాపమవేక్ష్య తేన పయసా స్వాత్మా కృశానో హుతః
గన్తుం పావక మున్మన స్తదభవ ద్దృష్ట్వాతు మిత్రాపదం
యుక్తం తేన జలేన శామ్యతి సతాం మైత్రి పున స్త్వీదృశీ. 67

ఉ. క్షీరము మున్ను నీటికొసఁ♦గెన్ స్వగుణంబులు దన్నుఁ జేరుటన్
క్షీరముతప్తమౌట గని♦ చిచ్చుఱికెన్ జలచే జలంబు దు

ర్వార సుహృద్విపత్తిగని ♦ వహ్నిం జొరం జనె దుగ్ధమంతలో
నీరము గూడి శాంతమగు ♦ నిల్చుమహాత్ములమైత్రియాగతిన్.

తా. పాలు తన్ను జేరిన నీటికి తెల్లదనము, తీయదనము మొదలగు తనగుణము లన్నియు నిచ్చి మైత్రిజేసుకొనును. పిదప నా పాలాగ్నిచేతపించుట జూచిసహింప లేక యగ్నియందు తనశరీరము దగ్ధము జేసుకొనును. తనస్నేహితుడగు నీరున కిట్టి యాపద వచ్చెనని దుఃఖించి పాలు నిప్పులో పడిపోవుటకు యత్నింపగా జలము వచ్చి కలియుటచే యూఅడిల్లును. కావున సత్పురుషుని స్నేహ మిట్లేయుండును.

శ్లో॥ ఇత స్స్వపితి కేశవః కుల మిత స్తదీయద్విషా
మితశ్చ శరణార్థినాం శిఖరిణాం గణాః శేరతే
ఇతోఽపి బడబానలః సహ సమ స్తసంవ ర్తకై
రహో వితతమూర్జితం భరసహంచ సింధోర్వపుః. 68

చ. ఒకయెడం బవ్వళించు హరి యొక్కయెడన్ వసియించు రాక్షస
ప్రకరము లొక్కచో నడంగు♦బర్వతసంఘము లొక్కచోన్ బలా
హకములతోడ నుండు బడ♦బాగ్నియు విస్తృతమూర్జితంబునుం
బ్రకటభరక్షమం బగుచు♦భాసిలు నౌర సముద్రమెంతయున్. 68

తా. పదునాలుగు జగంబులు కుక్షియందుగలవిష్ణువు సముద్రమునం దొక చోట బరుండును. మఱొకచోట బడబాగ్నియుండును. వేఱొకచోట నింద్రాదు లకు భయపడి పరుగిడి వచ్చిన మైనాకాది మహాపర్వతములున్నవి. అయినను అంతులేని సముద్రమెంతయుం బ్రకాశించుచున్నది.

శ్లో॥ జాతః కూర్మ స్సఏకః పృథుభువనభరా యార్పితం యేన పృష్ఠం
శ్లాఘ్యం జన్మ ధ్రువస్య భ్రమతి నియమితం యత్ర తేజస్విచక్రం
సంజాతవ్యర్థపక్షాః పరహితకరణే నోపరిష్టాన్నచాధో
బ్రహ్మాండోదుంబరాంత ర్మశకవ దపరే జంతవో జాతనష్టాః.69

చ. వితతజగద్భరంబు దన ♦ వీపునం దాల్చినకూర్మనాథుడున్
సతతము చంద్రభాస్కరుల ♦ చక్రముం ద్రిప్పుధ్రువుండుసజ్జనుల్
ప్రతిభ నజాండజంతుఫల ♦ రంధ్రవశన్మశకంబులట్ల నిం
దితవిఫలార్థ సంగతి జ ♦ నించి నశించుం దదన్యజంతువుల్.

తా. అవతారములలో నాదికూర్మము పదునాల్గుభువనములను దనవీపున భరించుచున్నది. అవతారములలో నెల్లయదియే ధన్యజీవి ధ్రువుఁడు జ్యోతిశ్చక్రమును త్రిప్పుచున్నాఁడు. కాన యాతఁడు ధన్యుఁడు వారిద్దరి మధ్యగా సమస్త ప్రాణులు పుట్టుచుఁ గిట్టుచున్నవి ఈ ప్రాణులగతి మేడిపండులోని దోమలవిధముగా నున్నవిగదా ?

శ్లో. తృష్ణాం ఛింది భజ క్షమాం జహి మదం పాపేరతిం మా కృథాః
సత్యం బ్రూహ్యనుయాహి సాధుపదవీం సేవస్వ విద్వజ్జనమ్।
మాన్యాన్మానయ విద్విషోప్యనునయ ప్రఖ్యాపయ ప్రశ్రయం
కీర్తిం పాలయ దుఃఖితే కురు దయా మేత త్సతాంచేష్టితం. 70

శా. ఆశాసంహరణంబు నోర్మియు మద ♦ త్యాగంబు దుర్గోపవాం
ఛాశూన్యత్వము సత్యమున్ బుధమతా ♦ చారంబు సత్సేవయున్
వైశద్యంబును శత్రులాలనము మా ♦ న్యప్రీతియుం బ్రశ్రయ
శ్రీశాలిత్వము దీనులందుఁ గృపయున్ ♦ శిష్టాళికిన్ ధర్మముల్.

తా. సజ్జన వ్యాపారములేవియన, ఆశలేకుండుట, ఓర్మి కలిగి యుండుట, విద్యవలనమదము నడంచుట, పాపముపనులను జేయకుండుట, సత్యమందాసక్తి యుండుట, సన్మార్గవర్తనము కలిగియుండుట, విద్వజ్జనులం గొలుచుట, పూజ్యులను బూజించుట, పగవారినైనను లాలించుట, పెద్దలయెడ గౌరవముగ నుండుట, కీర్తిని రక్షించుకొనుట, దుఃఖితులందు దయకలిగి యుండుట.

శ్లో. మనసి వచసి కాయే పుణ్యపీయూషపూర్ణా
స్త్రిభువన ముపకారశ్రేణిభిః ప్రీణయన్తః
పరగుణపరమాణూన్ పర్వతీకృత్యనిత్యం
నిజహృది వికసన్తః సన్తిసన్తః కియన్తః. 71

చ. హృదయవచశ్శరీరముల ♦ నెంతయుఁ బుణ్యప్రపూర్ణులై
ముదముబహూపకారముల ♦ మూఁడుజగంబులకున్ ఘటించుచున్
వదలక సాధుసద్గుణల ♦ వంబులు కొండలు నేసి మెచ్చుచున్
మదిని వికాసయుక్తులగు-మాన్యులు కొందఱు వొల్తు రిద్ధరన్.

తా. మనోవాక్కాయంబుల పుణ్యమనే అమృతముచే నింపబడినవారై ఆనందంబును, ఉపకారము, త్రిలోకంబుల నుల్లసిల్లజేయువారును, ఇతరుల కొంచపు గుణములను గొప్పదిగాజేసి మనస్సునందు యానందించెడి సుజనులు కొందఱే కలరుగాని ఎక్కువమంది లేరు.

## ౭. ధైర్యపద్ధతి

శ్లో. రత్నైర్మహార్హైస్తుతుషుర్న దేవా
న భేజిరే భీమవిషేణ భీతిమ్
సుధాం వినా నప్రయయుర్విరామం
న నిశ్చితార్థా ద్విరమంతి ధీరాః

తే. గీ. తనిసిరే వేల్పు లుదధి ర ♦ త్నముల చేత
వెఱచిరే ఘోర కాకోల ♦ విషముచేత
విడిచిరే యత్న మమృతంబు ♦ వొడముదనుక
నిశ్చితార్థంబు వదలరు ♦ నిపుణమతులు. 72

తా. రాక్షసులు, దేవతలు అమృతాసక్తిచే పాలసముద్రమునుతఱచిరి అందు మొదట రత్నములు బుట్టినవి. ఆరత్నములతో దేవరాక్షసులు సంతోషింపలేదు. కొంత కాలమునకు ముల్లోకంబుల దహించువైచు హాలాహలం బను మహావిషముఁ బుట్టినది. దానికి వారు భయపడలేదు. వారు కోరిన యమృతము పుట్టువరకు చిలుకుటను మానలేదు. అట్లే ధైర్యవంతులు ప్రారంభించిన కార్యమగువరకు తమ యభిప్రాయమువదలరు.

శ్లో. ప్రారభ్యతే న ఖలువిఘ్నభయేన నీచైః
ప్రారభ్య విఘ్ననిహతా విరమంతి మధ్యాః
విఘ్నైర్ముహుర్ముహురపిప్రతిహన్యమానాః
ప్రారబ్ధ ముత్తమగుణా న పరిత్యజంతి.

శా. ఆరంభింపరు నీచమానవులు వి ♦ ఘ్నాయాస సంత్రస్తులై
యారంభించి పరిత్యజింతురట వి ♦ ఘ్నాయత్తులై మధ్యముల్
ధీరుల్ విఘ్ననిహన్యమానులగుచున్ ♦ ధృత్యున్నతోత్సాహులై
ప్రారబ్ధార్థము లుజ్జగింపరు సుమీ ♦ ప్రజ్ఞానిధుల్ గావునన్. 73

తా. విఘ్నములు కలుగునని భయముచే యధములు ఏపనిని ప్రారంభింపరు మధ్యములేపనినైన మొదలుపెట్టి మధ్యయాటంకము గలిగినేని మానివేయుదురు. ధైర్యమే మొదలిగుణముగాగల యుత్తములు తాము ప్రారంభించినపని నెఱవేరు వఱకు మాటిమాటికి విఘ్నములు గలిగినను విడువకఁ జేయుదురు.

శ్లో. క్వచి త్పృథ్వీశయ్యః క్వచి దపిచ పర్యంకశయనః
క్వచి చ్ఛాకాహారః క్వచి దపిచ శాల్యోదనరుచిః
క్వచి త్కంథాధారీ క్వచి దపిచ దివ్యాంబరధరో
మనస్వీ కార్యార్థీ న గణయతి దుఃఖం న చ సుఖం.

మ. ఒకచో నేలను బవ్వళించు నొకచో ♦ నొప్పారుఁ బూసెజ్జపై
నొకచో శాకము లారగించు నొకచో ♦ నుత్కృష్టశాల్యోదనం
బొకచో బొంతధరించు నొక్కొకతఱిన్ ♦ యోగ్యాంబరశ్రేణి లె
క్కకు రానీయఁడు కార్యసాధకుఁడు దుః♦ఖంబున్ సుఖంబున్ మదిన్

తా. కార్యసాధకుఁడు తన పని నెరవేఱుటకు యెట్టికష్టములైనగాని లెక్కసేయఁడు. కార్యసాధనమునకై యొకప్పుడు కటిక నేలమీద గాని మృదువైన పరపు పఱుపబడిన పర్యంకమునందుగాని పరుండును. కందమూలములగాని లేక పంచభక్ష్య పరమాన్నముగాని భుజించును. సహస్రాతులు గలిగిన చింకి బొంతనుగాని కాంచన పీతాంబరముగాని ధరించును.

శ్లో. నిందందు నీతినిపుణా యది వా స్తువంతు
లక్ష్మీ స్సమావిశతు గచ్ఛతు వా యథేష్టమ్
అద్యైవవా మరణమస్తు యుగాంత రేవా
న్యాయ్యాత్పథః ప్రవిచలంతి పదం న ధీరాః

శా. నీతిప్రౌఢవిహారులైన నిపుణుల్ ♦ నిందింపనీ మెచ్చనీ
ఖ్యాతిం జెందిన సంపదల్ నిలువనీ ♦ గాఢంబుగా నేఁగనీ
ఘాతం బప్పుడు పొందనీ నియతిమై ♦ గానీ యుగాంతంబునన్
నీతిశ్లాఘ్యపదంబు దప్పరుగదా ♦ నిత్యంబు ధీరోత్తముల్. 75

తా. బుద్ధిమంతులు పరులు తమ్ము భూషించినను, లేక దూషించినను, తమ సర్వసంపదలు నశించినను లేక నిలచినను మరణ మిప్పుడే కలిగినను, లేక యంత మందు కలిగినను, నీతిపదమును మాత్రము దప్పక యుందురు.

శ్లో. కాంతా కటాక్షవిశిఖా నఖనంతి యస్య
చిత్తం ననిర్దహతి కోప కృశానుతాపః
కర్షంతి భూరివిషయాశ్చ న లోభపాశై
ర్లోకత్రయం జయతి కృత్స్న మిదంస ధీరః

ఉ. మానవతీకటాక్ష శిత ♦ మార్గణముల్ విదలింపఁ జాల వె
వ్వానిమనంబు కోపమయ ♦ వహ్ని దహింపదు లోభపాశసం
తానము మాల్యచందన వి ♦ తానముఁబున్ వెతసేయనోప కె
వ్వానివశంబునన్ మెలఁగు ♦ వాఁడుజయించుజగంబు లన్నియున్. 76

తా. ఏమనుజుని మనస్సును లతాంగివాడిచూపులు గాలింపలేవో, కోపాగ్ని కింధనముకాఁడో పేరాసలు లేక లోభమనెడి త్రాళ్ళను చిక్కక, భోగభాగ్యంబులకు దగుల్కొనఁడో వాఁడే సమస్తలోకములను జయించును.

శ్లో. కదర్థితస్యాపి హి ధైర్యవృత్తే
ర్న శక్యతే ధైర్య గుణం ప్రమార్ష్టుమ్
అధో ముఖస్యాపి కృతస్య వహ్నే
ర్నాధ శ్శిఖాయాతి కదాచి దేవ.

తే. గీ. నియతిచేతఁ గదర్థితుం ♦ డయిన ధైర్య
పరుని ధైర్యగుణంబు మా ♦ న్పంగఁ దరమె
క్రిందుసేయంగఁ బడినట్టి ♦ కృష్ణ వృత్ముని
కీలయొందయిన మీఁదుగాఁ ♦ గెరలుఁ గాదె. 78

తా. మండుచున్న యగ్నిని దలక్రిందుఁజేసినచో వానిజ్వాల క్రిందికిపోవనట్లు ధైర్యవంతు నెంతభంగపరచినను వానిధైర్యము చెడదు.

శ్లో. వర తుంగాచ్ఛృంగా ద్గురు శిఖరిణః క్వాపివిషమే
పతిత్వాయం కాయః కఠినదృషదంతే విదలితః
నరంన్యస్తో హస్తః ఫణిపతిముఖేతీక్ష్ణదశనే
వరంవహ్నౌపాత స్తదపి లకృత శ్శీలవిలయః.

చ. ఉరుతరపర్వతాగ్రమున ♦ నుండి దృఢంబగు ఱాతిమీఁద స
త్వరముగఁ ద్రెళ్ళికాయముహ ♦ తంబుగఁ జేయుట మేలుగాలి మే

పరిదారవాత గేలిడుట ♦ బాగు హలాహలాశన మధ్యపాతమున్
వరమగుఁజారుశీలగుణ ♦ వర్జన మర్హముగాదు చూడఁగన్. 78

తా. గొప్ప కొండచివరభాగమునుండి పెద్దరాతిపై నతిత్వరగా దేహమును నలుగగొట్టుకొని చచ్చుటమంచిది. లేక పదునైనకోరలుగలిగిన యాదిశేషుని ముఖమందు చేతులుంచుట గొంతమంచిది. అగ్నిజ్వాలలయందుబడి భస్మమగుట మేలుకాని సుగుణముల విడుచుట మాత్రము మంచిదికాదు.

శ్లో॥ వహ్నిస్తస్య జలాయతే జలనిధిః కుల్యాయతే తత్క్షణా
న్మేరుః స్వల్పశిలాయతే మృగపతి స్సద్యః కురంగాయతే
వ్యాలో మాల్యగుణాయతే విషరసః పీయూషవర్షాయతే
యస్యాంగేఖిలలోకవల్లభతమం శీలం సమున్మీలతి.

చ. అతనికి వార్థికుల్యయగు ♦ నగ్ని జలంబగు మేరుశైల మం
చిత శిలలీలనుండు మద ♦ సింహము జింక తెఱంగు దాల్చుఁగో
పితఫణి పూలదండయగు ♦ భీష్మవిషంబు సుధారసంబగున్
క్షితి జనసమ్మతంబగు సు శీలమదెవ్వని యందు శోభిలున్. 79

తా. సుశీల మదెవ్వనియందు మూర్తీభవించి యుండునో యాతనికి దహించునట్టి యగ్ని నీటివలె జల్లగను, పొడవగు మేరుపర్వతము చిన్నరాయివలెను, దాటశక్యముగాని సముద్రము చిన్నకాలువగాను, మదించిన సింహము భయపడి పరుగెత్తుజింక వంటిదిగాను, విషరోషములచే క్రూరమైన యురగము పూలదానమువలెను, కాకోల విషమమృతముతో సమానమునగును. ఇట్లు దుఃఖకరమగునవి సుఖవంతము లగును.

శ్లో॥ ఛిన్నోపి రోహతి తరుః
క్షీణోప్యుపచీయతే పున శ్చంద్రః
ఇతి విమృశన్త స్సన్తః
సన్తప్యన్తేన విప్లుతా లోకే.

తే. గీ. ఖండితంబయ్యు భూజంబు ♦ వెండి మొలచు
క్షీణుఁడయ్యును నభివృద్ధి ♦ జెందుసోముఁ
డివ్విధమున విచారించి ♦ రొయిడలు దెరవ
జనములకు దాపమొందరు ♦ సాధుజనులు. 80

తా. చెట్టు ఖండితమైనను తిరిగి మొలచును. చంద్రుడు క్షీణించిపోవు చున్నను తిరిగి యభివృద్ధి జెందును. ఈవిధముగనే శీలవంతులు కష్టకాలమందు దుఃఖితాత్ములు కాక తరు చంద్రులవలె యభివృద్ధిఁ జెందెదమని తలపోయుదురు. కనుక వారెల్లపుడు నిత్య సంతోషులే.

శ్లో. ఐశ్వర్యస్య విభూషణం సుజనతా శౌర్యస్య వాక్సంయమో
జ్ఞానస్యోపశమశ్శ్రుతస్య వినయో విత్తస్య పాత్రే వ్యయః
అక్రోధ స్తపసః క్షమా ప్రభవితుర్ధర్మస్య నిర్వ్యాజతా
సర్వేషా మపి సర్వకారణమిదం శీలం పరం భూషణం.

ఉ. జానుగ భూతికిం దొడవు ♦ సజ్జనభావము శౌర్యలక్ష్మికిన్
మానము నీతి విద్యకు శ ♦ మంబు సుబుద్ధికి విత్తవృద్ధికిం
దానము దాల్మి శక్తికిని ♦ ధర్మ నిరూఢి కదఁ బవృత్తియుం
బూనికతోడ సర్వగుణ ♦ భూషణ మెన్న గ శీలమేసుమీ. 81

తా. సంపద కలిగినతఱి మంచితనంబును, శౌర్యమునకు వాక్చతురతయు విద్యకుఁ దగిన నేర్పరితనంబును సుబుద్ధికి దగిన వినయమును భాగ్యమునకుఁ దగిన సత్పాత్రవినియోగమును తపస్సుకుగోపము లేమియు సామర్థ్యమునకు సహనమును ధర్మమునకు కపటము లేక పోవుటయును అలంకారమై, యలంకారములకు సుస్వభావము పెద్దయలంకారమై యుండును.

## దైవపద్ధతి.

శ్లో. నేతా యస్య బృహస్పతిః ప్రహరణం వజ్రం సురా స్సైనికాః
స్వర్గో దుర్గ మనుగ్రహః ఖలుహరే రైరావతో వారణః
ఇత్యాశ్చర్య బలాన్వితోఽపి బలభి ద్భగ్నః పరై స్సంగరే
తద్వ్యక్తం ననుదైవమేవ శరణం ధిక్ ధిక్ వృథా పౌరుషమ్.

చ. గురుఁడు గురుండు వాలు శత ♦ కోటి సుపర్వులు వాహినీపతుల్
సురభవనంబు కోట మధు ♦ సూదనుఁడున్ సయిదోడు దంతి ది
క్కరిపతిగాఁగ నొప్పు బల ♦ ఘాతియు దాయల కోడె నాజిలో
శరణము దైవమే పురుష ♦ శక్తి నిరర్థక మెన్ని భంగులన్. 82

తా. సురేంద్రునకు సలహాలు నిచ్చువాఁడు బృహస్పతి. కొండ రెక్కలను గొట్టినను మొక్కవోని వజ్రము ఆయుధము, దేవతలా సైనికులు, స్వర్గమాతని కోట సర్వలోకాధినాధుండగు శ్రీమహావిష్ణునకు అనుగ్రహపాత్రుఁడైనవాఁడు. ఐరావతము వాహనముగా గలవాఁడు. ఇట్లనంత బలసంపన్నుండైనను రాక్షసులచే భంగపడెను, కావున దైవమే ప్రధానముగాని పౌరుష మెంతయు వ్యర్థము.

శ్లో. భగ్నాయస్య కరండ పిండితతనో ర్మ్లానేంద్రియస్య క్షుధా
కృత్వాఖు ర్వివరం స్వయం నిపతితో నక్తం ముఖే భోగినః
తృప్తస్త త్పిశితేన సత్వర మసౌ తేనైవ యాతః పథా
స్వస్థాస్తిష్ఠత దైవమేన హి పరం వృద్ధౌ క్షయే కారణం.

ఉ. రాతిరి మూషకంబు వివ ♦ రంబొనరించి కరండ బద్ధమై
భీతిలి చిక్కియాస చెడి ♦ పెద్దయుడస్సిన పాముపాత సం
పాతముఁ జెందె దాని దిని ♦ పాము దొలంగె బిలంబు త్రోవనే
యేతటి హానివృద్ధులకు ♦ నెక్కటి దైవము కారణంబగున్ 83

తా. ఒకానొకరాత్రి యొకయెలుక క్షుద్బాధ కాగలేక యొక పెట్టెకు రంధ్ర మొనరించి లోనప్రవేశించెను. అంతకుముందు ర్వ యొకపాము పెట్టెలో చిక్కి యాహారము లేక చచ్చుటకు సిద్ధముగాయుండెను. పాము ఎలుక రాగానే యా యెలుకను దిని ఎలుక చేసిన రంధ్రముగుండాపోయి ప్రాణము రక్షించుకొనెను ఆహారము కొరకుపోయిన ఎలుకకు ప్రాణముపోవుటయు చావసిద్ధముగాయున్న పాము బ్రతుకుటయు జూడగా యేతరికైనను హానివృద్ధులకు దైవమే ప్రధానముగుట స్పష్టమేగదా.

శ్లో. యథాకన్దుక పాతేనో త్పతత్యార్యః పతన్నపి
తథా త్వనార్యః పతిత మృత్పిండపతనం యథా.

క. కందుకమువోలె సుజనుఁడు
గ్రిందంబడి మగుడమీఁదికి ♦ న్నెగయుఁ జుమీ
మందుఁడు మృత్పిండమువలె
గ్రిందంబడి యడఁగి యుండు ♦ గృపణత్వమునన్.

తా. క్రిందఁబడి బంతి పైకి లేచునట్లు భక్తితోనిండిన మనుజుఁడు క్రిందపడి నను తిరిగి పైకివచ్చును మట్టిముద్ద క్రిందబడినచో తిరిగి లేవలేనట్లు భక్తిరహితుడు క్రిందుగా పడినచో దిరిగి లేవనేరఁడు.

శ్లో. ఖల్వాటో దివసేశ్వరస్య కిరణై స్సంతాపితో మస్తకే
వాంఛందేశ మనాతపం విధివశా త్తాలస్య మూలం గతః
తత్రాప్యస్య మహాఫలేన పతతా భగ్నం సశబ్దం శిరః
ప్రాయోగచ్ఛతి యత్రదైవహతక స్తత్రైవయాంత్యాపదః. 85

మ. ధర ఖల్వాటుఁడొకండు సూర్యకరసంతప్తప్రధానాంగుఁడై
త్వరతోడన్ బరువెత్తి చేరి నిలిచెన్ ♦ దాళద్రుమచ్ఛాయఁ ద
చ్ఛిరముం దత్ఫల పాతవేగమున వి ♦ చ్ఛేద శబ్దయోగంబుగాఁ
బోరి దైవోపహతుండు పోవు కడకుం ♦ బోవుంగదాయాపదల్.

తా. బట్టతలవాఁడొకండు నిశితసూర్యకిరణంబులకుఁ దాళజాలక యొకతాల వృక్షనీడను నిలువఁబడెను. ఇంతలో నొకతాలఫలము వానితలపైబడి తల బ్రద్ద లయ్యెను. కావున దైవానుగ్రహము లేనప్పుడన్నియు కష్టములే ప్రాప్తించును.

శ్లో. గజ భుజంగ విహంగమబంధనం
శశిదివాకరయో ర్గ్రహపీడనం
మతిమతాంచ విలోక్య దరిద్రతాం
విధి రహో బలవానితి మే మతిః

తే. గీ. ఫణులు గజములుఁ బక్షులుఁ ♦ బట్టు వడుట
రవిసుధాకరులకునైన ♦ రాహుబాధ
బుద్ధిమంతుల లేమియుఁ ♦ బొసఁగఁ జూచి
విధి బలాఢ్యుఁ డటంచు భా ♦ వింతు మదిని. 86

తా. పట్టుకొన శక్యముగానిపాములు, ఏనుగులు, పక్షులు పట్టుబడుచున్నవి. తేజోవంతులును, ముల్లోకములను దమకాంతితో నిండింపఁజేయు సూర్యచంద్రులను రాహువుపట్టి పీడించుచున్నాఁడు. బుద్ధిమంతులు దరిద్రులగుచున్నారు. ఘోరా! దైవమాయ యెట్టిదో యెఱుంగలేము గదా!

శ్లో. సృజతి తావ దశేషగుణాకరం
పురుషరత్న మలంకరణం భువః
తదపి తత్క్షణ భంగి కరోతి చే
దహహ కష్టమపండితతా విధేః

క. గుణమణిఖనియగు పూరుష
మణి ధరణికి రవణముగ న ♦ మర్చినవిధి యా
గుణవంతుని వెసంజునిమిన
గుణహీనునిగాఁగ నెన్ను ♦ కొనరే ధాతన్. 87

తా. బ్రహ్మ సద్గుణ సంపన్నుండును, ప్రపంచమున కలంకారభూతుడునగు వానిని బుట్టించి త్వరగా వానిని మృత్యుముఖమునఁ బడవైచినచో నాబ్రహ్మను తెలివితక్కువవానిగా భావింతురు. ఎట్లైనను దైవమే ప్రధానముగదా!

శ్లో. అయ మమృతనిధానం నాయకో ప్యోషధీనాం
శతభిషగనుయాత శ్శంభుమూర్ధ్నో వతంసః
విరహయతి న చైనం రాజయక్ష్మా శశాంకం
హతవిధి పరిపాకః కేన వా లంఘనీయః. 88

చ. శతభిషగాఢ్యుఁడున్ సతత ♦ శంభు వతంసమునయ్యు నోషధీ
తతులకు నాథుడయ్యును సు ♦ ధారస సేవధియయ్యుఁ దారకా
పతి తనరాజయక్ష్మ భవ ♦ బాధలఁ బాపఁగ నోపఁడక్కటా!
హతవిధికృత్య మెవ్వనికి ♦ నైన జగంబున దాఁటవచ్చునే?

తా. అమృతముండు తావున చంద్రుఁడుండును. సంజీవిని మొదలగు మూలికా సముదాయమున కతఁడు ప్రభువు ఈతనితోఁ గూడనొక వందమంది వైద్యులుందురు. పైగా లయకారకుండగు శంభుని శిరమందుండువాఁడు. అయినను తనకుగల క్షయబాధ మాన్పుకొనఁజాలడు. కావున పాపిష్టిదైవముయొక్క వియోగము దప్పింప నేరికిని శక్యము గాదు.

శ్లో. ప్రియసఖ విపద్దండా ఘాతప్రపాతపరంపరా
పరిచయబలే చింతాచక్రే నిధాయ విధిః ఖలః

మృద మివ బలా త్పిండీ కృత్య ప్రగల్భకులాలవ
ద్భ్ర మయతి మనో నో జానీమః కి మత్ర విధాస్యతి. 89

చ. కలితవిప త్తిదండపద ♦ ఘట్టనసేయుచు మన్నుకై వడిన్
ఖలుఁడు విధాత పిండితము ♦ గా నొనరించి నితాంతచింతయన్
బలితపుసారెపై నిలిపి ♦ పాయక డెందము ద్రిప్పుచున్న వాఁ
డెలమి కులాలురీతిఁ దెలి ♦ యంగలవార మె యేమిసేయునో? 89

తా. కుమతుఁడగు బ్రహ్మ వానిచిత్తమును కష్టులచేతను, చింతయనెడి చక్రమునందు త్రిప్పివేయుచున్నాఁడు, ఏమిచేయుట కిట్లు త్రిప్పుచున్నాఁడో తెలియకున్నది.

శ్లో. విరమ విరమాయాసాదస్మా ద్దురధ్యవసాయతో
విపది మహతాం ధైర్యధ్వంసం యదీక్షిత మీహసే
అయి జడ విధే కల్పాపాయే వ్యపే జక్రమాః
కులశిఖరిణః క్షుద్రా నైతే న వాజలనాశయః 90

చ. దొసఁగులు వచ్చువేళ గుణ ♦ ధుర్యుల ధైర్యగుణంబు సర్వమున్
బస చెడునంచుఁ జూచెదవు ♦ పాపము దైవమ యాదురాగ్రహ
వ్యసనము మానుమాను ప్రళ ♦ యంబున నీతనిజక్రమంబులై
నసి సెడవించు కంతయును ♦ సాగరముల్ కులపర్వతంబులున్. 90

తా. దుష్టదైవమా! మహాత్ములకు కష్టములు కలిగించి వారిధైర్యము పోగొట్ట జూచెదవు కాని యుగాంతమందు సప్తకులపర్వతములును, సప్తసముద్రములును తమ మేరదప్పినను మరల నవి దమ తమ మేరలయందే నెలకొనునుగదా!

శ్లో. దైవేన ప్రభుణా స్వయం జగతి యద్యస్య ప్రమాణీకృతం
తత్తస్యోపనమే న్మనా గపి మహా న్నైవాశ్రయః కారణమ్
సర్వాశాపరిపూరకే జలధరే వర్షత్యపి ప్రత్యహం
సూక్ష్మా ఏవ పతంతి చాతకముఖే ద్విత్రాః పయోబిందవః 02

గీ. ఎవ్వనికి నిజ్జగంబున ♦ నెంతఫలము
దైవకృతమగునది వొందుఁ ♦ దప్పకతనిఁ

గారణముగాదు పెనుంబ్రాపు ♦ ఘనునిఁజేరు
చాతకము వాతఁబడు నల్ప ♦ జలకణములు.

తా. లోకంబునం దెవ్వని కెంతఫలము బ్రహ్మచే నిశ్చయింపఁబడినదో దానిని వాఁడవశ్యము పొందగలఁడు, కనుక గొప్పవారి నాశ్రయించిన నంతకంటె యెక్కువ ధనము బొందలేఁడు, ఎట్లన మేఘుఁడు జనులచే యాచింపఁబడకయే వలసినంతవర్షం గురియించుచున్నాఁడు. వర్షముకొరకై కనిపెట్టుకొనియుండిన చాతకపక్షి నోటియందు ఒకటిరెండు చుక్కలకంటె నెక్కువ పడుటలేదుకదా ?

## ౧౦ కర్మపద్ధతి

శ్లో. నమస్యామో దేవాన్నను హతవిధేస్తేపి వశగా
విధిర్వంద్యస్సోపి ప్రతినియతకర్మైకఫలదః
ఫలంకర్మాయత్తం కిమమరగణైః కించవిధినా
సమస్తత్కర్మేభ్యో విధిరనయేభ్యః ప్రభవతి. 92

చ. శిథిలతలేనిభక్తి నతి ♦ సేయుదు వేల్పుల కాసుపర్వులున్
విధివశవర్తులావిధియు ♦ విశ్రుతకర్మఫలప్రదాత యు
య్యధికఫలంబు కర్మవశ ♦ మట్లగుటం బనిగామి వారిచే
విధికధికంబు గర్మమని ♦ వేమరుమ్రొక్కి భజింతుఁ గర్మమున్ 92

తా. సకల ఫలములనిచ్చు దేవతలకు నమస్కరించుదము. ఆ దేవతలుగూడ బ్రహ్మకు వశులైనవారు కావున బ్రహ్మను పూజించుదము బ్రహ్మగూడ కర్మకుఁ బూర్వమే యేర్పడియుండు ఫలము నొసఁగును. కావున వీరలతోఁ బనియేమి ? సకలఫలములకు నాధారమైన కర్మకనేకసారులు నమస్కారములు చేయుదము.

శ్లో. బ్రహ్మాయేన కులాలవన్నియమితో బ్రహ్మాండభాండోదరే
విష్ణుర్యేన దశావతారగహనే క్షిప్తోమహాసంకటే
రుద్రోయేన కపాలపాణిపుటకే భిక్షాటనం సేవతే
సూర్యోభ్రామ్యతినిత్యమేవ గగనే తస్మైనమః కర్మణే

చ. నలువ కులాలుభంగి నలి ♦ నప్రభవాండమునందు దేనిచే
నిలిచె దశావతార వన ♦ నిష్ఠితుఁడయ్యె మురారి దేనిచేఁ

బెలుచఁ గపాలహస్తుఁడయి ♦ భిక్షకుఁడయ్యె బురారి దేనిచే
నలరవి దేనిచేఁ దిరుగు ♦ నాఘనకర్మము వంద్యమే కదా. 93

తా. బ్రహ్మ దేనిచే సర్వప్రపంచములందు జీవరాసులను కుమ్మరివాఁడు కుండలను జేయురీతిగా సృజించుచున్నాఁడో, శ్రీమహావిష్ణువు దేనిచే దశావతారములనెత్తి పెనుకష్టములను లోనయ్యెనో దేనిచే శివుఁడు మనుజ పుఱకపుపాత్రగాఁ జేసుకొని బిచ్చమెత్తుకొనుచుండెనో సూర్యుఁడు దేనిచే యొకనియమమైన నిలువక యాకాశమున దిరుగుచుండెనో, యట్టి సర్వనియామకశక్తిగల ఘనకర్మమునకు నమస్కారము చేయుచున్నాను.

శ్లో. యా సాధూంశ్చ ఖలాన్ కరోతి విదుషో మూర్ఖాన్ హితాన్ ద్వేషిణః
ప్రత్యక్షం కురుతే పరోక్షమమృతం హాలాహలం తత్‌క్షణాత్
తామారాధయ సత్క్రియాం భగవతీం భోక్తుం ఫలం వాంఛితం
హే సాధో వ్యసనైర్గుణేషు విపులే ష్వాస్థాం వృథా మాకృథాః

మ. ఖలునిన్ సజ్జనుఁగాఁగ మూర్ఖజను స ♦ ఖ్యానంతునింగాఁగ దా
యల సన్మిత్రులఁగా నగోచరముఁ బ్ర ♦ త్యక్షంబుగాఁ బ్రాణహృ
త్కాలనంబైన మహావిషం బమృతముం ♦ గాఁ జేయు సత్కర్మము
జ్వల నిష్ఠానిధివై భజింపుము వయ ♦ స్యా వాంఛితార్థాప్తికిన్.

తా. నేస్తకాఁడా! నీవేదైన నొకకోరిక బడయుదలంచితివేని సుజనులను కుజనులనుగాను, మూర్ఖులను విద్వాంసులనుగాను శత్రువులను హితులనుగాను, ఇంద్రియములకు కనబడని దానిని కనబడునట్లును కాలకూటవిషమును నమృతముగాను చేయుగలిగిన ఘనకర్మమును నమస్కారముఁ జేయుము. అట్లుగాక రజస్తమోగుణాదులనుబట్టితివేని నవి క్లేశముతో గూడిన ఫలమిచ్చును. గాన వానికొఱకై వ్యర్థముగా పాటుపడకుము.

శ్లో. శుభ్రం పద్మ సవిభ్రమా యువతయ శ్శ్వేతాతపత్రోజ్జ్వలా
లక్ష్మీ రిత్యనుభూయతే చిర మనుస్యూతే శుభే కర్మణి
విచ్ఛిన్నే నితరా మనంగ కలహ క్రీడాత్రుటత్తంతుకం
ముక్తాజాల మివ ప్రయాతి ఝడితి భ్రశ్యద్దిశో దృశ్యతాం. 95

చ. లలిత నికేతనప్రియవి ♦ లాసవతీ ధవళాత పత్రస
ద్విలసితవైభవం బనుభ ♦ వింపఁ బడున్ సుకృతానువృత్తిచేఁ

జెలువగు పుణ్యాకర్మము న ♦ శించిన సంగజసంగరత్రుటత్కలిత గుణోరుమా_క్తికని ♦ కాయములట్లు నొలంగుసంపదల్.

తా. చెలికాండ్రా! తొలిజన్మంబునఁ జేసిన పుణ్యమువలన యాకర్మఫల విశేష మడ యనువర్తించుచుండగా సుందరభవనంబులును, సుందరారామంబులును, చెంగు చెంగున బోవు యాశుహారణమువలె నైశ్వర్యంబుగఁ బోవు జవరాండ్రును, సమస్తదేశపరిపాలనంబును మొదలగునవి యనుభవింపబడును. అట్టి పుణ్యాకర్మము క్షీణించిపోయెనేని వెంటనే యిదివరకుండిన భోగభాగ్యంబులన్నియు మన్మథకేళియందు దారము గి నలుగడల చెదరిపోయిన ముత్యములవలె నశించును.

శ్లో. గుణవ దగుణవ ద్వా కుర్వతా కార్య మాదౌ
పరిణతి రవధార్యా యత్నతః పండితేన
అతిరభసకృతానాం కర్మణా మావిపత్తే
ర్భవతి హృదయదాహీ శల్యతుల్యో విపాకః. 96

తే. గీ. సగుణ నిర్గుణ కార్యముల్ ♦ సలుపు సుమతి
చేతఁ బరిణతిగడుఁ బ్రతీ ♦ క్షింపఁ దగును
బరుష కర్మవిపాకంబు ♦ ఫలముదనుక
హృదయము దహించుశల్యంబు ♦ రీతి జగతి. 96

తా. బుద్ధిమంతుఁడు తానొక కార్యముఁజేయ సంకల్పించినతఱి యాకార్యమున కెట్టిఫలము కలుగును యాలోచింపవలయును. అటు లాలోచింపకుండ తొందరపడి చేసినచో నది మరణకాలమువరకు శల్యమువలె మనస్సు దహించునట్లుగాఁ బరిణమించును.

శ్లో. స్థాల్యాం వైదూర్యమయ్యాం పచతి తిలఖలం చాధ్నై దంననామై
స్సౌవర్ణై ర్లాంగలాగ్రై ర్విలిఖతి వసుధా మర్కతూలస్య హేతోః
ఛిత్వాకర్పూరఖండాన్ వృతిమిహకురు తేకోద్రవాణాంసమంతాత్
ప్రాప్యేమాంకర్మభూమింనభజతి మనుజోయ స్తతోమందభాగ్యః

మ. చెలువౌ రత్నఘటంబు నందతఁడు సు ♦ శ్రీఖండంబులం
దిలపిణ్యాకము వండె నారుదల క ♦ ర్థిన్ సప్తపర్ణావృతుల్
నిలిపెన్ జిల్లెడు దూదికై పుడమి దు ♦ న్నెన్ బైఁడినాఁగేళ్ళని
మ్ముగఁ గర్మక్షితిఁబుట్టి యెవ్వఁడు దపం♦బుల్ సేయఁడప్రాజ్ఞతన్

తా. కర్మజేయుటకుఁ దగినభూమిని బ్రాపించియు సేవఁడు కర్మయాచరింపఁడో యాతఁడు మట్టిపాత్రతో వండదగిన సెలకపిండిని రత్నములచే నిర్మింపబడిన పాత్రతో వండువానితోను, పనికిమాలిన జిల్లేడువ్రేళ్ళకొరకు బంగరునాఁగేళ్ళతో భూమిని దున్నువానితోను, మంచిగంధపుతరువులనరకి వానితో రాళ్ళకు వెలుగువేయువానితోను బోల్పబడును.

శ్లో. నైవాకృతిః ఫలతి నైవ కులం నశీలం
విద్యాపి నైవ నచ యత్న కృతాపి సేవా
భాగ్యాని పూర్వతపసా ఖలు సంచితాని
కాలేఫలంతి పురుషస్య యథైవవృక్షాః 98

తే. గీ. రమ్యరూపంబు విద్యయు ♦ రాజసేవ
కులము శీలంబుఁ జాలవు ♦ ఫల మొసంగఁ
బూర్వపుణ్య సంచితభాగ్య ♦ ములు ఫలించు
గాలమునఁ బనసాది వృ ♦ క్షములకరణి 98

తా. పురుషునకుఁ అందముకాని, విద్యగాని, రాజసేవగాని, మంచికులముగాని, సుశీలముగాని, అంత్యదశయందు ఫల మొసఁగజాలవు. తొలిజన్మంబున జేసిన పుణ్యమే కాలమున పనసాదివృక్షములవలెనే ఫల మొసంగును.

శ్లో. మజ్జత్వంభసి యాతు మేరు శిఖరం శత్రూన్ జయాత్వాహవే
వాణిజ్యం కృషిసేవనాది సకలా విద్యాః కలాః శిక్షతాం
ఆకాశం విపులం ప్రయాతు ఖగవత్కృత్వాప్రయత్నఃపరం
నాభావ్యం భవతీహ భాగ్యవశతో భావ్యస్య నాశః కుతః

చ. సలిలముఁ జొచ్చినం గనక ♦ శైలముఁ జేరిన వైరివీరులం
గెలిచిన రాజసేవఁ దిల ♦ కించిన వేదము లభ్యసించినం
గళలతెఱంగెఱింగిన ఖ ♦ గత్వము దాల్చిన గర్వనిఘ్నతా
కలన నభావ్యమైన పని ♦ గాదు వినాశము లేదు భావికిన్. 99

తా. ఏమనుజుండైనను నీటియందుఁ జొచ్చినను మేరుపర్వత మెక్కినను రణంబున వైరివీరుల గెలిచినను, ప్రభుసేవ జేసినను, చతుర్వేదములనాయూలాగ్ర

ముగఁ దెలిసికొనినను, సమస్తకళల నెఱింగినను, ప్రయత్నించి పక్షివలె నాకాశమున నెగిరినను కర్మవశంబగుటవలన భావ్యముకాని పని కాకుండఁగనే యుండును కాబోవునదయి తీరును.

శ్లో. వనే రణే శత్రు జలాగ్ని మధ్యే
మహార్ణవే పర్వతమస్తకేవా
సుప్తం ప్రమత్తం విషమస్థితంవా
రక్షంతి పుణ్యాని పురాకృతాని. 100

క. కాననమున రణమున సలి
లానల రిపు మధ్యమమున మ ♦ హాబ్ధి నగాగ్ర
స్థానమున మత్తు నిద్రితుఁ
బూనికతోఁ బూర్వ పుణ్య ♦ ములు రక్షించున్. 100

తా. ఎవడయినను పోలిజన్మంబున నేమయినఁ బుణ్యమాచరించినచో యాతఁడు కీకారణ్యములంను సంచరించినను, మహాసంగ్రామములోఁ బోరుచుండినను, అగ్నిజ్వాలమధ్యనుండినను, లోతయిన నీటిప్రదేశమందుండినను, శత్రువుల నడుమ చిక్కుబడినను. కొండశిఖరమందు దున్నను, నిదురించుచున్నను వాని పూర్వపుణ్యములు వానికే యపకారము గలుగకుండ గాపాడును.

శ్లో. భీమం వనం భవతి సత్యపురం ప్రధానం
సర్వోజనః సుజనతా ముపయాతి తస్య
కృత్స్నాచ భూర్భవతి సన్నిధి రత్న పూర్ణా
యస్యాస్తి పూర్వ సుకృతం విపులం నరస్య. 101

తే. గీ. భువనమునఁ బూర్వ సంభృత ♦ పుణ్యరాశి
యగుచు నుదయంబు గాంచిన ♦ సుగుణ నిధికి
వనము పురమగుఁ బరులాత్మ ♦ జనములగుదు
రవని నిధిరత్న పరిపూర్ణ ♦ యయి ఫలించు. 101

తా. ఎవఁడు పురాకృతపుణ్యము గలిగినవాఁడో యాతనికి సింహశార్దూలాది భీకర వన్యమృగములతోఁ గూడిన యరణ్యమొక మహాసౌందర్యమగు పట్టణము గాను, శత్రువులందరును మిత్రులు గాను నగుదురు. మఱియు నాతని భూమి రత్నగర్భయై యుండును.

మ. యమునా నీల సరోజ సౌరభ రస ♦ వ్యాసంగి భృంగీకలో
పమ కంఠద్యుతి లిప్తశేష భుజగ ♦ ప్రాలంబ జాంబూనదా
ద్రి మహాకార్ముక రూఢగూఢ పదమా ♦ ర్గీసంప్రయుక్తత్రివి
క్రమశాతాంబక పాతితాంబర చర ♦ క్రవ్యాత్పురాట్టాలకా.

మాలిని॥ ప్రథమగణపరీతా ♦ పాపజీమూత వాతా
కమలభువనసూతా ♦ కన్యకాలాకిరాతా
శమితదనుజ నేత్రా ♦ చారువక్త్రాంబు జాతా
సమరజయసమేతా ♦ సామవేదాంతగీతా.

క. సుమనో నాయక సంభృత
సుమనోర్చిత పదబిసప్ర ♦ సూనభవానీ
సుమనోహర సురనిర్ఝర
సునానో దామార్ద్వజాట ♦ జూటోద్దేశా

గ ద్య ము.

ఇది శ్రీమదుమామహేశ్వర కరుణాకటాక్ష వీక్షాపాత్ర యేనుగు
లక్ష్మణకవిరాజపౌత్ర తిమ్మనార్యపుత్ర విద్వజ్జనవిధేయ
లక్ష్మణకవి నామధేయ ప్రణీతంబైన సుభాషిత
రత్నావళి కావ్యంబునందు నీతిశతకంబున
మూర్ఖాది దశ ప్రకరణంబులు గల
సుభాషిత త్రిశతియందు నీతిశతకము సంపూర్ణము.

---

శ్రీరస్తు.

# శృంగారశతకము.

## ౧ స్త్రీప్రశంస

### అవతారిక.

యోగీశ్వరుండగు భర్తృహరి, నీతిమాని శృంగారమును సేవింపఁగూడదు కావున శృంగారశతకమునకు ముందు నీతిశతకమును వర్ణించియున్నాఁడు. వైరాగ్యమునకు విరుద్ధమైనదియు, శృంగారానంతరము వైరాగ్యము గలుగును గాన యిప్పుడు శృంగార శతకము జెప్పుచు శృంగారమున కధిదేవతయగు మన్మథునకు నమస్కారము చేయుటయును నమస్కారరూపమంగళము తొలుత నాచరించుచున్నాఁడు.

శ్లో. శంభు స్వయంభు హరయో హరిణేక్షణానాం
యేనా క్రియంతి సతతం గృహ కర్మదాసాః
వాచా మగోచర చరిత్ర విచిత్రితాయ
తస్మై నమో భగవతే కుసుమాయుధాయ. 1

ఉ. శంకర పద్మగర్భ ముర ♦ శాసనులన్ భువనేశులన్ నిరా
తంక ధృతిన్ మృగాక్షులకు ♦ దాసులఁ జేసిన మేటికిం గురం
గాంక వసంతమిత్రునకు ♦ నంజలిఁ జేసెద వాగతీతని
శ్శంక చరిత్ర చిత్రునకు ♦ షడ్గుణ హారికి శంబరారికిన్. 1

తా. సృష్టి స్థితిలయ కర్తలగు బ్రహ్మ విష్ణు మహేశ్వరులను గూడ వనితా జనములకు వశులుగా జేసిన సందేహము లేనిదియు వచింపశక్యము గానదియునగు గమనంబునఁజిత్రింపబడినట్టియు షడ్గుణాహారియు శంబరాసురునకు వైరియును, శృంగారమున కధిదేవతయగు యామన్మథరాజునకు వందన మాచరించుచున్నాను.

శ్లో. స్మితేన భావే నచ లజ్జ మాభియా
పరాఙ్ముఖైరర్థకటాక్షవీక్షణైః
వచోభి రీర్ష్యా కలహేన లీలయా
సమస్త భావైః ఖలుబంధనం స్త్రియః.

చ. చెలువఁపు దేట లేనగవు చేతను భావముచేత సిగ్గుచే
నలువగు లీలచేత సుగుణంబులచే గడగంటిచూపుచే
గలహముచేత విందులగు కందువ మాటలచే నసూయచేఁ
బెలుచన నెంత వారివల పింతురు కాంతలు పెక్కుభంగులన్. 2

తా. సౌందర్యము లొలుకు చిరునవ్వుచేతను, రసము పెంపొందించు యోగ్యముచేతను లజ్జచేతను సొంపగు విలాసము చేతను ప్రణయ పరిణామములఁ దెల్పు నేత్రాంతపుఁజూపులచేతను ప్రణయవైరంబుచేతను వసంత కోయిలవలె ముద్దులు మూటకట్టు మాటలచేతను ఓర్వలేమి వలనను యిదియదియని యన నేల సమస్తభావంబులచేతను యువతులు యువకులను వశపర్చుకొందురు.

శ్లో. భ్రూచాతురాఢ్యా త్కుంచితాక్షాః కటాక్షాః
స్నిగ్ధావాచో లజ్జితాంతాశ్చ హాసాః
లీలామందం ప్రస్థితం చ స్థితం చ
స్త్రీణా మేత ద్భూషణంచాయుధంచ. 3

తే. గీ. భ్రూలతాక్షేప కుంచితస్ఫురణఁ దాల్చు
కలికి చూపులు నెయ్యంపు బలుకుఁ దీపు
సిగ్గునగవులు చెన్నగు చిన్నవడలు
సొమ్ము లాయుధములు ముద్దు గుమ్మలకును. 3

తా. లతలనుబోలు కనుబొమ్మలు నీటుగాఁద్రిప్పి యోరగాఁజూచు చూడ్కులును, యిష్టమునూచించు పలుకులందలి తియ్యందనమును సుమలజ్జతోఁగూడిన లేనగవులును హంసవలె మందగమనములు వనితల కాయుధములును భూషణములును గూడ నగును.

శ్లో. క్వచి త్సభ్రూభంగైః క్వచిదపిచ లజ్జాపరిగతైః
క్వచి ద్భీతిత్రస్తైః క్వచిదపిచ లీలా విలసితైః

కుమారీణా మేతైర్మదనసుభగై ర్నేత్రవలితైః
స్ఫురన్నీలాబ్జానాం ప్రకరపరికీర్ణా ఇవదిశః

ఉ. భ్రూలతికావిభంగయుత ॥ ముల్ సభయంబులు సత్రపంబులు
ద్వేల విలాసముల్ మదన ॥ దీపనముల్ రుచిరంబులైన కాం
తా లసమాననేత్ర వలి ॥ తంబులచే దిశలెల్ల విస్ఫుర
న్నీల సరోజ పత్రములు ॥ నిండెననం గనుపట్టె నెంతయున్ ? 4

తా. తీగలవలె చలించెడి కనుబొమలుగలిగి సానుస్మితము గలిగి సింగమును జూచి బెదరు యాడుహరిణమువలె తత్తరపాటును విలాసముతోఁగూడినట్టియు మన్మథోద్రేకముచే నింపబడినవియు కాంతిగలదియు స్త్రీల నేత్రాంతములచే నావరింపబడినవియు నగుటవలన దిశ లన్నియు బాగుగా విడిచినట్లు నల్లగలువలు వెదజల్లబడినటులఁ గానుపించెడిని.

శ్లో. వక్త్రం చంద్రవికాసి పంకజపరీహాసక్షమే లోచనే
వర్ణః స్వర్ణ మపాకరిష్ణు రలినీ జిష్ణుః కచానాం చయః
వక్షోజా విభకుంభ విభ్రమహరౌ గుర్వీ నితంబస్థలీ
వాచాం హారిచ మార్దవం యువతిషు స్వాభావికం మండనం. 5

ఉ. తమ్ముల నేలుకన్నులు సు ॥ ధానిధిఁ బోలుమొగంబు మత్తభృం
గమ్ముల నేలు కొప్పు కన ॥ కద్యుతి మీఱుమెఱుంగు కుంభికుం
భమ్ముల నవ్వుగుబ్బచను ॥ బంతులు గొప్పపిఱుందు తేనియ
ల్చిమ్మెడు ముద్దుఁబల్కులును ॥ జేయుసొమ్ములు సుందరాంగికిన్.

తా. పూర్ణచంద్రుని ధిక్కరించు ముఖంబునను, నలితామరరేకులను నిరసించు నేత్రములును, పదారువన్నె బంగారపుచాయను వెక్కిరించు మేనికాంతియు, ఏనుగ కుంభస్థలమువంటి గబ్బిచనుగుబ్బలును, బరువగునవియు పెద్దపెద్దవగు పిఱుదులును, తేనెలొలుకు ముద్దుమాటలును, గండుతుమ్మెద ఱెక్కల నిరసించు కురులును అనునవియె స్త్రీలకు యాభరణములు.

శ్లో. స్మితం కించి న్ముగ్ధం సరళతరలో దృష్టివిభవః
పరిస్పందో వాచా మభినవవిలాసో క్తిసరసః

గతానా మారంభః కిసలయితలీలాపరికరః
స్స్పృశంత్యా స్తారుణ్యంకిముప హీన రమ్యంమృగదృశః. 6

ఉ. ఇంచుక ముద్దు లేనగవు ♦ లింపగు నవ్యవిలాసనూక్తు ల
భ్యంచిత లోలదృష్టియు న ♦ వారుణ పల్లవమండలంబు ని
ర్మించు సలీల యానములు ♦ మేలుగ యౌవనలక్ష్మితోడ వ
ర్తించు మృగాక్షిచందము ల ♦ తిప్రమదంబు ఘటింపఁ జాలవే. 6

తా. ముద్దుల మూటగట్టు చిఱునవ్వులును, సంతోషకరంబులై సాత్త్వికలీలతో నొప్పు వాక్యంబులును, చలించెడి చూపులును, క్రొత్తవియు, నెఱ్ఱవియునగు చిగుళ్ళును, విలాసముతోగూడిన నడకలును, నవయౌవనముతో గూడినవనితల నేక విధంబుల నానందాంబుధిలో నింపకుండుదురా!

శ్లో. ద్రష్టవ్యేషు కిముత్తమం మృగదృశః ప్రేమప్రసన్నం ముఖం
ఘ్రాతవ్యేష్వపి కిం తదాస్యపవన శ్శ్రావ్యేషు కిం తద్వచః
కిం స్వాద్యేషు తదోష్ఠపల్లవరస స్స్పృశ్యేషు కిం తద్వపు
ర్ధ్యేయం కిం నవయౌవనే సహృదయై స్సర్వత్రతద్విభ్రమాః॥

సీ. చూడంగఁ దగిన వ ♦ స్తువులందు ఘనమెద్ది
తులలేక తగు వెలం ♦ దుల మొగంబు
వలపుగై కొనఁదగు ♦ వానిలో నెయ్యది
మగువల వదనాబ్జ ♦ మారుతంబు
వీనుల కింపైన ♦ వానియం దెయ్యది
కోమలాంగుల ముద్దు ♦ గులుకు పలుకు
తనువుసోకిన సుఖం ♦ బొనరించు నెయ్యది
పొలఁతల సొబగైన ♦ మేను దీవ

తే. గీ. యతిమధురమెద్ది కాంతాధ ♦ రామృతంబు
సరసజనులకుఁ జింతింపఁ ♦ జాలు నెద్ది
పువ్వుఁబోఁడుల వెలలేని ♦ జవ్వనంబు
వెలయు నెల్లెడఁ బడఁతుల ♦ విభ్రమములు.

తా. రసికత్వ మెఱింగినవారు, ప్రేమలుట్టిపడ పూర్ణచంద్రునివంటి మొగము కల జవరాలికంటెఁ జూడదగినదియు, సుందరాంగుల తలిముద్దు మొగంబుననుండి

వీచు కమ్మతెమ్మరలకంటె మూర్కొన దగినదియు, సుధారసంబు లొల్కు జవరాలి ముద్దులబల్కుకంటె వినదగినదియు, యౌవనాంగయొక్క దొండపండువంటి యధరపానంబుకంటె గ్రోలదగినదియు, కోమలాంగుల నునుతీగలవంటి మేనుకంటె స్పృశింపదగినదియు, వనితా నవయౌవనముకంటెను దానికంటె నన్నివిధంబుల దాని యొయ్యారంపుగులుకులకంటెను మించినదేదియును లేవని చెప్పవచ్చును.

శ్లో. ఏతాశ్చలద్వలయసంహతి మేఖలోత్థ
ఝంకారనూపుర రవాహృత రాజహంస్యః
కుర్వంతి కస్య న మనో వివశం తరుణ్యో
విత్రస్తముగ్ధహరిణీసదృశైః కటాక్షైః॥

మ. కరచంచన్మణికంకణక్వణరణ ♦ త్కాంచీగుణస్వర్ణనూ
పురనాదాహృతరాజహంసరమణుల్ ♦ పూర్ణేందుబింబాననల్
ధర నెవ్వానివశంబు సేయరు ము ♦ గ్ధత్రస్తవల్లస్మృగీ
తరళాలోకనతుల్యవిభ్రమదృగం ♦ తస్తోమపాదంబులన్. 8

తా. మణులు స్థాపింపబడిన కంకణములు చేతియందుండి కంగుమని మ్రోగుచుండ, మొలనూలి బంగారు చిరుగజ్జెలు ఘణంఘణధ్వనులను సేయ, అందియలు గల్లుగల్లుమని మ్రోయ మురిపెంపునడకలతోc బూర్ణచంద్రునివంటి ముఖంబుగల జవరాండ్రు భయంబుచే బెదరిన లేడిచూపులc బోలుచూపులc జూచెడి సుందరాంగు లెటువంటివారినైన వశపరచుకొందురు.

శ్లో. కుంకుమపంకకళంకితదేహా
గౌరపయోధరకంపితహారా
నూపురహంసరణత్పదపద్మా
కం న వశీకురుతే భువి రామా॥

చ. గొనబగుమేన సంకుమద ♦ కుంకుమపంక మెసంగ సిబ్బెపుం
జనుంగవ రత్నహారములు ♦ సారెపెనంగ బదాంబుజంబులన్
మొనసిన గిల్కుటందియలు ♦ మ్రోతచెలంగ ననంగ వైభవం
బెనయగ గుల్కు కల్కి సొబ ♦ గెవ్వనిc దావలపింప దిమ్మహిన్. 9

తా. కుంకుమ, పునుగు, జవ్వాది పరిమళద్రవ్యంబులతో మెయినిండదట్టముగ నలందుకొని, చక్రంబులవలెనుండు గబ్బిగుబ్బలపై ముత్యంపుసరు లల్లాడుచుండగా, కెందమ్ములబోలు పాదంబులందలి యందెలు అంచరొదలువలె నింపుగులుక, అందంబున కాటపట్టయిన రతీదేవిని తిరస్కరించు జవరాండ్రకు వశులుగాని వారెవ్వరు?

శ్లో. నూనం హి తే కవివరా విపరీత వాచో
యే నిత్య మాహు రబలా ఇతి కామినీస్తాః
యాభి ర్విలోలతర తారకదృష్టిపాతైః
శక్రాదయోపి విజితా స్త్వబలాః కథం తాః॥ 10

చ. అతివలఁ జూచి పీ రబల ♦ లంచు వచించు మహాకవీంద్రులు
ద్ధతవిపరీతవాదు లిది ♦ దబ్బర గాదు విలాసినీసమం
చితతరళాక్షిపాతముల ♦ చే గెలువంబడి రింద్రముఖ్యులున్
ధృతి నటువంటి వా రబల ♦ లెగతినైరి తలంచి చూడఁగన్. 10

తా. జవరాండ్రనుజూచి కవీశ్వరులు అబలలందురు. వారిమాటలం దంతయు నబద్ధమే యున్నది. కానిచో బెదరిన ఓత్తరి జింకవలె చంచల నేత్రములు గలిగి నల్లనైన నొయ్యారముగాఁ బ్రసరించు యోర చూపులచే నింద్రాది ప్రముఖులను దమ వశముచేసికొనిన ప్రబలురాండ్రబల లెట్లగుదురు? కనుక కవులు విపరీత వాదులనియే చెప్పవలెను.

శ్లో. నూనమాజ్ఞాకర స్తస్యాః
సుభ్రువో మకరధ్వజః
యత స్తన్నేత్రసంచారః
సూచి తేషు ప్రవర్తతే.

క. నారీజనముల కాజ్ఞా
కారియగుభటుండు మరుఁడు ♦ గాఁబోలుఁ జుమీ
వారికటాక్షము సోఁకిన
వారియెడ వాఁడిజూపి ♦ వర్తించుఁ గదా! 11

తా. మన్మథుఁడు సుందరాంగుల చూపులు ప్రసరించినతోడ నేతనప్రతాపము జూపుచున్నాఁడు. కావున స్త్రీలకు మన్మథుఁడు కింకరుండనియే చెప్పవలయును.

శ్లో. కేశాస్సంయమిన శ్శ్రుతే రపిపరం పారంగతే లోచనే
అంతర్వక్త్ర మపి స్వభావశుచిభిః కీర్ణం ద్విజానాం గణైః
ముక్తానాం సతతాధివాసరుచిరౌ వక్షోజకుంభా వమా
విత్థం తన్వి వపుః ప్రశాంతమపి తే రాగం కరో త్యేవ నః॥ 12

ఉ. వావిరి కన్నుఁదోయి శ్రుతి ♦ పారగ మెంతయు సంయమముల్ కుచుల్
భావ శుచిద్విజ ప్రకర ♦ భాజన మెన్న ముఖాంతరంబు ము
క్తావళిరమ్యముల్ కుచము ♦ లక్కట యిట్లు ప్రశాంతమయ్యు రా
జీవదళాక్షి మేను విర ♦ చించుచు నున్నదిమాకు రాగమున్. 12

తా. ఓలతాంగీ! ముడువంబడిన నెఱికురులు శ్రుతిపారముఁ జెందిననీ నేత్రములు నీముఖములోపల సహజముగా శుచిగలపంక్తిదంతములు ముక్తాహారములచే నిండింపబడిన నీగబ్బిగుబ్బలపాలిండ్లుఁ గలిగి మనోహారంబయిన నీశరీరము మాకను రాగమునుకలిగించుచున్నది.

శ్లో. ముగ్ధే ధనుష్కతా కేయ
మపూర్వా త్వయి దృశ్యతే
యయా విధ్యసి చేతాంసి
గుణైరేవచ సాయకైః.

క. శరీరములచే భేదింపక
నిరతముఁ జేసెదవు హృదయ ♦ నిర్భేదము భా
సురగుణములచే నద్భుత
కరచాప ప్రౌఢి నీకె ♦ కలదులతాంగీ.

తా. ఓయింగబోడీ శరములచే భేదింపక రూప లావణ్యాది గుణములచేత నిత్యము హృదయమును బాధించుచున్నావు కనుక వింతయగు విలువిద్యాప్రవీణత నీయందున్నది.

శ్లో. సతి ప్రదీపే సత్యగ్నౌ
సత్సు తారారవీందుషు
వినా మే మృగశాబాక్ష్యా
తమోభూత మిదం జగత్. 14

ఆ. వె. పెక్కుదివియలున్న ♦ జక్కవచెలియున్న
రిక్కరాయఁడున్న ♦ జుక్కలున్న
జిన్నిలేడి చూడ్కిచేడి ♦ య నెడఁబాయు
నప్పు డంధకార ♦ మయ్యె జగము. 14

తా. మహాతేజోవంతుడగు సూర్యుఁడున్నను, చీకటుల నడచు నక్షత్రములు చంద్రుఁడున్నను లేడిపిల్లలవంటి బెళుకుచూపుఁ జూచెడి నావనలాడి లేనప్పుడు ప్రపంచమంతయు చీకటిగానే యున్నట్లుఁ దోఁచుచున్నది.

శ్లో. ఉద్వృత్తః స్తనభార ఏవ తరళే నేత్రే చలే భ్రూలతే
రాగాధిష్ఠిత మోష్ఠపల్లవ మిదం కుర్వంతు నామవ్యథామ్
సౌభాగ్యాక్షరపంక్తిరేవ లిఖితా పుష్పాయుధేన స్వయం
మధ్యస్థాపి కరోతి తాప మధికం రోమావలీ కేనసా॥

చ. గరువపుఁ జన్నులుం బెళుకు ♦ గన్నులు నిల్కడలేని కన్బొమల్
మురియుచు నెఱ్ఱఁబారుజిగి ♦ మోవియుఁదాపముఁ జేయుఁగాదగున్
స్మరలిఖితోరుభాగ్యలిపి ♦ జాలమనందగు మధ్యవర్తియై
పరఁగిన రోమరాజియును ♦ బాయక తాపముఁజేయనాయమే. 15

తా. పటువగు గబ్బిగుబ్బలును, ప్రకాశముగల నేత్రములును, సదాచలించు కనుబొమ్మలును, మిఱిపెమున నెఱ్ఱఁబారిన యధరంబును తాపముచేయగాదగిన మన్మథునిచేత వ్రాయఁబడిన భాగ్యరేఖయనదగు మధ్యనున్న నూగారుకూడ తపింపఁజేయునుగాదా ?

శ్లో. ముఖేదంచంద్రకాంతేన
మహానీలైః శిరోరుహైః
కరాభ్యాం పద్మరాగాభ్యాం
రేజే రత్నమయీవ సా.

తే. గీ. మిగుల శశికాంతమైన నె ♦ మ్మొగము చేత
నెఱి మహానీల రుచులైన ♦ నెఱుల చేత
జలజరాగము లయిన హ ♦ స్తములచేత
రత్నమయ మనఁ గామినీ ♦ రత్న మమరె. 16

తా. ఆముద్దులాడిమొగము చందురునితో సమానమయినది. దాని కురులు నీలమును ధిక్కరించుచున్నవి. దానికరంబులు పద్మమువలె నెఱ్ఱనయినవి. కావున యూపె రత్నములచేఁ జేయబడిన కాంతారత్న మనంబడుచున్నది.

శ్లో. గురుణా స్తనభారేణ
ముఖచన్ద్రేణ భాస్వతా

శనై శ్చరాభ్యాం పాదాభ్యాం
రేజే గ్రహమయీవసా.

క. గురువగు కుచభారంబును
సరసకళాభాస్వదాస్య ♦ చంద్రముఁడు శనై
శ్చరము లగుచరణములుఁ గల
కరిగమన దనర్చెనౌర ♦ గ్రహస్వరూప యనన్. 17

తా. వనితల స్తనములు భారమగుటను, సూర్య చంద్రులఁబోలు మొగంబు గలవారు. మందగమనములుగల పాదములు కాఁబట్టి యా వనితలు గ్రహములచేఁ జేయఁబడినట్లు లున్నారు.

శ్లో. తస్యాః స్తనౌ యదిఘనౌ జఘనంచ హారి
వక్త్రంచ చారుతవ చిత్తకిమాకులత్వమ్
పుణ్యం కురుష్వయది తేషు తవాస్తివాంఛా
పుణ్యై ర్వినా నహి భవంతి సమీహితార్థాః.

చ. సుదతి పయోధరంబు లతి ♦ సుందరముల్ జఘనంబు రమ్య మా
వదనము హృద్యమంచుఁ జల ♦ వర్తస మేటికి నీకుఁ జిత్తమా!
కదలక వానిపైఁ దలఁపు ♦ గల్గినఁ బున్నెము లాచరింపు మిం
పొదవ లభించునే సుకృత♦యోగము లేక సమీహితార్థముల్. 18

తా. ఆలతాంగి జఘనంబగనున్న గుబ్బగుబ్బల పాలిండ్లం జూచియు, ముద్దు లొలుకు దాని ముఖంబుఁ జూచియు, ఓ మానసమా నీవారాటంబొందని బనియేమి యున్నది. పుణ్యములు లేకపోయిన వాంఛితార్థములు కలుగవు గనుక వానియందు నీకు భోగేచ్ఛయున్న పుణ్యము లాచరింపుము.

శ్లో. ఇమే తారుణ్యశ్రీ నవపరిమళాః ప్రౌఢసురత
ప్రతాప ప్రారంభా స్స్మరవిజయ దానప్రతిభువః
చిరం చేతశ్చోరా అభినవ వికారైక గురవో
విలాసవ్యాపారాః కిమపి విజయంతే మృగదృశామ్.

చ. కనఁదగు నిండుజవ్వనఁపు ♦ గల్మికిఁ దావులు ప్రౌఢసంగమం
బునకు నుపక్రమక్రియలు ♦ పుష్ప ధనుర్జయ దానదక్షవా

మనసిజ చిత్తహారులు వి ♦ కారనిదానములైన కామినీ
జనుల విలాసకృత్యములు ♦ సంతత రమ్యతరంబు లెన్నఁగన్. 19

తా. హరిణ నేత్రములవంటి నేత్రములుగల జవరాండ్ర శృంగారపు చేష్టలు వారి యెలజవ్వనంపు సొంపును, శ్రీ లు వెలువరించునవియు, మన్మథునకు జయము నిచ్చు కార్యశీఘ్రములుగల మాటలను, కందర్పునిరీతి మనంబుల హరించునవియు నాశ్చర్యములకు మొదటికారణమయిన స్త్రీ విలాససంపదల నాలోచింపగా మిగుల మనోరంజకము లయినవిగదా ?

## సంభోగవర్ణన.

శ్లో. ప్రణయమధురాః ప్రేమోద్గారా రసాశ్రయతాం గతాః
ఫణితిమధురా ముగ్ధప్రాయాః ప్రకాశిత సంమదాః
ప్రకృతి సుభగా విస్రంభార్ద్రా స్స్మరోదయ దాయినో
రహసి కిమపి స్వైరాలాపా హరంతి మృగీదృశాం.

మ. ప్రణయశ్రీమధురంబు లుజ్జ్వల రస ♦ ప్రాచుర్యముల్ ప్రేమభూ
షణముల్ దర్శితహర్షముల్ రుచిరవి ♦ శ్వాసార్ద్రముల్ హృద్యముల్
ఫణితి శ్రావ్యము లంగజ ప్రభవముల్ ♦ ప్రాణేశ్వరీ నర్మభా
షణముల్ నామదిఁగొల్లలాడెడి రహ ♦ స్యక్రీడలం దెప్పుడున్. 20

తా. ప్రణయమను సంపదచేఁ దీయనైనవియు, ప్రకాశవంతమగు రసంబుచే ప్రచురములైనవియు, అలంకారము అనురాగముగా గలదియు, సూచినతోడనే సంతోషించునవియు, నమ్మికంబు చేఁ వడసినవియు, మన్మథోద్రేకముతోఁ గూడిన ప్రియురాలి నగవుమాటలు నాహృదయంబును దోచదగిన వాక్యములచే హరింపబడినవి.

శ్లో. విశ్రమ్య విశ్రమ్య వనే ద్రుమాణాం
ఛాయాసుతన్వీ విచచార కాచిత్
స్తనోత్తరీయేణ కరోద్ధృతేన
నివారయంతీ శశినో మయూఖాన్. 21

చ. విరహకృశాంగియైన ఘన ♦ వేణి యొకర్తు వనంబులోపలం
దరువులనీడలందు నుచి ♦ తంబుగ మాటికి విశ్రమించి బం

ధురగతి సంచరించెఁ జను ॥ దోయిని బయ్యెదకొంగుఁ గేల దా
వెరవుగఁ బూనియగ్గలఁపు ॥ వెన్నెలకాఁక దొలంగఁ జేయుచున్. 21

తా. ఒకవనములో నొకానొక లతాంగి విరహతాపమునఁ గృశించి వేడుకగా విహరింపవచ్చి యంగుగాయు పండువెన్నెల వేఁడిమి కొగలేక పైటచెరంగు నెత్తియది తనకుసోకకుండ నడ్డముగాఁ బెట్టుకొని వెన్నెలలులేక చెట్లయడుగు నీడలందప్పుడప్పుడు అలపుదీర్చుకొనుచు నందుఁ దిరుగుచుండెను.

శ్లో. అదర్శనే దర్శన మాత్రకామా
దృష్ట్వాపరిష్వంగసు ఖైకలోలాః
ఆలింగితాయాం పునరాయతాక్ష్యా
మాశాస్మహే విగ్రహయో రభేదం. 22

ఉ. బాలిక నన్నుఁ గన్గొనని ॥ పట్టునదర్శనమాత్ర మబ్బినం
జాలు నటంచుగోరె మఱి ॥ చక్కఁగఁ గన్నుల నన్నుఁజూచి ప్రో
యాలు కవుంగిలింపవలె ॥ నంచుఁ దలంచె దమిం గవుంగిటన్
మేలుగఁ జేర్చుకొన్న నిఁక ॥ మేనులు నొక్కటిసేయఁ గోరితిన్. 22

తా. ఒకవన్నెలాడి నన్ను చూడకుండ యున్నంతకాలము చూపు కలిగిన చాలునని తలంచితిని. దైవయోగంబువలన గోచరము నాచుట తటస్థించెనేని యొకసారి కౌగలింపవలయునని దలఁచితిని అదృష్టవశమున నావగలాడిని బిగియార కవుగలింప గలిగినప్పుడు మా యిరువురి మేనులు యేక మైయుండవలయునని దలఁచితిని. జవరాలి సౌఖ్యమునకు మితిలేనిది కావున యెంత యనుభవించినను దృప్తి గలుగదు.

శ్లో. మాలతీ శిరసి జృంభణోన్ముఖీ
చందనం వపు షికుంకుమావిలమ్
వక్షసి ప్రియతమా మనోహరా
స్వర్గ ఏష పరిశిష్ట ఆగతః.

చ. తలపయి మాలతీ కుసుమ ॥ దామము నెమ్మెయిఁ గుంకుమంబుతో
గలసినకమ్మతావి విరి ॥ గంధపు బూత వెడందఱొమ్మునం
గలికుల నీలకుంతల మ ॥ దాలస నీలసరోరుహాక్షియుం
గలుగుట నింద్రభోగమన ॥ గాఁ దగదే మఱివేఱె యున్నదే. 23

తా. శిరస్సునందు పరిమళముల విరాజిల్లు మాలతీకుసుమదామము ధరించి, మైనిం డకుంకుమ, పునుగు మొదలగువానితో నలందుకొనియు, సుఖంబున తుష్టిద

రెక్కలను నిరసించు ముంగురులు గబ్బిగుబ్బలభారంబున మందత్వమును, నీలోత్ప లములను మించు నేత్రములు గలిగిన పూవుఁబోణితోడి సౌఖ్యముదొరికిన వింద్ర భోగమనియే తలం పవలయును.

శ్లో. ప్రాఙ్మామేతిమనాగనాగతరసం జాతాభిలాషం తతః
సంవ్రీడం తదనుశ్లథీకృతతనుః ప్రత్యస్తధైర్యంపునః
ప్రేమార్ద్రం స్పృహణీయ నిర్భరభరః క్రీడాప్రగల్భం తతో
నిశ్శంకాంగవికర్షణాధిక సుఖం రమ్యం కులస్త్రీ రతమ్ 24

ఉ. ఆది మితాదరంబు తద ♦ నంతర మంచితరాగమంత ల
జ్జోదయరమ్య మంత శిథి ♦ లోద్యమ మంత నితాంతధైర్య వి
చ్ఛేదము ప్రేమపూరము వి ♦ శేషవివిక్త విహార మంత నా
హ్లాద కరాంగ సంగము కు ♦ లప్రమదారత మల్పసౌఖ్యమే. 24

తా. తొల్త మితాదరంబుగలిగి పిమ్మట గౌరవముతోఁగూడిన అనురాగమును మరియొక క్షణములో సిగ్గుచేగలుగు బుజ్జగింపుతనంబును నంతలోనే ఖేదాభిప్రాయం బును మఱొకక్షణములో ధైర్యమునునంతలోరహస్యగతియు మఱికొంతకాలమునకు హృదయాహ్లాదకరంబగు శరీరసంయోగమును గలిగించునట్టి కులకాంతసాంగు స్వల్పసౌఖ్యము గా నేరదు.

శ్లో. ఉరసి నిపతితానాం ప్రస్తధమ్మిల్లకానాం
ముకుళితనయనానాం కించిదున్మీలితానామ్
ఉపరి సురతఖేద స్విన్నగండస్థలానామ్
అధరమధు వధూనాం భాగ్యవంతః పిబంతి.

ఉ. అక్కునవ్రాలి కొప్పువిడి ♦ యల్లలనాడఁగఁ గన్నుదామరల్
చక్కఁగ మోడ్చి చొక్కి పురు ♦ షాయిత సంజనిత శ్రమంబునం
జెక్కులు ఘర్మబిందువులు ♦ చిందఁగ విందొనరించు బోంట్ల మే
ల్మొక్కఁపు మోవి తేనె చవిఁ♦జూతురు భాగ్యముగల్గునేర్పరుల్ 25

తా. బొమ్మనవ్రాలి కొప్పువిడిపోయి యల్లలనాడుచు తెలిపద్మములంబోలు నేత్రములు కొంతమూసి, యుపసంభోగమువలన నలసించులసి నును జెక్కులు జెమర్ప హృదయావందంబు కలుగఁజేయు పూవుబోండ్ల యధరామృత సారంబొక్క పుణ్యవంతులకే దొరకును.

శ్లో. ఆమీలిత నయనానాం యః
సురత రసోను సంవిదం భాతి
మిథు నైర్మిథోవధారిత
మవితథ మేవ కామనిర్వహణమ్॥

తే. గీ. కన్ను లరమోడ్చి విహరించు ♦ చున్నవారి
సురత భోగంబు తెలివితోఁ ♦ బరఁగ నేని
రమ్యమగు నిది కామ ని ♦ ర్వహణమనుచు
నాయికా నాయకులకు ని ♦ ర్ణయముగాదె. 26

తా. నేత్రములు సగముమాత్రమే మూసికొని ఏయువతీ యువకులు సురతంపు రసమును తెలివితో మానసంబులం దనుభవింతురో అదియే కామపురుషార్థముయొక్క సిద్ధియని రతిరాజ్యమేలిన నాయికా నాయకులచే నిశ్చయింపబడినది.

శ్లో. ఇద మనుచిత మక్రమశ్చ పుంసాం
యదిహ జరాస్వపి మాన్మథా వికారాః
యదపించ న కృతం నితంబినీనాం
స్తనపతనావధి జీవితం రతంవా.

చ. ఇది యుచితంబుగానిపని ♦ యిమ్మహిలో మగవారి కెంతయున్
మదన సుఖాభిలాషములు ♦ మానకయున్కి జరాభరంబునం
గాడమ మిటారి ముద్దు చను ♦ గుబ్బలు జాఱినవెన్క బోంట్లకున్
మదన సుఖంబు జీవితము ♦ మాన్పడు తామరచూలి జాణయే. 27

తా. మగవారికి వృద్ధాప్యమువచ్చినను, స్త్రీలకు ముద్దు చనుగుబ్బలు జాఱిన తరువాత సంభోగేచ్ఛ గలిగించు బ్రహ్మ జాణయనిఁ జెప్పనీలులేదు.

శ్లో. రాజం స్తృష్ణాంబురాశే ర్నహి జగతిగతః కశ్చిదేవావసానం
కోవార్థై ర్థైః ప్రభూతైః స్ప్వవపుషిగళితే యౌవనే సానురాగే
గచ్ఛామస్సద్మయావ ద్వికసిత నయనేందీవరా లోకినీనా
మాక్రమ్యాక్రమ్యరూపం ఝడితి న జరయాలుప్య తేప్రేయసీనాం.

శా. ఆశాసాగర పారమేరికిని శ ♦ క్యంబానె చేరంగ భో
గాశాయుక్తము జవ్వనంబు గళితం ♦ బైనన్ ధనంబేల ధా
త్రీశా యింటికిఁ బోదుమే ప్రియవధూ ♦ హృద్యోల్ల సద్రూపరే
ఖా శోభాతిశయంబు దుర్భరజరా ♦ క్రాంతంబు గాకుండఁగన్. 28

తా. ఆశయను మహాసముద్రము దాట నెవరికి శక్యముగాదు. కావున భోగాశా సహితంబగు రూప యౌవనములు జారినవెనుక ధనముండిన మాత్రమేమి లాభము? కనుక రాజా! ప్రియ కాంతల రూపురేఖా యౌవనాదుల వృద్ధాప్యముచే మానిపోక మునుపే యింటికిఁబోయి మీ జవరాండ్రతో సుఖముగానుండుము.

శ్లో. రాగస్యాగారమేకం నరక శతమహాదుఃఖ సంప్రాప్తిహేతు
ర్మోహస్యోత్పత్తిబీజం జలధరపటలం జ్ఞానతారాధిపస్య
కందర్పస్యైవమిత్రం ప్రకటిత వివిధస్పష్టదోషప్రబంధం
లోకేస్మిన్నహ్యనర్థ ప్రజకులభవనం యౌవనాదన్యదస్తి.

చ. రతిపతిచేతి వాలు ఘన ♦ రాగవిలాసము నీతివైరి దు
ర్గతి శతదుఃఖ మోహజని ♦ కారణ ముజ్జ్వలబోధ తారకా
పతి నిబిడాభ్రబృందము శు ♦ భప్రతిబంధము దోషసంఘసం
గతమగు నేఁగి జవ్వనము ♦ కన్న జగంబున వేఱెయున్నదే. 29

తా. యౌవనము అనురాగము కలిగించును. నరక పరంపరలు కలిగించి దుఃఖముల పాలొనర్చును. పరకాంతాపహరణమున కుద్యుక్తునిజేయును. అజ్ఞానమును, ప్రకాశింపజేసి మేఘములు చంద్రుని గప్పినట్లు జ్ఞానమును మరుగుపరుచును మన్మథవికారమునకు లోబరచును. ప్రకటితముగా పలుపాపములఁ జేయించును. అటువంటికష్టములు కలిగించునది యౌవనముకంటె మఱియొక టీజగమందు లేదు.

శ్లో. శృంగార ద్రుమనీరదే ప్రసృమరక్రీడా రసస్రోతసి
ప్రద్యుమ్న ప్రియబాంధవే చతురవాఙ్ముక్తా ఫలోదన్వతి
తన్వీనేత్రచకోర పార్వణవిధౌ సౌభాగ్యలక్ష్మీనిధౌ
ధన్యః కోపిన విక్రియాం కలయతే ప్రాప్తేనవే యౌవనే.

ఉ. మారుని కూర్మిచుట్టము స ♦ మంచిత కేళి రసప్రవాహంబు శృం
గార మహీజనీరదము ♦ కంజముఖీజన దృక్చకోరరా
కారజనీశమండలము ♦ కాంతవచోమణివార్ధి యౌవనం
బారయఁ జెందుచో వికృతి♦నందనివాఁడె కృతార్థుఁడిమ్మహిన్ 30

తా. నీరనకు పారుదలవలె రతికేళిరసము విచ్చలవిడిగ ప్రవర్తింపఁజేయునదియు కూర్మిచుట్టమువలె కందర్పునకుఁదోడై యుద్రేకింపఁ జేయునదియు, సాగరము ముత్యాంబులనీనునట్లు సుస్వరాలుగానెఱజాణంపుమాటలను నీటుగలిగించునది.

యు, పూర్ణచంద్రుఁడు చకోరపక్షుల కుల్లాసము గలిగించునట్లు సుందరాంగులకన్ను గవకుల్లాసము గలిగించెడిదియు, అశ్చర్యమగు జక్కఁదనంపు వచో నైపుణిచే సాకర్షించునదియు, నైన యౌలజవ్వనము పాడసూపగా నన్యుఁ డెవ్వఁడో యొకఁడు విషయవాంఛ నొందకయుండునుగాని, యందరట్లుండరు.

శ్లో. సంసారేస్మి న్నసారే కునృపతి భవనద్వార సేవాకళంక
వ్యాసంగ వ్యస్తధైర్యం కథ మమల ధియో మానసం సంవిదధ్యు
యద్యేతాః ప్రోద్యదిందు ద్యుతినిచయభృతో నస్యు రంభోజనేత్ర
ప్రేంఖత్కాంచీ కలాపా స్తనభర వినమన్మధ్య భాజస్తరుణ్యః॥31

చ. జలజవిలోచనంబులును ♦ సన్నఁపుఁ జందుర కావిచీరలుం
గులుకు మెఱుంగుఁ జన్నులును ♦ గొంచెపుఁ గన్నులు రత్నకింకిణీ
కల రశనా గుణంబులును ♦ గల్గిన కాంతలు గల్గరేని గా
సిలి మతిమంతు లేటికి వ ♦ సింతురు రాజగృహాంగణంబులన్. 31

తా. జల్లనైన తామరరేకులవంటి నేత్రములును, లేతచంద్రుని కీడువచ్చు సన్నవగు బట్టలును, బలితంపు గుబ్బలును, వాలు కన్నులును, రతనములచే స్థాపింపబడిన గంటధ్వనితోఁ గూడిన బంగారుమొలనూలును, కలిగినట్టిరమ్యరూపిణులగు జవరాండ్రులేనిచో భాగ్యవంతులును, బుద్ధిమంతులును, రాజగృహంబులందు మతిలేక యుందురా ?

శ్లో. సిద్ధా ధ్యాసిత కందరే హరవృషస్కంధావరుగ్ణద్రుమే
గంగాధౌత శిలాతలే హిమవతి స్థానేస్థితే శ్రేయసి
కః కుర్వీత శిరః ప్రణామ మలినం మ్లానంమనస్వీ జనో
యద్విత్రస్త కురంగ శావనయనా నస్యు స్స్మరాస్త్రంస్త్రియః॥32

శా. గంగాధౌతశిలాతలంబు హరగో ♦ స్కంధప్రదేశాహతో
త్తుంగక్ష్మాజము సిద్ధ సేవిత గుహా ♦ స్తోమంబు శీతాచలో
త్సంగంబుండఁగ నెవ్వఁడో నృపహా ♦ దంబుల్ గలందాల్ప సా
రంగీ శావవిలోచనల్ మనసిజా ♦ స్త్రంబుల్ సతుల్ లేనిచోన్. 33

తా. గంగాజలంబులచేఁ దడుపఁబడిన రాతిప్రదేశములును శివుని వాహనంబగు నందీశ్వరునిచేఁ బడగొట్టబడిన తరురాజంబులును సిద్ధసేవితంబగు కొండగుహలును కలిగిన హిమవత్పర్వతముండగా నాడుహరిణములచూపులవంటిఁ జూపులుగలిగిన మన్మథాస్త్రంబు లనందగు నారీజనము లేకున్నచో రాజసేవ నెవడంగీకరించును?

శ్లో. సంసార తవ పర్యంత
పదవీ నదవీయసీ
అంతరా దుస్తరా నస్యు
ర్యది రే మది రేక్షణాః॥

తే. గీ. అమితసంసార నీదు ప ♦ ర్యంతపదవి
గలిదలంప దవీయసి ♦ గాదుసూవె
యర్థి నీలోనఁ గడవంగ ♦ నలవి గాని
ఖంజరీటాయతాక్షులు ♦ గలుగ రేని.

తా. ఓ సారము లేని సంసారమా! నీపొలిమేరను జేరవలయునన్న నడుమ సుందరాంగము దాటనీయకుండ నున్నారు. వారు లేకపోయినచో నీహద్దుయిప్పు డున్నంతదవ్వుగా యుండక సమీపమందే యుండును.

## విపక్షద్వయ నిరూపణము

శ్లో. దిశ వనహరిణీభ్యో వంశకాండచ్ఛవీనాం
కబళముపలకోటిచ్ఛిన్నమూలం కుశానామ్
శకయువతికపోలా పాండుతాంబూలవల్లీ
దళ మరుణనఖాగ్రైః పాటితం వా వధూభ్యః॥ 34

చ. శిలమొన మూలముల్ చిదిమి ♦ చెన్నుగ వేణుశరీరకాంతిచే
లలితములైన దర్భకబ ♦ ళంబులు లేళ్ళకు నిమ్ము కానలోఁ
గలితశకాంగనావిపుల ♦ గండవిపాండురనాగవల్లికా
దళముల గోళ్ళఁ ద్రుంచి వని ♦ తాతతికైన నొసంగుమిమ్ములన్.

తా. ఓమనుజుఁడా! విరక్తికలవాఁడవైనచో, నడవికిబోయి బెదురులేక వచ్చెడి జింకలకు, వెదురుకొంకల ప్రభలచే రమ్యంబులగు, గఱికపోచలను, శిలాగ్రంబుల భేదించి మేఁతపెట్టుము. అనురక్తికలవాఁడవగుచో సంసారమందుండి ప్రియురాలికి రమ్యంబులగు నాడుచిలుక చెక్కిళులవలె నించుక ధవళమగు తమల పాకులను గోళ్ళతో ద్రుంచి యిమ్ము.

శ్లో. అసారాస్సంత్వేతే విరతివిరసా వాథ విషయాః
జుగుప్స్యంతాం యద్వా నను సకలదోషాస్పద మితి
తథాప్యేత ద్భూమౌ నహి పరహితా త్పుణ్య మధికం
న చాస్మిన్ సంసారే కువలయ దృశోరమ్య మపరం॥ 35

చ. దురిత నిదానముల్ సకల ♦ దోషగృహంబులు సారహీనముల్
పరిణతి ఘోరముల్ విషయ ♦ పద్ధతు లెంతయు కుత్సితంబు లి
ద్ధరను బరోపకార సుకృ ♦ తంబును బోలవు పుణ్యముల్ మనో
హరతరవస్తువుల్ కువల ♦ యాక్షుల కన్నను గల్గవెవ్వియున్. 35

తా. పాపకారణంబులగు సర్వదోషవాసంబును, కపటసంసర్గమున గలిగించు నవియును మిగుల క్రూరంబులగు విషయవాంఛలు కుత్సితంబులగుటచే సకల కుపకార మొనరించుటకంటె పుణ్యకార్యంబుల స్త్రీలకంటె రమ్యవస్తువులను జగానగానము.

శ్లో. మాత్సర్య ముత్సార్య విచార్య కార్య
మార్యా స్సమర్యాద మిదంవదంతు
సేవ్యా నితంబాః కిము భూధరాణా
ముతస్మరస్మేర విలాసినీనామ్. 36

ఉ. ఆరయ మత్సరంబు విడ ♦ నాడి సమంచితకార్యనిశ్చయో
దారవిచారులై సరస ♦ తన్ వచియింతురుగాక సజ్జనుల్
ధారుణి సేవ్యముల్ గిరిని ♦ తంబములో మరిగాక మన్మథ
స్మేరవిలాసినీ జనని ♦ శేష నితంబములో తలంపఁగన్. 36

తా. సత్పురుషులు విచారణచేసి పక్షపాతంబును విడిచి భూమిలో మంచిత యని నిర్ణయించుటకుఁ బర్వతప్రాంతములు మంచివందురా! లేక మన్మథప్రకాశిత ములగు స్త్రీల కటిప్రదేశములు మంచివందురా?

శ్లో. సంసారే స్వప్నసారే పరిణతితరళే ద్వే గతీ పండితానాం
తత్త్వజ్ఞానామృతౌఘప్లవలలితధియాం యాతుకాలః కథంచిత్
నోచె న్ముగ్ధాంగనానాం స్తనజఘనఘనా భోగసమ్భోగినీనాం
స్థూలోపస్థస్థలీషు స్థగితకరతలస్పర్శలీలోద్యమానామ్. 37

శా. సారం బెక్కడ లేక మిథ్యయగు సం ♦ సారంబునం మార్గముల్
బాఱంజూచిన రెండు పండితులకున్ ♦ బ్రహ్మానుసంధాన యో
గారూఢత్వము రూపవద్యువతి ర ♦ మ్యస్థూల మీనధ్వజా
గారస్యస్తకరారవిందకృతయో ♦ గ్యస్పర్శలీలాప్తియున్. 37

తా. నిస్సారమైయుండు సంసారమునందు బుద్ధిమంతులకు నడచుకొను మార్గములు రెండేకలవు మొదటిది తత్వజ్ఞానమనెడి యమృతము ననుభవించుచు సంసారముగడపుట రెండవది, చక్రములబోలు చన్నులును బలితంపు కటిప్రదేశములుకల జవరాండ్రతో విలాసముగా సంసార సుఖమనుభవించుట.

శ్లో. ఆవాసః క్రియతాం గాంగే
పాపహారిణి వారిణి
స్తనద్వయే తరుణ్యా వా
మనోహారిణి హారిణి. 38

తే. గీ. అఖిల పాతక భయహారి ♦ యైన గాంగ
వారి యందైన యువమనో ♦ హారియగుచు
హారి యగుకల్కికుల్కుమి ♦ టారి చన్ను
దోయి యందైన వాసంబు ♦ సేయవలయు. 38

తా. సమస్తపాపంబులఁబోగొట్టు గంగాజలంబులందు స్నానమొనరించి దాని తీరమున వసించి నిశ్చలుండైయుండుట స్వర్గాప వర్గములనందగును. లేక ముత్తియంపు సరులుయిటునటు కొట్టుకొన జిగిగుబ్బలయందు రమించుచు నిహలోక సౌఖ్యములనైన నందదగును.

శ్లో. కిమిహ బహుభిరుక్తైర్యుక్తిశూన్యైః ప్రలాపై
ర్ద్వయమిహ పురుషాణాం సర్వదా సేవనీయం
అభినవ మదలీలాలాలసం సుందరీణాం
స్తనభరపరిఖిన్నం యౌవనం వా వనం వా॥ 39

చ. కనుగొన యుక్తియుక్తములు ♦ గానివి మాటలు వేయునేటికిన్
గొనబుగ రెండు మానవుల ♦ కున్ భజనార్హములైన వస్తువుల్
వినుత నవీన చారు మద ♦ విభ్రమ లాలస సుందరీజన
స్తన భరఖిన్నమైయమరు♦యౌవనమున్ వనమున్ వసుంధరన్.

తా. సారములేని మాటలనేకము లాడుటవలన ప్రయోజనమేమి? మన్మథవికారంబు సొంపుమీర, కిక్కిరిసియున్న స్తనద్వయముచే సోలి వ్రాలుచున్న సుందరాంగి యెలజవ్వనంబనుభవించి యిహసుఖంబేని, లేక పుణ్యములాచరించి తపస్సుచేసి యాముష్మికసుఖంబేని పురుషుండు సదా యారెంటినే పొందవలయును కాని వేరెద్దియుండదగదు.

శ్లో. సత్యం జనా వచ్మి నపక్షపాతా
లోకేషు స_ప్తస్వపి తథ్యమేతత్
నాన్యన్మనోహారి నితంబినీభ్యో
దుఃఖైక హేతు ర్నచ కశ్చిదన్యః 40

తే. గీ. తథ్యమ వచింతుఁ బక్షపా ♦ తమున గాదు
నిఖిల జగములయందిది ♦ నిక్కువంబు
తోయ్యలులకన్న రమ్యవ ♦ స్తువులు లేవు
వారలే కష్టములకెల్లఁ ♦ గారణములు. 40

తా. నేను సత్యమునే చెప్పుచున్నాను. పక్షపాతము చెప్పను వనితలకన్న రమ్యమగు వస్తువేదియు లేదు. అఖిలజగంబులం దీమాట నిజము. వనితలే కష్టములకెల్లఁ గారకులు.

## 3 కామినీగర్హణము

శ్లో. కాంతే త్యుత్పలలోచనేతి విపులశ్రోణీభరేత్యున్నమ
త్పీనోత్తుంగపయోధరేతి సుముఖాంభోజేతి సుభ్రూరితి
దృష్ట్వా ముహ్యతి మోదతేభిరమతే ప్రస్తౌతి విద్వానపి
ప్రత్యక్షా శుచిభస్త్రికాం స్త్రియమహో మోహస్యదుశ్చేష్టితం

మ. మలభూయిష్టపుఁ దోలుబొమ్మయగు కొ ♦ మ్మంజూచివిద్వాంసుఁడుం
బులిన శ్రోణి మనోహర స్తని నవాం ♦ భోజాస్య నీలోత్పలా
క్షి లతాతన్వియటంచు మత్తుఁడగుచు ♦ ర్లించుక్ రమించున్ బలీ
బళియంచున్ వినుతించు మోహవికృతుల్ ♦ భావింపగాఁజిత్రముల్.

తా. సమస్తము నెఱింగిన విద్వాంసుడు మలమూత్రాదులతో నిండియుం డిన వనితజూచి యామె వలుదపిఱుఁదులాఁడియనియు బటువగు గబ్బిగుబ్బలు గల దనియు. ముఖమప్పుడు వికసించిన తామరపద్మమనియు, లతంబోలిన దేహవునియు కనుబొమలు మన్మథుని బాణములే దీరిచినటులున్నవనియు, సాహించి తిని. క్షోభ కలిగి స్మృతిదప్పి పడును. ఆడుచు పాడుచు మోహవికారుఁడై బాగుబాగని కొని యాడును. జగంబున మోహవికారముల యొక్క సయ్యాటలేమని చెప్పకలము

శ్లో. స్మృతా భవతి తాపాయ
దృష్టాచోన్మాదకారిణీ
స్పృష్టా భవతి మోహాయ
సా నామ దయితా కథమ్.

క. తనుఁ దలఁచినఁ బరితాపము
గనుఁగొనఁ జిత్తభ్రమంబుఁ ♦ గడు వేడుక ము
ట్టిన మోహంబు నొసంగెడు
వనిత దయిత యనుచుఁ బలుక ♦ వచ్చునె జగతిన్. 42

తా. తన్నుదలంచినంతనే బాధయు. చూచినంతమాత్రమున మనోచపలత్వ మును, ఆనందమున స్పృశించినమాత్రాన మోహంబు కలుగజేయు స్త్రీని ప్రియు రాలని పిలువకూడదు.

శ్లో. తావ దేవామృతమయీ
యావ ల్లోచనగోచరా
చక్షుష్పథా దతీదాతు
విషాద వ్యతిరిచ్యతే. 43

తే. గీ. ఎంతలోనింతి కన్నుల ♦ యెదుట నిలుచు
నంతలో నింపువాటించు ♦ నమృతమట్ల
కాక లోచనమార్గంబు ♦ గడచె నేని
గరళముకన్నఁ బ్రాణసం ♦ కటము జేయు 53

తా. జగంబుననారీరత్నముకంటె మించిన యమృతములేదుఅట్టి సుందరాంగి కంటికి వరుగయ్యెనా కాలకూటవిషమునకు మించి ప్రాణముల నడంచును.

శ్లో. నామృతం నవిషం కించి
దేకాం ముక్త్వానితంబినీమ్

సైవామృతలతా యుక్తా
వియుక్తా విషవల్లరీ 44

ఆ. వె. పడతి నొక్క దాని ♦ విడచి యించుక యమృ
తంబులేదు భువి వి ♦ షంబు లేదు
అమృతలత లతాంగి ♦ యనురాగవతి యైన
గాక మెలఁగె నేని ♦ గరళవల్లి. 44

తా. బలితంపు గబ్బిగుబ్బలచే నలరారు యౌవనాంగితో కూడియుండి నప్పు డమృతము గ్రోలినట్లున్నది అట్టిపువుబోఁడి యెడబాసినచో విషమువలె ప్రాణముల నడంచుచున్నది. కావున నారీరత్నముకంటె యమృతముగాని కాకోల విషముగాని మఱియొకటి లేదు.

శ్లో. ఆవర్త స్సంశయానా మవినయభవనం పట్టణం సాహసానాం
దోషాణాంసన్నిధానం కపటశతమయం క్షేత్రమప్రత్యయానాం
స్వర్గద్వారస్య విఘ్నో నరకపురముఖం సర్వమాయాకరండం
స్త్రీయంత్రం కేన సృష్టం విషమమృతమయం ప్రాణిలోకస్యపాశః

మ. నరకద్వారము సాహసాకరము పుణ్య ♦ స్వర్గవిఘ్నంబు దు
స్తరమాయాశతపేటి గంభనిధిదో ♦ షస్థానమప్రత్యయో
త్కర సుక్షేత్రము కాలకూటమమృతా ♦ కారంబు స్త్రీయంత్రముగ్
ధర నెవ్వాఁడు సృజించెఁ బూరుషగళో ♦ ద్బంధక్రియాపాశమున్.

తా. పరిమితిలేని సందేహముల కలిగించి వినయములేనిదై మిక్కిలిసాహసము కలదియై, కపటముకలదియు, అవిశ్వాసము కలిగించునదియు, స్వర్గప్రాప్తి లేకుండఁ జేయునదియుఁ జూపునకమృతమైయునది హృదయంబున విషముకలదియు పురుషులకెల్ల సంబంధమైనట్టియునగు వనితా యంత్రము నేకుత్సితుఁడు నిర్మించెనో కదా!

శ్లో. నో సత్యేన మృగాంక ఏషవదనీ భూతో నచేందీవర
ద్వంద్వంలోచనతాంగతం నకనకై రప్యంగయష్టిః కృతా
కింత్వేవం కవిభిః ప్రతారితమనా స్తత్త్వం విజానన్నపి
త్వక్మాంసాస్థిమయం వపుర్మృగదృశాం మందోజనస్సేవతే. 46

చ. అలనెల కామినీవదన ♦ మై జనియింపఁగ లేదు కల్వలున్
నెలఁతకు గన్నులై యునికి ♦ నిక్కముగాదు కడానిచే నొడల్
వలనుగఁ జేయలేదు కవి ♦ వంచితమానసుఁడై వివేకియున్
మలమలినాంగనాతను స ♦ మాశ్రయుఁడై విహరించుమందతన్.

తా. వనితల మొగము చంద్రుని బోలియుండ లేదు. కన్నులు నల్లకలువలు కావు. శరీరము బంగారముతోఁ జేయబడినదుండ లేదు. అయినను కవులు స్త్రీలనట్లు వర్ణింపగా మూర్ఖుఁడు నిని స్త్రీ దేహము నీచుకండ నెనుకలతోఁ గూడినదని యెఱింగియు దానినే సేవించుచున్నాఁడు.

శ్లో. లీలావతీనాం సహజా విలాసా
స్త ఏవ మూఢస్య హృది స్ఫురంతి
రాగో నలిన్యా హి నిసర్గసిద్ధ
స్తత్ర భ్రమత్యేవ ముదా షడంఘ్రిః.

తే. గీ. లలితమైనట్టి లీల లీ ♦ లావతులకు
సహజమది మూఢునకు మది ♦ సందడించుఁ
బద్మినికి రాగగరిమ స్వ ♦ భావికంబు
తేఁటి పనిలేక దానిలోఁ ♦ దిరుగుచుండు. 47

తా. ఎఱ్ఱఁదనము తామరపద్మమునకు సహజమైనను తేనెటీగ తనకొరకే యని భ్రమించునట్లు, జవరాండ్రకున్నాశ్యరంపునగలు కూనఁబుట్టినవే యయినను మూఢుఁడది యెఱుగఁక వారలసుందరత్వమునకు కాశపడును.

శ్లో. యదేతత్పూర్ణేందుద్యుతిహరముదారాకృతి పరం
ముఖాబ్జం తన్వంగ్యాః కిల వసతి యత్రాధరమధు
ఇదం తత్కింపాకద్రుమఫల మిదానీ మతిరసం
వ్యతీతేస్మిన్కాలే విషమివ భవిష్యత్యసుఖదమ్.

శా. రాకాకైరవమిత్రకాంతిహరమై ♦ రమ్యాధరోష్ఠామృతా
స్తోకంబై విలసిల్లుచున్న రమణీ ♦ శుంభన్ముఖాబ్జంబు కిం
పాకత్మోజఫలంబగున్ రుచిరమై ♦ ప్రారంభకాలంబునం
గాకోలంబు తెఱంగునన్ నరులకుం ♦ గష్టంబొసంగుందుదిన్. 48

తా. పున్నమచంద్రుని క్రీడగుననియు, సౌందర్యవతియనియు, యాధరమందుఁ జేనిగలదనియుఁ జెప్పఁబడు సుందరాంగుల కెమ్మోము యౌవనకాలమందమృతము వలెనుండి వార్ధక్యమునందు విషమువలె దుఃఖమైపోవును.

శ్లో. ఉన్మీలత్త్రివళీతరంగవలయా ప్రోత్తుంగపీనస్తన
ద్వంద్వేనోద్యత చక్రవాకయుగళా వక్త్రాంబుజోద్భాసినీ
కాంతాకార ధరా నదీయమభితః క్రూరాశయానేష్యతే
సంసారార్ణవ మజ్జనం యదితదా దూరేణసంత్యజ్యతాం.

చ. చన్నులు చక్రవాకములు ♦ చక్కని మోముఁ గరంబు లబ్జముల్
గన్నులు మీలం నాభి సుడి ♦ గాఢనితంబము సైకతంబుగా
నెన్నికఁ గన్న బోటియను ♦ నేటికి దవ్వుల నున్కి చాల మే
లెన్న భవాబ్ధిమజ్జన మ ♦ దేమియుఁ గోరని వారి కిమ్మహిన్. 49

తా. చక్రవాకములబోలు చన్నులును, సుందరవదనమును, కరంబులను పద్మంబులును, మత్స్యంబులను కనులును, వలుదపిఱుఁదులును యిసుకతిన్నెలును కలిగి నదితో సమానంబగు స్త్రీ యను నదిలోను, సంసారసాగరమును సముద్రములో మునుంగుట కిష్టములేకపోయిన దూరముగనుండుటయే మంచిది.

శ్లో. జల్పంతి సార్ధమన్యేన
పశ్యంత్యన్యంసవిభ్రమాః
హృద్గతం చింతయంత్యన్యం
ప్రియః కోనామ యోషితామ్.

తే. గీ. ఒకనితోఁ గూడి భాషింతు ♦ రొక్కనరునిఁ
జూతురు విలాససంపద ♦ సొంపుఁ గులుకు
మఱియు నొక్కని దలఁతురు ♦ మనసు లోనఁ
గూర్చు ప్రియుఁ డెవ్వఁడో ముద్దు ♦ గుమ్మలకును. 50

తా. ముద్దుగుమ్మలకుఁ బ్రియుండెవ్వఁడో తెలిసికొనలేము. ఏమనఒకనితో బ్రియముగ మాటాడుదురు. వేరొకని నొయ్యారముగఁ జూతురు. మఱొకనిని మనసునందు దలంతురు. ఇట్టిరీతులనుండువారికిఁ బ్రియుం డెవ్వడని జెప్పఁగలము?

శ్లో. అపసర సఖే దూరా దస్మా త్కటాక్షవిషానలా
త్ప్రకృతివిషమా ద్యోషిత్సర్పా ద్విలాసఫణాభృతః

ఇతరఫణినా దష్టశ్శక్య శ్చికిత్సితు మౌషధై
శ్చతురవనితాభోగిగ్రస్తం త్యజంతిహి మంత్రిణః

ఉ. చూపు విషంబు విభ్రమము ♦ సొంపు ఫణాఫలకంబుగా వధూ
రూపముఁ దాల్చు భోగినికి ♦ రూఢిగ దూరముగాఁ దొలంగుమీ
దాపుగ సర్పదష్టునకుఁ ♦ దప్పవిషంబుమహౌషధంబులం
బాపవధూభుజంగవిష ♦ భగ్నునిచెంతకుఁ బోరు మాంత్రికుల్ 51

తా. చూపును విషంబులను, శృంగారవిభ్రమము పడగలుగాను కాంతాకారంబును బొందిన సర్పమునకు నిశ్చయముగా దవ్వుగ నుండవలయును సర్పదష్టునకు మంత్రౌషధములచే బాధ నివారింపనగును. కాంతాసర్ప విషంబుచే భగ్నుండైన వానిదగ్గరకు మాంత్రికులు దఱిఁ జేరరు.

శ్లో. విస్తారిత మకరకేతన ధీవరేణ
స్త్రీ సంజ్ఞితం బడిశమత్రభవాంబురాశౌ
తేనా చిరాత్త దధరామిషలోలమర్త్య
మత్స్యా న్వికృష్య స పచ త్యనురాగవహ్నౌ 52

ఉ. చేరి మనోజధీవరుని ♦ చేత భవాంబుధిలోన నంగనా
కారముఁ బూనియున్న పెను ♦ గాలము చిమ్మగనయ్యె దానిచే
భీరు జనాధరామిషముఁ ♦ బేర్మిభుజించు నరాండజంబులన్
వారక సోకకుందిగిచి ♦ వండు మరుం డనురాగవహ్నిలోన్. 52

తా. శృంగారనాథుండగు మన్మథుఁడు సంసారమనెడి సాగరమందు స్త్రీయను గాలమును విసరి అ స్త్రీ కెమ్మోవియును నెరకు దగుల్కొన్న మనుజులను చేపలను పట్టి యనురాగమను నగ్నిలోఁ గాల్చును.

శ్లో. కామినీ కాయకాంతారే
కుచపర్వతదుర్గమే
మా సంచర మనః పాంథ
తత్రాస్తే స్మరతస్కరః 53

క. స్తనపర్వత దుర్గమమై
ఘనమగు కాంతాశరీర ♦ కాంతారము నం
జనఁబోకు మనః పాంథుఁడ
కనలుచు మరుఁడనెడి దొంగ ♦ గలఁడుచ్ఛోటన్. 53

తా. ఓ మానసచోరుడవైన! వలుద గబ్బిగుబ్బలను పర్వతములచే జొరశక్యము కాని కాంతాశరీరమనెడి కాననమందు మరుఁడనెడి దొంగ దాగియున్నాఁడు కావున యా కాననమందుఁ గాలు పెట్టకుము. ఆ యడవియందుఁ బ్రవేశించిన నీమాన మెల్ల వాడపహరించును.

శ్లో. వ్యాదీర్ఘేణ చలేన వక్రగతినా తేజస్వినా భోగినా
నీలాబ్జద్యుతినాహినా వరమహం దష్టోనతచ్చక్షుషా
దష్టేసంతి చికిత్సకా దిశిదిశి ప్రాయేణ ధర్మార్థినో
ముగ్ధాక్షీక్షణవీక్షితస్య నహిమే వైద్యోనవాప్యౌషధం. 54

చ. ఉరుగము ముట్టినా నరుల ♦ కుర్విని వెజ్జులు ధర్మశీలురై
గరళము నెక్కుడింతు రధి ♦ కంబుగ నాయత మేచకోత్పల
స్ఫురణ వహించి వక్రగతిఁ ♦ బూనిన మానినిచూపుసోకినం
బురుషున కెందు మందులును ♦ బొందవు పొందరు వెజ్జులెవ్వరున్.

తా. బుద్ధిమంతులగు భిషగ్వరులు సర్పదష్టునకు మందిచ్చి నివారింతురు. తెలితామర పద్మమువంటి నేత్రములు గలిగి యొయ్యారంపుఁ జూపులుగల స్త్రీ దృష్టి తగిలిన మనుజునకు మందులెన్ని యిచ్చినను లాభంబులేదు. వైద్యులక్కడకు పోనేపోరు.

శ్లో. ఇహ హి మధురగీతం నృత్త మేతద్రసోయం
స్ఫురతి పరిమళోసౌ స్పర్శఏష స్తనానాం
ఇతిహత పరమార్థై రింద్రియైర్భ్రామ్యమాణః
స్వహితకరణధూర్తైః పంచభి ర్వంచితోస్మి.

ఉ. ఈమృదుగాన మీనటన ♦ మీకుచమర్దన మీసుధారసం
బీమహనీయసౌరభము ♦ వింతులయందుఁ దనర్చునంచు న
న్నేమఱఁజేసి యాత్మహిత ♦ మిచ్చినభంగి మెలంగి యింద్రియ
గ్రామము మోసపుచ్చెహిత ♦ కార్య విహీనుఁడనై తిసక్కటా. 55

తా. ఆహా! ఆ మృదుమధురమైన గానము, ఆనటన, ఆ కుచమర్దనము, ఆ సుధారసము, ఆ మహాసౌరభము అనుభవించవలెగాని యావి నన్ను వంచించి మనస్సున కుద్రేకముగలిగించి యింద్రియంబులు నన్ను నష్టపెట్టినవి. నేను హితకార్య విహీనుండ నయితిని.

శ్లో. న గమ్యో మంత్రాణాం నచ భవతి భైషజ్యవిషయో
న చాపి ప్రధ్వంసం వ్రజతి వివిధై శ్శాంతికశతైః

భోమాా వేశా దంగే కమపి విదధ్యంగ మసకృత్
స్మరాపస్మారో యం భ్రమయతి దృశం ఘూర్ణయతిచ. 56

ఉ. ఆరయ మంత్రగమ్యమును ♦ నౌషధ సాధ్యముఁగాదు శాంతికా
చారశతంబులం జెందు ♦ చండతరభ్రమకల్పనోద్ధతిన్
భూరి వికారమంగములఁ బూన్చుచు మన్మథజన్య మీయప
స్మారము లోచనద్వయము ♦ సారెకుఁద్రిప్పడుఁ జక్రముంబలెన్.

తా. జగంబున నపస్మారరోగంబు మంత్రౌషధములచేఁ గాని శాంతికర్మలచేఁ గాని కుదర్పవచ్చును. మన్మథోద్రేకముచేఁ గలిగిన నపస్మారరోగము మంత్రౌషధంబులచేగాని శాంతికర్మలచేగాని కుదుర్చుటశక్యముగాదు మన్మథార్జితోన్మాదములుబుట్టి నేత్రద్వయంబును చక్రమువలెఁ దిరుగుచుండును.

శ్లో. జాత్యంధాయచ దుర్ముఖాయచ జరాజీర్ణాఖిలాంగాయచ
గ్రామీణాయచ దుష్కులాయచ గళత్కుష్ఠాభిభూతాయచ
యచ్ఛంతీషు మనోహరంనిజవపుర్లక్ష్మీలవ శ్రద్ధయా
పణ్యస్త్రీషు వివేకకల్పలతికా శస్త్రీషురజ్యేతకః 57

చ. విడువక పుట్టుగ్రుడ్డునకు ♦ వృద్ధశరీరికిఁ గుష్ఠురోగికిన్
జడునకు జాతిహీనునకుఁ ♦ జారు నిజాంగము లొక్కరూకకై
కడువడి నిచ్చు వారిగుణ ♦ కల్పలతల్ విదళించు కత్తులం
బడుపుఁ బడంతులం దనదు ♦ భావముఁ జేర్చునె యెవ్వడేనియున్.

తా. లోకములో వెలకొంతలెవ్వనికైనగూడ పుట్టుగ్రుడ్డికి ముసలివానికి తమ శరీరములను స్వల్పధనంబులకై వారి కప్పగింతురు సకలార్థసాధనమగు వివేకము బాడుచేయుచు నిట్టి యేహ్యకార్యముల కొడిగట్టు వెలయాలి యెడనెంత వివేకహీనుని కయినను శక్తిపుట్ట నేరదు.

శ్లో. వేశ్యా సౌ మదన జ్వాలా
రూపేంధన సమేధితా
కామిభి ర్యత్రహూయంతే
యావనాని ధనాని చ. 58

క. రూపేంధనవర్థిత వే
శ్యాపంచశరాగ్ని కీల ♦ యం దంగజ పూ
జాపరతంత్రులు వేల్తురు
దాపురగఁ దమజవ్వనములు♦ ధనములు గడఁకన్. 58

తా. వెలవెలంది యొకమన్మథాగ్నిజ్వాల ఈజ్వాలచక్కందనమనెడిసమిధల చేంపొందింపఁబడినది, కాముకులు తమయౌవనమనెడి ధనమును వేల్తురు.

శ్లో. కశ్చుంబతికులపురుషో
వేశ్యాధరపల్లవం మనోజ్ఞ మపి
చారభటచోరచేటక
నటవిటనిష్ఠీవనశరావమ్. 59

క. జార భట చోర చేటక
చార నటప్రభృతి నీచ ♦ జన నిష్ఠీవా
ధార శరావము వార
స్త్రీ రమ్యాధరము సంస్పృ ♦ శింతురె కులజుల్.

తా. చోరులు, భటులు, విటులు. కొండెగాండ్రు, చారులు మొదలగు దుష్టాత్ముల నిష్ఠీవనముల కొలవాలమైన వెలయాలి యధరచుంబనమునకు సత్కులజుఁడు ఆశపడఁడు.

శ్లో. మధు తిష్ఠతి వాచి యోషితాం
హృది హాలాహల మేవ కేవలం
అత ఏవ నిపీయతే ధరో
హృదయంముష్టిభి రేవ తాడ్యతే. 60

చ. కలదుగదా సుధారసము ♦ కంజ దళాక్షుల ముద్దుబల్కులన్
వెలయుఁ గదా హాలాహలము ♦ వీరల చిత్తమునందుఁగావునం
బలుమఱుఁ బల్లవాధరముఁ ♦ బాన మొనర్తురు నిండు వేడుకన్
బలితఁపు బొమ్మ ముష్టితల ♦ పాతములం బ్రహరింతు రెంతయుఁ

తా. జవరాండ్రనోటియందు సుధారసమున్నది. హాలాహలముతో నిండి యున్నది హృదయము. అందువలననే పురుషులు వారికెమ్మోవి నాదరముతోఁ గ్రోలుచుందురు. పిడికిళులతో హృదయమును గొట్టుదురు.

## ౪ సువిరక్త దుర్విరక్త పద్ధతి

శ్లో. ధన్యాస్త ఏవధవళాయతలోచనానాం
తారుణ్య దర్పఘనపీన పయోధరాణామ్
క్షామోదరో పరిలసత్త్రివళీ లతానాం
దృష్ట్వా కృతిం వికృతమేతి మనో న యేషామ్. 61

చ. కలికి మెఱుంగు వాలుఁ జెలి ♦ గన్నులు సన్నపుఁ గౌనుదీఁగె పై
నలరెడు సద్వళీలతలు ♦ నంచిత యౌవన దర్పలక్ష్మి చేఁ
గులికెడు సిబ్బెఁపున్వలుఁద ♦ గుబ్బలునుం గలమించు బోండ్ల రూ
పులఁగని నిర్వికారులగు ♦ పూరుషులే కృతకృత్యు లిద్ధరన్. 61

తా. తెలితామర రేకుల నిరసించు కన్నుఁగవగలిగి యౌవనమునఁ గ్రిక్కిరిసి లలితంపుఁ జన్గవగలిగి కవకవలాడుచు నెన్నడుముమీద యోగ్యమైన వలులను తీగెలును గలిగి చూపట్టు స్త్రీరూపములఁ జూచి వికారమునొందనివారే ధన్యులు.

శ్లో. బాలే లీలాముకుళిత మమీ మందరా దృష్టిపాతాః
కింక్షిప్యంతే విరమవిరమ వ్యర్థ ఏషశ్రమ స్తే
సమ్ప్రత్యన్యే వయ ముపరతం బాల్య మాస్థా వనాంతే
క్షీణో మోహ స్తృణ మివ జగజ్జాలమాలోకయామః. 62

ఉ. మానిని యేల చిమ్మెదవు ♦ మాపయి మంథర దృష్టిపాతము
ల్మానుము నీశ్రమంబు విఫ ♦ లంబిది వింతలమైతి మి త్తఱిన్
మానుగ జవ్వనంబడఁగె ♦ మానసవృత్తి వనంబుఁ గోరె న
జ్ఞానము నష్టమయ్యె యవ ♦ సంబుగ జూచెద మెల్లలోకముల్

తా. ఓ స్త్రీయంత్రమా! నీవిషపుచూపులు మాపైఁ బ్రసరింపఁజేయకుము. నీప్రయత్నమంతయు వృధాయగును మే మాశ్చర్యము పొందితిమి. యౌవనముదాటి పోయినది. మా మానసము కాననంబును కాంక్షించుచున్నది. మాకు సర్వప్రపంచ మును తృణప్రాయమైయున్నది. అజ్ఞానాంధ కారమునుండి జ్ఞానలోకము నందితిమి.

శ్లో. ఇయం బాలా మాం ప్రత్యనవరత మిందీవరదళ
ప్రభా చోరం చక్షుః క్షిపతికి మభిప్రేత మనయా
గతో మోహోస్మాకం స్మరకుసుమ బాణవ్యతికర
జ్వల జ్వాలా శాంతా తదపి న వరాకీ విరమతి. 63

ఉ. నీలసరోజపత్ర కమ ♦ నీయ విభాహరణ ప్రవీణ దృ
గ్జాలము లీలతాంగి వెద ♦ చల్లెడు నాపయి [illegible]నో
తూలె సమస్తమోహ వికృతుల్ ♦ రతివల్లభ భల్లభల్ల హూ
జ్వాల లడంగె మాకుఁదన ♦ వైఖరి మానదు బోటి నేఁటికిన్. 63

తా. ఈ సుందరాంగి దేనితో వాంఛించినామీదకు నల్లకలువల కాంతి నిరసించు తనవిషమచూపులను బరపుచున్నది. పూవిల్తుని పుష్పబాణపు మంట లడగి పోయినవి. మోహము శమించినది. వనితయం దాసక్తిలేదు ఇఁకనైన నావనిత తనసహజగుణంబులగు కామవికారమును విడచుట మంచిదని యభిప్రాయము.

శ్లో. రే కందర్ప కరం కదర్థయసి కిం కోదండటంకారితైః
రేరే కోకిల కోమలైః కలరవైః కింవా వృథాజల్పసి
ముగ్ధే స్నిగ్ధ విదగ్ధ ముగ్ధ మధురైర్లోలైః కటాక్షైరలం
చేతశ్చుంబిత చంద్రచూడ చరణ ధ్యానామృతంవర్తతే.

ఉ. ఓరి మనోజసూన శర ♦ మూరక చిమ్మకు మిన్న కే కుహూం
కారము లేల చేసెదు పి ♦ కద్విజ యోమృగశాబకాక్షి నీ
చారు విలోకనంబు లిఁక ♦ జాలును నాహృదయంబు శంకరో
దార పదాబ్జ చింతన సు ♦ ధారస తత్పరమయ్యె నియ్యెడన్. 64

తా. మన్మథా! నీపుష్పశరంబులు మాపై ప్రయోగించి వృథాపరచుకొనకుము. ఓ గండుకోయిలా! నీ హుంకారంబుల నికఁ గట్టిపెట్టుము. ఓ కాంతామణీ! నీవిలాసంపు జూపుల మాపైబరకుము. మా మానసం బీశ్వరపాద పద్మంబుల ధ్యానమునమునింగి యున్నది.

శ్లో. విరహేపి సంగమః ఖలు
పరస్పరం సంగతం మనోయేషామ్
హృదయమపి విఘటితం చే
త్సంగో విరహం విశేషయతి. 65

క. విరహమునందైనఁ బర
స్పర మనురాగులకుఁ బొందు ♦ భాసిలు మన నె
వ్వరి కెనయదు వారలకును
విరహము హెచ్చుక నొనర్చు ♦ వెస సంగతియున్. 65

తా. యువతీయువకులమనంబు లొండొంటితోఁ గలిసియుండెనేని కాలవశమున వారెడబాసియుండిరేని, వారిరువురు కలిసియుండినట్లుగనే యగుదురు. హృదయము వేఱుపడియుండెనా వారుకలసియున్నను విడిపోయినట్లేయగును.

శ్లో. కిం గతేన యది సా న జీవతి
ప్రాణితి ప్రియతమా తథాపికిమ్
ఇత్యు దీక్ష్య నవ మేఘమాలికాం
న ప్రయాతి పథిక స్స్వమందిరమ్.

క. చనసేటికిఁ బ్రేయసి జీ
వనవతియగు నేని ప్రాణ ♦ వతిగాని తటిం
బనియేమని యొక తెరువరి
చనఁడింటికి నవ్యజలద ♦ సమయమునందున్. 66

తా. ఒకానొక పాంథుడు నూత్న మేఘముఁ జూచి తన ప్రియురాలు విరహానలంబుచే బ్రతికియున్నను, చచ్చినను నేమిలాభం బని గృహోన్ముఖుఁడు కాలేదు.

శ్లో. విరమత బుధా యోషిత్సంగా త్సుఖాత్క్షణ భంగురా
త్కురుత కరుణామైత్రీ ప్రజ్ఞవధూ జనసంగమం
న ఖలు నరకే హారాక్రాంతం ఘన స్తనమండలం
శరణ మథవా శ్రోణీబింబం రణన్మణి మేఖలం

మ. మనసింపొందఁగ ధీరులార కరుణా ♦ మైత్రీ మనీషా క్షమా
వనితా సంగమ మాచరింపుఁ డెపుడున్ ♦ భామాసుఖంబస్థిరం
బని వర్జింపుఁడు హారరమ్యకుచముల్ ♦ ప్రాంచన్మణీ మేఖలా
ధ్వనితాలంబి నితంబమున్ నరకబా ♦ ధల్ మాన్పిరక్షించునే. 67

తా. బుద్ధిమంతులారా! కరుణ, స్నేహము, శాంతముగల స్త్రీసంయోగముఁ జేయుఁడు. స్త్రీలతోడి సౌఖ్యము క్షణకాలముగదా! స్త్రీల స్తనద్వయముగాని, చిరుగజ్జెల వడ్డాణముచే వ్రేలాడు బలితంపు వలుదపిఱుందులుగాని నరకబాధలఁ బోగొట్టజాలవు.

శ్లో. యదా యోగాభ్యాస వ్యసనకృశయో రాత్మమనసో
రవిచ్ఛిన్నా మైత్రీ స్ఫురతి కృతిన స్తస్య కిము తైః
ప్రియాణా మాలాపై రధరమధు భిర్వ క్త్రవిధుభిః
సనిశ్వాసామోదైః సకుచకలశాశ్లేషసురతైః 68

చ. ఎనసిన యోగమార్గ రతి ♦ యెవ్వని డెందములో వెలుంగుతోం
గొనకొని యేకమై వెలుఁగుఁ ♦ గూరిమి మీఱఁగ వాని కేటికిఁ
వనితల ముద్దుపల్కులును ♦ వాతెర తేనియలూర్పు దావులున్
గొనబగు మోముఁజందురులు♦గుబ్బలఁగౌగిటఁజేర్పుకూటముల్ 68

తా. ఎవనిమానసము యోగాభ్యాసనిష్ఠకులోబడి మహదానంద ననుభవించునో యట్టిపూజ్యునకు జవరాం్రడ్ర వలపుమాటలతోను, అధరామృతముతోను, మోముచంద్రులతోను, వాసనలనిట్టూర్పులతోను, గబ్బిగుబ్బల కౌగిళులతోను, సంబంధముండదు.

శ్లో. యదాసీ దజ్ఞానం స్మరతిమిరసంచార జనితం
తదా దృష్టం నారీ మయమిదమ శేషం జగదితి
ఇదానీ మస్మాకం పటుతర వివేకాంజనజుషాం
సమీా భూతా దృష్టి స్త్రిభువన మపిబ్రహ్మ మనుతే. 69

చ. స్మరతిమిరప్రచార భవ ♦ శశ్వదబోధము గల్గువేళ మే
దురగతి ముజ్జగంబులు వ ♦ ధూమయమైకననయ్యె నిప్పుడిం
పరయఁగ సద్వివేక మహి ♦ తాంజన సంగతమై మదీయ భా
సురసమదృష్టిబ్రహ్మముగఁ♦జూచుచునున్నదివిశ్వమంతయున్.69

తా. బుద్ధికి మన్మథాంధకారము కలిగినప్పుడు త్రిలోకంబులు స్త్రీమయముగాఁ దోచినవి. వివేకజ్ఞానముచే నాయజ్ఞానము నశింపఁగా సర్వప్రపంచము బ్రహ్మస్వరూపమై కనుపట్టుచున్నది.

శ్లో. తావదేవ కృతినామపి స్ఫుర
త్యేష నిర్మలవివేక దీపకః
యావదేవ నకురంగచక్షుషాం
తాడ్యతే చటులలోచనాంచలైః.

క. నీలోత్పల నయనా తర
ళాలోకన హతులు సోఁకు ♦ నంతకు వెలుఁగున్
ధీలలిత సుజన విమలో
ద్వేలాతి స్ఫుటవివేక ♦ దీపము నెమ్మిన్. 70

తా. ధీశాలురైనవారికిఁగూడ నిర్మలమైన జ్ఞానదీపము సుందరాంగుల ప్రణయంపుఁ జూపులు తగులకుండునంతవఱకే ప్రకాశించునుగాని, యవితగిలెనా ప్రకాశింపనేరదు.

శ్లో. వచసి భవతి సంగత్యాగ ముద్దిశ్య వార్తా
శ్రుతిముఖరముఖానాం కేవలం పండితానామ్
జఘన మరుణరత్న గ్రంధికాంచీ కలాపం
కువలయనయనానాం కోవిహాతుం సమర్థః. 71

చ. నిగమసుభాషితాభ్యసన ♦ నిష్ఠలు గల్గిన యట్టి పండితుల్
మగువల పొందు నింద్యమని ♦ మాటికి వార్తలు చెప్ప నేర్పరుల్
జగమున నెవ్వఁ డోపు విల ♦ సత్కురువింద మణిప్రభావ ధగ
ద్ధగిత కలాప రమ్యవని ♦ తా జఘనంబుఁ బరిత్యజింపఁగాన్. 71

తా. దుర్విరక్తులు వేదవేదాంగములఁ జదువుపండితులు వనితాసంభోగము తప్పని పదేపదే చెప్పుటయే గాని తామనినమాటనాచరణయం దుంచరు. ఎవఁడు కురువిందమణుల కాంతులచే ధగద్ధగాయ మానములగు నలంకారములతోఁ జెలు వొందుచున్న కలునకంతుల వలుదపిఱుఁదులను వదలుకొనును.

శ్లో. స్వపర ప్రతారకో సౌ
నిందతి యోలీకపండితో యువతీః
యస్మాత్తపసోపి ఫలం
స్వర్గ స్వర్గేపిచాప్సరసః. 72

తే. గీ. కుటిలవాదియుఁ బరవంచ ♦ కుండు వాఁడు
నెమ్మి నెవ్వాఁడు యువతుల ♦ నిందసేయు
నింద్రలోకము తపముల ♦ కెల్లఫలము
స్వర్గమున నున్నవార ల ♦ చర్చలు గారె? 72

తా. స్త్రీలను దూషించువాఁడు, కుటిలవాదియు పరులను మోసగించువాఁడు నగును. తపమాచరించు టింద్రలోకమున కేగుటకే, అట్టి యింద్రలోకమున నచ్చర లుందురుకదా?

శ్లో. మత్తేభకుంభదళనే భువి సంతి ధీరాః
కేచిత్ప్రచండమృగరాజవధేపి దక్షాః

కింతు బ్రవీమి బలినాం పురతః ప్రసహ్య
కందర్పదర్పదళనే విరలా మనుష్యాః

తే. గీ. సదమ కుంజర కుంభ భం ♦ జనులు మఱియు
నుగ్ర మృగరాజు వధ దక్షు ♦ లుర్విఁ గలరు
తరుచుగా లేరు కందర్ప ♦ దర్పదళన
నిపుణజనులని చాటెంతు ♦ నిఖిలసభల 73

తా. మదించిన యేనుఁగును జంపువారు, బెడిదమైన సంగమునే జంపువారు కలరు. కాని మన్మధుని వాడిబాణముల నివారించువారు లేరని మిగుల బలీయుల మోళ్ల నేనిజంకొవంతయులేక చెప్పుచున్నారు.

శ్లో. సన్మార్గే తావదాస్తే ప్రభవతి చ నర స్తావదేవేంద్రియాణాం
లజ్జాం తావద్విధత్తే వినయమపి సమాలంబతే తావదేవ
భ్రూచాపాకృష్టముక్తా శ్శ్రవణపథగతా నీలపక్ష్మాణ ఏతే
యావల్లీలావతీనాం సహృది ధృతిముషో దృష్టిబాణాః పతంతి 74

శా. సారాచారముఁబూనునింద్రియములన్ ♦ శాసించు లజ్జాన్వితుం
డై రాజిల్లుఁ బ్రశాంతిజేకొనునరుం ♦ డందాఁక నెందాఁక దు
ర్వారంబుల్ శ్రుతిమార్గగాములు నుదా♦ రభ్రూధనుర్ముక్తముల్
నారీవీక్షణబాణముల్ చొరవు వి ♦ న్నాణంబుగా డెందముల్. 74

తా. విలుకాండ్రు చెవివఱకు వింటెని వంచి నారినిలాగి నల్లనిగఱులతోఁ గూడిన బాణములవిడుచునటుల జవరాండ్రకనొబ్బమలువంచి చెవివఱకు గడచు కొను నేత్రద్వయమునుండి నల్లనిరెప్పలతో నీటుగా వాడిచూపుల బరపకుండునంత కాలము పురుషుఁడు సద్వర్తనము: నింద్రియవిగ్రహము, లజ్జావినయమును గల్గి యుండును. వారట్టి చూపులు బరపిరేని యవి యెల్ల నుండనేరవు'

శ్లో. ఉన్మత్తప్రేమసంరంభా
దారభంతే యదంగనాః
తత్ర ప్రత్యూహ మాధాతుం
బ్రహ్మాపి ఖలు కాతరః 75

క. ప్రేమావేశభరంబున
భామాజను లాచరించు ♦ మరలింపం

దామరవిరిలోఁ బొడమిన
యామేటికినైన నలవి ♦ యగునె తలంపన్. 75

తా. భామామణులు బలీయమగు వలపున నేపనినైన తత్తఱపడి మంచిదైనను, చెడ్డదైనను చేయఁబూనినచో దానినడ్డగింప బ్రహ్మకైన శక్యముగాదు. ఇఁక నితరుల మాటఁజెప్పనేల.

శ్లో. తావ న్మహత్త్వం పాండిత్యం
కులీనత్వం వివేకతా
యావ జ్జ్వలతి నాంగేషు
హాతః పంచేషుపావకః.

క. కులశీల వివేకంబులు
దొలగక నరులందు నిల్చు ♦ దుర్భర మదన
జ్వలనము సర్వాంగంబులు
నెలకొను నందాఁక నంత ♦ నిలువం గలవే? 76

తా. మనుష్యదేహంబున నెంతవఱకు దుర్భరమగు మన్మథాగ్ని ప్రవేశింపదో యంతకాలము జ్ఞానము, వంశంబు, శీలంబు మొదలగునవి నిలుచును. ప్రవేశించెనా యవి నిలువవు.

శ్లో. శాస్త్రజ్ఞోపి ప్రగణితవయో ప్యా త్తబోధోపి బాఢం
సంసారేస్మి న్భవతి విరలో భాజనం సద్గతీనాం
యే నై తస్మి న్నిరయనగరద్వార ముద్ఘాటయంతీ
వామాక్షీణాం భవతి కుటిలా భ్రూలతా కుంచికేవ. 77

తే. గీ. శాస్త్రవిదుడైన బుధుఁడైన ♦ సదయుఁడైన
సద్గతికి బోవుటరిది సం ♦ సార సరణి
యమపురద్వారముల కవా ♦ టములఁ గుంచి
కలును బలె విప్పుచున్నవి ♦ కలికిబొమలు. 77

తా. షట్శాస్త్రపారంగతుఁడైనను, విద్వాంసుఁడైనను సర్వశాస్త్ర విశారదుఁడైనను సంసారసాగరమందుండి సద్గతికిఁబోజాలఁడు ఏలనన ఈసంసారమార్గమున యమపురపు ద్వారకవాటములవలె స్త్రీ కనుబొమలు తెరచియుండును.

శ్లో. కృశః కాణః ఖంజ శ్శ్రవణ రహితః పుచ్ఛవికలో
ర్వ్రణీ పూయక్లిన్నః క్రిమికుల శతైరావృతతనుః
క్షుధా క్షామోజీర్ణః పిఠరక కపాలార్పితగళః
శునీ మన్వేతి శ్వా హతమపి చ హంత్యేవ మదనః 78

చ. కరము కృశించి కాల్ విఱిగి ♦ కన్నులుగానక పుచ్ఛహీనమై
పురుగులు గ్రమ్ముచున్న వ్రణ ♦ పుంజము మేన లమంగ నాఁకటం
బరవశమై ఘటీముఖ క ♦ పాల గళంబగుకుక్క వెంటితో
నరిగెడుఁ గూళజంతువుల ♦ నైన వధించు మనోజు డక్కటా. 78

తా. మిక్కిలి చిక్కి, యొక కాలు విరిగిపోయి గ్రుడ్డిదై, తోకలేనిదై దేహమంతయు పుచ్చిపురుగులతోనిండి, ఆకలిబాధకోర్వలేక యుండినకుక్క గూడ యాడుకుక్కను జూచెనా! దానివెంటఁ బరుగెత్తును ఔరా! మన్మధుడు దుష్టజంతువులం గూడ బాధపెట్టుచున్నాడు.

శ్లో. స్త్రీముద్రాం ఝషకేతనస్య పరమాం సర్వార్థ సమ్పత్కరీం
యేమూఢాః ప్రవిహాయ యాంతికుధియో మిథ్యాఫలాన్వేషిణః
తేతేనైవనిహత్య నిర్దయతరం నగ్నీకృతా ముండితాః
కేచిత్పంచశిఖీకృతాశ్చ జటిలాః కాపాలికాశ్చాపరే. 79

చ. స్మరునకు సర్వలోకజయ ♦ సంపద లీయఁగజాలు ప్రౌఢలం
దరుణుల నిందసేయుట న ♦ ధర్మలు కొందఱు మానవుల్ దిగం
బరులును బ్రహ్మచారులుఁ గ ♦ పాలకపాణులు దండహస్తులై
తిరుగుచు నున్నవారు రతి ♦ దేవుని మీఱిన భోగమబ్బునే. 79

తా. సమస్తలోకములలోను మన్మధునకు జయముగూర్పగల స్త్రీలనుదూషించుటచేఁ గొందరధర్ములు దిగంబరులుగను కొందరు బ్రహ్మచారులుగను, భిక్షులుగను మరికొందరు సన్యాసులుగను తిరుగుచున్నారు. మన్మధుని దూషించిన వారికి భోగమబ్బదుకదా!

శ్లో. విశ్వామిత్ర పరాశర ప్రభృతయో వాతాంబుపర్ణాశనా
స్తేపి స్త్రీ ముఖపంకజం సులలితం దృష్ట్వైవ మోహంగతాః

శాల్యన్నం సఘృతం పయోదధియుతం భుంజంతి యేమానవా
స్తేషా మింద్రియ నిగ్రహో యదిభవే ద్వింధ్యఃప్ల వేత్సాగరే 80

చ. వన దళ వాతముల్ మెసవు ♦ వారు పరాశర కౌశికాదు లా
ఘనులును సుందరీ జనులఁ ♦ గన్గొని మోహితచిత్తులైరి హెం
చ్చిన ఘృతపాయసాన్నము భు ♦ జించెడి వాగలకున్ మనోజయం
బు నెగడునేని వింధ్యము స ♦ ముద్ర జలంబులఁ దేలియాడదే. 80

తా. పరాశర కౌశికాది మహామునులు శరీర రక్షణకై నీటిని ఆకులను గాలిని గూడ నుపయోగించెడివారు అట్టివారు సుందరాంగులఁ జూచి మోహితులైరిగదా ? నెయ్యిపాలతోఁ గూడిన అన్నమును భుజించు మనుజులే యింద్రియ నిగ్రహము గలిగియున్నచో వింధ్యపర్వతము సముద్రములోఁబడి యొక నావవలె తేలియాడ వలసియే యున్నది.

## ఋతు వర్ణన పద్ధతి

శ్లో. పరిమళభృతో వాతా శ్శాఖా నవాంకురకోటయో
మధుర విరుతో త్కంఠాభాజః ప్రియాః పికపక్షిణామ్
విరళవిరళస్వేదోద్గారా వధూవదనేందవః
ప్రసరతి మధౌ ధాత్ర్యాం జాతో న కస్యగుణోదయః. 81

చ. వలపు వహించె గంధగిరి ♦ వాతపరంపర భూరిభూజశా
ఖలు చిగిరించె నింపెసఁగె ♦ గాకలి కోకిలలంచుఁ జెక్కులం
బలుచని ఘర్మబిందువులు ♦ భామలకుం బ్రసరించె నెయ్యెడం
జెలువు ఘటింపఁ జాలదు వి ♦ శేషవసంత సమాగమంబిలన్. 81

తా. గంధగిరియందలి వాయువులు పరిమళములై యున్నవి. భూరితరు శాఖలు చిగిర్చి సొంపుగ కనుపట్టుచున్నవి. కోకిల లతిమధుర గానములు శ్రవణానందముగ నెల్లెడ వినవచ్చుచుండెను. వనితా జనుల చెక్కిళ్ళయందుఁ జెమటబిందువులు పుట్టుటచేత మఱింత యుపభోగ్యముగా నున్నవి. ఇట్టి వసంతఋతువు ప్రతివ్యక్తి కానందదాయకమై యుండునుగదా ?

శ్లో. మధు రయం మధురై రపి కోకిలా
కలకలై ర్మలయస్యచ వాయుభిః

విరహిణః ప్రహిణంతి శరీరిణో
విపది హన్త సుధాపి విషాయతే. 82

తే. గీ. నిండుకొని వచ్చుగంధంపుఁ ♦ గొండచల్ల
గాలియును బికకాకలి ♦ కారవంబు
విరహిజనుల వధించె స ♦ వ్యోమఁ గాన
నమృతమును విషమగు విప ♦ త్ప్రాప్తియందు. 82

తా. ఆ వసంత ఋతువునందు వియోగిని వియోగవంతులకు మలయమారుతము లనుభవించియు, కోకిలరావముల వినియు బాధఁ జెందుదురు. కష్టకాలమునం దమృతముఁగూడ విషముగ నే దోచును.

శ్లో. ఆవాసః కిలికించితస్య దయితాః పార్శ్వే విలాసాలసాః
కర్ణే కోకిలకామినీకలరవ స్స్మేరో లతామండపః
గోష్ఠీ సత్కవిభి స్సమం కతిపయై ర్ముగ్ధా స్సితాంశోః కరాః
కేషాంచిత్సుఖయంతి చాత్రహృదయం చైత్రేవిచిత్రాస్స్రజః. 83

చ. ఘనకిలికించిత ప్రచుర ♦ కాంతలు చెంత బికాంగనా కల
స్వనములు వీనులందు సుమ ♦ శాలి నికుంజము పుష్పమాల్యముల్
వినుత కవిప్రసంగమును ♦ వెన్నెల తేటలు భాగ్యవంతులౌ
జనులకుఁ జైత్రమాసమున ♦ సౌఖ్యమొనర్చు సుగంధితోయముల్.

తా. ఈ ఋతురాజము వసంతకాలమందు మన్మథుని ధిక్కరించుచు చంచల నేత్రములతో యోరగా చూచుచు శృంగారపుఁ జేష్ట లుపచరించుచు కెలు వొందుచుండెడి తీగబోండ్లును, శ్రవణానందముగ గానముజేయు నాడు కోయిలలును, పత్రంబులు కనుపించకుండఁ బూచిన పూపొదరింఢ్లును, సరసవచన దక్షులగు కవిపుంగవులతోడి ముచ్చటలును, సొంపారు రే రాజు వెన్నెలలును, సౌభాగ్యసంపన్నులగు కొందరకి మాత్రమే గల్గి వారిని సుఖింపఁజేయును.

శ్లో. పాంథస్త్రీ విరహానలాహుతికలా మాతన్వతే మంజరీ
మాకందేషు పికాంగనాభి రధునా సోత్కంఠ మాలోక్యతే
అప్యామీ నవపాటలా పరిమళ ప్రాగ్భార పాటచ్చరా
వాంతిక్లాంతి వితానతానవకృత శ్రీఖండశైలానిలాః. 84

ఉ. వరలు వియోగినీ విరహ ♦ వహ్నికి నాహుతిలీలఁ బొల్చుభా
సుర సహకార మంజరులఁ ♦ జూచి మదించెఁ బికంబు లత్తఱిన్

సురత పరిశ్రమాతిశయ ♦ సూదనముల్ విహరించె శాటలీ
పరిమళ భారచోరములు♦బంధుర చందన శైలవాతముల్. 84

తా. వసంతకాలమునఁ దియ్యమామిడి చెట్లయందుఁ బూగుత్తి కనుపించుచున్నది. హనిస్సు అగ్నిజ్వాలయట్లె యాపూలగుత్తియు పరదేశమందుండు పురుషులనెడబాసి గాసిపడు జవరాండ్రమన్మథాగ్ని నత్యధికముగాఁ జేయుచున్నది. కోవెలలు మిక్కిలి యాతురతతో దానిని మెసవుటకైఁ జూచుచున్నవి. తత్కాలమందు సంభోగ శ్రమ పోవునట్లు పాటలీ పుష్పపరిమళంబుల నెత్తికొనివచ్చి మలయమారుతము శ్రమఁదీర్చుచుండెను.

శ్లో. ప్రథితః ప్రణయవతీనాం
తావ త్పద మాతనోతు హృది మానః
భవతి న యావచ్చందన
తరుసురభీ ర్మలయపవమానః 85

తే. గీ. అంగజుని గంధ సింధురం ♦ బనఁగ బరఁగు
మలయజ సుగంధి మలయాద్రి ♦ మారుతంబు
మలయ దెందాఁక నందాక ♦ మానవతుల
మానసంబుల నెలకొని ♦ మానముమరు. 86

తా. మన్మథునియొక్క మదగజ మనందగు మంచిగంధపువాసనతో నొప్పు మలయాద్రి యందలి గాలి యెంతవరకుండునో యంతపర్యంతము వనితా మానసంబులందు మానము నిల్చియుండును.

శ్లో. సహకార కుసుమ కేసర
నికర భరామోద మూర్ఛిత దిగంతే
మధుర మధువిధుర మధుపే
మధౌ భవే త్కస్య నోత్కంఠా. 86

తే. గీ. సరస సహకార కుసుమ కే ♦ సర సమూహ
గురుతరామోద మయదిగం ♦ తరము మధుర
మధు విధుర మధుపము మధు ♦ మాస సమయ
మెవ్వనికి వేడ్క వాటింప ♦ దిగ్గజమున. 86

తా. వసంతకాలమందు దియ్యమామిడిపూవులుపూచి వాటివాసనలు నలుగడల వ్యాపించుచున్నది. గండుతుమ్మెదలు పూదేనియ నాని పాటలు పాడుచున్నవి. ఇట్టి కమ్మని వాసనలచేతను తుమ్మెదపాటలచేతను మరులు కొలుపు వసంతము రాగా మగువకేళి యెందుకు దిచ్చపుట్టదు ?

శ్లో. అచ్ఛాచ్ఛచందనరసార్ద్రతరా మృగాక్ష్యో
ధారాగృహాణి కుసుమానిచ కౌముదీచ
మందో మరుత్సుమనస శ్శుచి హార్మ్యపృష్ఠం
గ్రీష్మే మదంచ మదనంచ వివర్ధయంతి. 87

చ. అతిసిత చందనార్ద్రరుచి ♦ రాంగులు భామినులున్ సుగంధ సం
గతమగు మందమారుతము ♦ కౌముదియున్ జలయంత్ర గేహము
న్నత శుచిసౌధభాగము ఘ ♦ నంబగు వాసనఁ బూనుబుష్పసం
తతియు మదంబు దర్పకుని ♦ దర్పము బెంపుగఁ జేయు వేసవిన్. 87

తా. వేసవిని అచ్చంపు గంధము మేన నలందుకొనుటచేఁ జల్లనగుదేహములు గలిగినజవరాండ్రును, మల్లెపూవులును, వెన్నెలయును జాజిపూవులవాసనతో గూడిన మారుతమును, చంద్రకాంతశిల లమర్పబడిన మేడలును జనులకు తాపము పెంపుజేసి రతిపతి వికారము వృద్ధిజేయును.

శ్లో. స్రజో హృద్యామోదా వ్యజనపవన శ్చంద్రకిరణాః
పరాగః కాసారో మలయజరసశ్శీధు విశదమ్
సుచి స్సౌధోత్సంగః ప్రతనువసనం పంకజదృశో
నిదాఘూరా వేత ద్విలసతి లభంతే సుకృతినః. 88

ఉ. కమ్మనిదండలున్ సురఁటి ♦ గాడ్పులు వెన్నెలయుం బరాగపుం
జమ్మును మంచిగంధమును ♦ సన్నపు వల్వలు శీధుపానముం
దమ్మికొలంకు మేడయును ♦ దామరసాక్షు రనంగనొప్పు భో
గమ్ములు పుణ్యవంతులకుఁ ♦ గాని లభింప వటండ్రు వేసవిన్. 88

తా. గుమగుమ వాసనవేయు దండను, చలతాళపత్రములనుండి హాయిగ వీచుగాలులును, గమ్మనగుపుప్పొడియు, మంచిగంధము, సన్ననిబట్టలును, తామర తటాకము, చలువరాతితోఁగూడినహర్మ్యము, కందర్పునిధిక్కరించు స్త్రీలును వేసవి పుణ్యాత్ములకే లభించును.

శ్లో. సదాశుభ్రం ధామ స్ఫురదమలరశ్మి శ్శశిధరః
ప్రియా వక్త్రాంభోజం మలయజ రసశ్చాతి సురభిః
స్రజో హృద్యామోదా స్త దివముఖిలం రాగిణిజనే
కరోత్యంతః క్షోభం న తు విషయసంసర్గవిముఖే.

తే. గీ. కలువ చెలియును బూపుదం ♦ డలును మంచి
గందమును గేళి సౌధంబుఁ ♦ గలికిమోము
గాముకునకు వికారంబు ♦ గలుగఁ జేయుఁ
గలఁక వాటింప వెపుడు ని ♦ ష్కాముకునకు 89

తా. సుందరాంగిమోము, పుష్పమాలలును, మంచిగంధము, కేళీసౌధవనము కామవంతునకే వికారము గల్గించునుగాని విషయవిరక్తు నేమియుఁ జేయఁజాలవు.

శ్లో. తరుణీ వైషా దీపిత కామా
వికసిత జాజీ పుష్పసుగంధిః
ఉన్నత పీన పయోధర భారా
ప్రావృట్ తనుతే కస్య న హర్షమ్.

క. కామోద్దీపకయు సము
ద్దామ పయోధర విరాజి ♦ తయు జాజిసుమ
స్తోమ సుగంధియునై స
ర్వామోద మొనర్చెఁ బ్రావృ ♦ డంగన బళిరే. 90

తా. ఈవర్షకాలము కామమురెట్టింపఁ జేయుచు మేఘసముదాయముచే బ్రకాశింపుచు జాజిపూల సువాసనతోఁ గూడినదై యందఱకు సంతోషదాయకమై యున్నది. నిజముగ వర్షకాలము తరుణింబోలి యున్నది.

శ్లో. వియ దుపచితమేఘం భూమయః కందళిన్యో
నవకుటకదంబామోదినో గంధవాహాః
శిఖికులకల కేకారావరమ్యా వనాంతాః
సుఖిన మసుఖినం వా సర్వ ముత్కంఠయంతి.

చ. జలధర మాలికా ఖచిత ♦ చారు నభంబు నవాంకుర ప్రభా
లలిత మహీతలంబును గ ♦ లస్వన కేకికులోల్లసద్వన

స్థలకుటజాంకురనీపపుట ♦ జనిస్ఫుటగంధిల గంధవాహముల్
నెలకొని యెల్లవారలకు ♦ నిండు ముదంబు ఘటించె నత్తరిన్. 91

తా. మేఘపంక్తులచేఁ గప్పబడిన యాకాశంబును, క్రొత్తమొలకల కాంతిచే నొప్పుభూమియు, నెమిళ్ళ గుంపుల కోలాహలంబుతోఁగూడిననడవి పట్టులును, కొండమల్లియల వాసనతోఁగూడిన సురభితంబులును, నా సమయంబున సర్వజన సంతోషదాయకములై యుండును.

శ్లో. ఉపరిఘనం ఘనపటలం
తిర్యగ్గిరి యోపి నర్తితమయూరాః
క్షితిరపి కందళధవళా
దృష్టింపథికః క్వ పాతయతి.

తే. గీ. మీఁదనుబ్బులమోసులు ♦ మిసిమిచూపఁ
బుడమియును గందళమ్ములఁ ♦ బొదలనాఁడు
నెమ్మిగమితోడ దెసల శై ♦ లమ్ములుండ
విరహిజనుఁ డెందు దనదృష్టి ♦ విరియఁజేయు. 92

తా. ఆకసమంతయు కాఱుమేఘములచే నలముకొనియున్నది. మేఘపంక్తి జూచి నెమిళ్ళాడెడు కొండలు నలువైపుల నున్నవి. క్రొమ్మొలకలచే నిండి భూమి యున్నది. ఎటుజూచినను గామోద్దీపకములై యుంటచే ప్రియురాలిని బాసినబాటసారి యెటుఁ జూడజాలక యున్నాఁడు.

శ్లో. ఇతో విద్యుద్వల్లీ విలసితమితః కేతకితరోః
స్ఫురద్గంధః ప్రోద్యజ్జలద నినద స్ఫూర్జితమితః
ఇతః కేకిక్రీడా కలకలరవః పక్ష్మలదృశాం
కథం యాస్యంత్యేతే విరహదివసా స్సంభృతరసాః

ఉ. ఇక్కడఁ గ్రొమ్మెఱుంగు దివె ♦ లిక్కడఁ గేతకి గంధవైభవం
బిక్కడ భూరిగర్జితము ♦ లిక్కడ మత్తమయూరనిస్వనం
బిక్కట యీరసోజ్జ్వలము ♦ లైనదినంబులు మన్మథార్తి పెం
పెక్క వియోగినీ జనుల ♦ కెట్లు చనంగల వెన్నిచూడఁగన్. 93

తా. తళతళమనెడి విద్యుత్కాంతులు, కేతకీకుసుమవాసనలు, మేఘగర్జనములు మయూరధ్వనులు నవి యన్నియు శృంగారరసంబు పొంగఁ జేయునవి; పురుషులనెడ బాసియున్న యువతులు మరుసామ్రాజ్యంబను నిట్టిదినము లెట్లుగడుపుదురో తెలియదు.

శ్లో. అనూచీసంచారే తమసి నభసి ప్రౌఢజలద
ధ్వనిప్రాజ్ఞం మన్యే పతతి పృషతానాంచ నిచయే
ఇదం సౌదామిన్యాః కనకకమనీయం విలసితం
ముదంచ గ్లానించ ప్రథయతి పథిస్వైరసుదృశాం.

చ. ఘనతిమిరంబు నూది కవ ♦ కాశ మొసంగమి మీఁద వారిద
స్వనముల మిన్ను పిక్కటిల ♦ వాఁకణంబులు రాలుచుండఁగాఁ
గనకపు రేఖలందెగడు ♦ కాఁపుమెఱుంగులు జారకామినీ
జనములకున్ ముదంబును శి ♦ పాదమునుం బ్రకటించె ద్రోవలన్. 94

తా. కారుచీకటులు కనుదప్పముగా నలంకుకొనగాను, భీకరమైన యుఱుము లచే మిన్నులమ్రోగుచుండగాను, వానకణములు రాలుచుండగాను, బంగారు రేఖల నరసించు తటిల్లతికలును, యభిసారికలకు గాబోవు తమ్ము వెలిపుచ్చుటచే యనుమానము గలిగించుచున్నవి.

శ్లో. ఆసారేణ న హార్మ్యతః ప్రియతమైర్యాతుం బహిశ్శక్యతే
శీతోత్కంప నిమిత్త మాయతదృశా గాఢం సమాలింగ్యతే
జాతా శ్శీకరశీతలాశ్చ మరుతో రత్యంతఖేదచ్ఛిదో
ధన్యానాం బతదుర్దినం సుదినతాం యాతి ప్రియాసంగమే. 95

ఉ. కేరుచు మేడనుండి వెలి ♦ కింజన శక్యముగాక యుండె నా
సారముచేత శీతమున ♦ జవ్వని కౌఁగిలిఁగ్రాగ్రె శీకరో
దార సమీరణంబు సుర ♦ తశ్రమవారణమయ్యె దుర్దినం
బారయ కయ్యెడన్ సుదిన ♦ మయ్యెగృతార్థుల కంగనారతిన్. 95

తా. వర్షదినమున జనులను బయటికిఁ బోనీయకుండ వడగండ్లు కురిసి చలి పుట్టించి వడకుఁ నట్లు జేయుచున్నది వర్షదిన మందరకు. బాధాకరమైనను ప్రియురాలి సంగసుభాగ్యమువలన పుణ్యాత్ములకది సంతోషదినమైయున్నది ఎట్లన వడగండ్లుచలికి వారిని బయటికిఁబోనీయక తమయింగుని భార్యలతో సుఖముగా నుండు నట్లు జేయును. దుర్దినమైనను బుణ్యాత్ములకు ప్రియవనితా సౌఖ్యమబ్బించి సుదినమై యొప్పుచున్నది.

శ్లో. అర్థం సుప్త్వా నిశాయా స్సరభససురతాయాసఖిన్నశ్లథాంగః
ప్రోద్భూతాసహ్యతృష్ణో మధుమదనిరతో హర్మ్యపృష్ఠేవివిక్తే

సమ్భోగక్లాంతకాంతా శిథిలభుజలతావర్జితం కర్కరీతో
జ్యోత్స్నాభిన్నాచ్ఛధారం పిబతి న సలిలం శారదం మందపుణ్యః.

చ. ప్రియముగ రేసగంబు నిను ♦ రించి నితాంతరతాంతవిహ్వలుం
డయి దగఁజెంది యాసవము ♦ దాలసుఁడై రతిభిన్నకామినీ
శయమునఁ గర్కరీ గళిత ♦ చంద్రవిభాచ్ఛశరజ్జలంబు లా
రయ గృతపుణ్యుఁ డింపెసగఁ ♦ ద్రాగు రమ్యస్థితసౌధసీమలన్. 96

తా. రమ్యహర్మ్యభాగంబుల నడిరేయివరకు నిదురించి సురవడిరతిచే నాయాస మొంది దాహముగలిగి మకరందాదులఁ ద్రావుటచే మత్తిల్లి మొదలు తెలియక పునః రతి యందలసియున్న ప్రియురాలి పక్కయందు నచ్చఁపు వెలివెన్నెలతోఁ గూడిన తెల్లగ పడినభారను పుణ్యాత్ముండే త్రాగును.

శ్లో. హేమంతే దధిదుగ్ధసర్పిరశనా మాంజిష్ఠవాసోభృతః
కాశ్మీరద్రవసాంద్రదిగ్ధవపుషః ఖిన్నా విచిత్రై రతైః
వృత్తోరుస్తనకామినీ జనకృతాశ్లేషాగృహాభ్యంతరే
తాంబూలీ దళపూగపూరితముఖా ధన్యా స్సుఖం శేరతే. 97

చ. ఘృత దధిదుగ్ధభోజన మొ ♦ గిన్ భుజించి సురంగవస్త్రముల్
హితముగఁ దాల్చి కుంకుమము ♦ హెచ్చుగ మేననలంది ధన్యు ల
ద్భుత రతిఖిన్నులై చిడెము ♦ పుక్కిటనుంచి పృథు స్తనాంగనా
కృతపరరంభులై కడుర ♦ మింతురు మేడలలలోనసీతునన్. 97

తా. హేమవంతమున నెయ్యి, పాలు, పెరుగుతోఁ గూడిన భోజన మొన రించి కుంకుమాది సుగంధద్రవ్యముల మేననలంది పుణ్యాత్ములగువారు నోటినిండ తాంబూలముంచుకొని గబ్బిగుబ్బలాండ్ర స్తనప్రదేశమునదిమి బిగించుచు కౌఁగిలిలోబడి రమ్యహర్మ్యంబులలో హాయిగ నుందురు.

శ్లో. ప్రోద్యత్ప్రౌఢప్రియంగుద్యుతి భృతివికసత్కుందమాద్యద్విరేఫే
కాలే ప్రాలేయయవాతప్రచరవిలసితోదారమందారదామ్ని
యేషాం నో కంఠలగ్నా క్షణమపి తుహినక్షోదదక్షా మృగాక్షీ
తేషా మాయామయామా యమసదనసమా యామినీ యాతి
యూనామ్. 98

స్రగ్ధర. ప్రోద్యత్ప్రౌఢప్రియంగు♦స్ఫుటరుచియుతమై♦ఫుల్లమల్లీమతల్లీ
సూద్యత్సారంగమైహై♦మగపవనచల♦న్మంజుమందారభూజా
తద్యోతంబైన హేమంతమున విరహాసం♦తప్తులౌ వారికెల్లన్
సద్యోమాయామురాత్రుల్♦చనువిషమయము♦స్థానసాదృశ్యమూర్తిన్

తా. దట్టముగాఁ బెరుగు ప్రేంకణంతి దళుకొత్తుచు, అప్పుడే వికసించిన మొల్లల తేనియగ్రోలి మత్తిలిచెలరేఁగెడి తుమ్మెదలచే నిమ్ముగనూపుచు, మంచుగాలి వలనవిడి పోయిన రేకులుగల మందారపుఁదండలు మెండుకొనుచు గబ్బిగుబ్బల వెచ్చదనమును మంచుతుంపరుల చలివలన మూసుకొనుచు, కల్యాకంటియొవరి కంఠసీమను కౌఁగలించు కొనఁబోని యువకుల కా రాత్రి విరహాభారముచే నిశుదయై యెట్టెటో గదలిపోవును.

శ్లో. చుంబంతో గండభిత్తి రలకవతిముఖే సీత్కృతాన్యాదధానాః
వక్షస్సూత్కంచుకేషు స్తనభరపులకోద్భేదమాపాదయంతః
ఊరూనాకంపయంతః పృథుజఘనతటా త్స్రంసయంతోంశుకాని
వ్యక్తం కాంతాజనానాంవిటచరితభృతశ్శైశిరావాంతివాతాః99

ఉ. చెక్కులు ముద్దుగొంచు ముఖ♦సీమను సీత్కృతులన్ ఘటించుచుం
జక్కని చన్గవం బులక ♦ జాలములన్ మొలపించుచుం గటిం
జెక్కిన చేలముం దొలఁగఁ♦ జేయుచు శైశిరమారుతంబు లిం
పెక్కఁగఁ గాంతలందు విట ♦ కృత్యముఁ బూనిచరించుని త్తఱిన్.

తా. శిశిరచలిగాలులు విటకానివోలె జవరాండ్ర చెక్కిళుల ముద్దుగొంచు ముఖంబున సీత్కృతులుఁ జేయుచు స్తనద్వయమునఁ బిగించిన రవికనువదులు జేయుచు దొడల నాడించుచు నానంద మొనగూర్చుచున్నది.

శ్లో. కేశా నాకులయన్ దృశో ముకుళయన్ వాసోబలా దాక్షిప
న్నాతన్వన్పులకోద్గమం ప్రకటయన్నంగేషు కమ్పం శనైః
వారం వార ముదారసీత్కృతకృతో దంతచ్ఛదాన్ పీడయన్
ప్రాయశ్శైశిరఏష సమ్ప్రతి మరుత్కాంతాసు కాంతాయతే.100

ఉ. వేనలి క్రొన్ననల్ చెదర ♦ విప్పుచు గన్నుల మూయఁజేయుచుం
బూనిన సీత్కృతుల్ నెఱపు♦మోవులనొక్కుచునీవులూడ్చుచున్

జాసుగ మేనులం బులకఁ ♦ జాలములన్ గలయించుచున్ బర
స్త్రీ నికరంబునందుఁ బతి ♦ రీతి జరించుచు నమీరుడ త్తఱిన్. 100

తా. శిశిరఋతువునందలి చలిగాలి స్త్రీల కుచములకగలంచుచు కన్నులమూయించుచు, పెదవుల నొప్పించుచు, మేనంతయు బులకరింపఁజేయుచు నితరవనితల యందు వారిపతులవలెఁ దా భర్తవలె సంచరించుచున్నది.

చ. ఉపనిషదర్థవేద్య చరి ♦ తోగ్రభవామయవైద్య వానరా
ధిపశశివహ్ని నేత్ర సము ♦ దీర్ణపవిత్రచరిత్ర సత్కృపా
స్నపిత సమస్తలోక కర ♦ సంగత దివ్యపినాక భీకర
ద్విపసురవైరిభంజన సు ♦ ధీజనరంజక నిర్గతాంజనా.

ఉత్సాహ. తారకాసురాదిజనక ♦ దక్షయాగభంజనా
తారకాచలేంద్రవాస ♦ దానకల్పభూరుహా
తారకాధినాయకావ ♦ తంసభవపయోధిసం
తారకాభిధానయాతు ♦ ధానవైరిసన్నుతా.

క. దండధర చండవిక్రమ
దండనపాండిత్యమండి ♦ త ప్రబలభుజా
దండ సుపర్వాలయకో
దండ యఖండ ప్రమోద ♦ తాండవలోలా.

గద్యము.

ఇది శ్రీమదుమామహేశ్వర కరుణాకటాక్ష వీక్షాపాత్రి యేనుఁగు
లక్ష్మణకవిరాజపౌత్ర తిమ్మనార్యపుత్ర విద్వజ్జనవిధేయ
లక్ష్మణకవి నామధేయ ప్రణీతంబయిన సుభాషిత
రత్నావళికావ్యంబునందుశృంగారశతకంబున
స్త్రీప్రశంసాది పంచప్రకరణంబులు గల
ద్వితీయాశ్వాసము.
సంపూర్ణము.

---

# అధికశ్లోకములు.



శ్లో. భవంతో వేదాంతప్రణిహితధియా మాప్తగురవో
విచిత్రాలాపానాం వయమపి కవీనా మనుచరాః
తథా ప్యేత ద్బ్రూమో నహి పరహితాత్పుణ్య మధికం
న చాస్మిన్ సంసారే కువలయదృశో రమ్య మపరమ్.

శా. చింతింపన్ నిగమాంతతత్త్వరులకుం ♦ జెన్నొంగురుల్ మీరు మే
మంతేవాసులమే కవీశ్వరులక ♦ ట్లయ్యుం దెగం బల్కఁగాఁ
బంతం బూనితి మాపరోపసుకృతిన్ ♦ బాగైన పుణ్యంబునుం
గాంతారత్నముమించునట్టి పనియుం ♦ గాదీ మహాసంసృతిన్

శ్లో. మత్తేభకుంభపరిణాహిని కుంకుమార్ద్రే
కాంతాపయోధరతటే రతిఖేదఖిన్నః
వక్షో నిధాయ భుజపంజరమధ్యవర్తీ
ధన్యః క్షపాం క్షపయతి క్షపలబ్ధనిద్రః

తే. గీ. కుంకుమార్ద్రంబు జితకుంభ ♦ కుంభమైన
కాంతకుచకుంభమున రతి ♦ శ్రాంతుఁడగుచు
లీల నెద గ్రుమ్మి బిగికౌఁగి ♦ లింతఁ జిక్కి
హాయిగా గూర్కుచును బుచ్చు ♦ రేయి సుకృతి.

శ్లో. సుధమయోపిక్షయరోగశాంత్యై
నాసాగ్రముక్తాఫలకచ్ఛలేన
అనంగసంజీవనదృష్టశక్తి
ర్ముఖామృతం తే పిబతీవచంద్రః.

తే. గీ. అమృతమయుఁ డయ్యుఁ జంద్రుఁ డ ♦ నంగజీవ
నౌషధం బయ్యు దనదుక్ష ♦ యంబు మాన్ప
నలవి గామి ముక్కెరముత్తి ♦ యంబువేర
నబల! యానెడినో నీము ♦ ఖామృతంబు.

శ్లో. ఏక త్వానుకలంతో లోకే
యద్వయో రేకచిత్తతా
అన్యచిత్తకృతే కామే
శవయోరివ సంగమః.

క. మానసము లిరువు రొక్కటి
గా నుంచియుఁ గూడుటయ ♦ కామఫలం బొం
డైన తెఱంగునఁ గూడినఁ
బీనుగులంగూడినట్లు ♦ బెరయుం గాదే.

శ్లో. ఏకో రాగిషు రాజతే ప్రియతమాదేహార్ధహారీ హరో
నీరాగేష్వపి యో విముక్తలలనాసంగో న యస్మాత్పరః
దుర్వారస్మరబాణపన్నగవిషజ్వాలావలీఢో జనః
శేషః కామవిడంబితో హి విషయాన్ భోక్తుం న మోక్తుం క్షమః.

శా. రామం గూడియు సాముమే నొసగియున్ ♦ రాజిల్లె దా రాజులన్
రామాసంగవిదూరుఁడై పరముఁడై ♦ రాజిల్లె నీరాగులం
గామారాతి యొకండ యక్కరణిభో ♦ గంబూనఁగా మానఁగా
గామక్రూరశరాహిదష్టుఁ డగునే ♦ కష్టుండు దా నేర్చునే.

శ్లో. అజితాత్మసు సంబంధః
సమాధికృతచాపలః
భుజంగకుటిలస్తబ్ధో
భ్రూవిక్షేపః ఖలాయతే.

క. అజితాత్మసమాగతమును
భుజంగకుటిలంబు స్తబ్ధ ♦ భూతంబు సమా
ధిజనితచాపలము నై
కుజనుంబలె నొప్పు బొమల ♦ కులుకుం ద్రిప్పుల్.

# భర్తృహరిసుభాషితము

## వైరాగ్యశతకము

## తృతీయాశ్వాసము

క. శ్రీరమణ ధృతమృదంగ గం
భీర ధిమింధిమి నినాద భేద క్రమ యో
గ్యారంభ గుంభనటన
శ్రీరంజిత సుఖ నివేశ ♦ శ్రీ సోమేశా.

## 1 తృష్ణాదూషణము

శ్లో. చూడోత్తంసితచారుచంద్రకలికాచంచచ్ఛిఖాభాస్వరో
లీలాదగ్ధవిలోలకామశలభ శ్శ్రేయోదశాగ్రేస్ఫురన్
అంతస్స్ఫూర్జదపారమోహతిమిరప్రాగ్భారముచ్చాటయన్
చేతస్సద్మని యోగినాం విజయతే జ్ఞానప్రదీపో హరః

చ. కలిత వతంసితేందుకలి ♦ కాశిఖచే విలసిల్లి చిత్తభూ
శలభము నుగ్గుసేసి శుభ ♦ సారదశాగ్రమునన్ వెలుంగుచున్
బలవదపారమోహభర ♦ బాధతమోహరణంబుసేయుచుం
దెలివి వెలుంగు పొల్చుశివ ♦ దేవుఁడు యోగిమనోగృహంబులన్.

తా. శివుఁడు జ్ఞానమయదీపము శిరోభూషణముగా నొనర్చుకొనిన చంద్రకళ యనెడి నగ్నిచే మన్మథుండను శలభమును బూదిచేసి మంగళమనెడి వత్తిమొనను వెలుగుచు లోనున్న నజ్ఞానమును బోగొట్టుచు జ్ఞానమును వెలుఁగునిచ్చు శంభుఁడు మునీశ్వరుల మనంబు లందుండును.

శ్లో. భ్రాంతం దేశ మనేకదుర్గవిషమం ప్రాప్తం న కించిత్ఫలం
త్యక్త్వా జాతికులాభిమాన ముచితం సేవా కృతా నిష్ఫలా

భుక్తం మానవివర్జితం పరగృహేష్వాశంకయా కాకవ
తృష్ణే జృంభసి పాపకర్మనిరతే నాద్యాపి సంతుష్యసి.

చ. విసిగితి దుర్గదుర్విషయ ♦ విభ్రమయుక్తిఁ గులాభిమానముం
బసచెడ సేవఁజేసితి వి ♦ పన్నుఁడనై పరగేహసీమ వా
యసమువలెన్ భుజించితిఁ బ్ర ♦ యత్నము నిష్ఫలమైనశించె సం
తసపడ వుగ్రకర్మపిశు ♦ నత్వముఁ జూపెద వాశ యేటికిన్. 2

తా. పోవుట కశక్యమైన కొండలు, విషయసంకట ప్రదేశముల గడచితివి గాని ప్రయోజనము లేకపోయినది. మేలైన వంశమయినను భాగ్యవంతుల గొలిచి యేలాభము పొందలేదు. పరులయిండ్లయందుఁ గాకివలెతిరిగిభుజించితిని నిష్ప్రయోజనమైన పనులకేయింకెడ్డి ఓ దురాశా నీకింత చెడుబుద్ధియేమి?

శ్లో. ఉత్ఖాతం నిధిశంకయా క్షితితలం ధ్మాతా గిరేర్ధాతవో
నిస్తీర్ణస్సరితాంపతిర్నృపతయో యత్నేన సంతోషితాః
మంత్రారాధన తత్పరేణ మనసా నీతా శ్మశానే నిశాః
ప్రాప్తః కాణవరాటకోపి నమయా తృష్ణే సకామా భవ.

చ. నిధియనుశంక భూతలము ♦ నిచ్చలుఁ ద్రవ్వితి నావచే మహో
దధి ధరియించితిన్ శిఖరి ♦ ధాతువు లూఁదితి రాజు గొల్చితిన్ 3
వ్యథగొని ఘోరమంత్రజప ♦ మర్థి నొనర్చితి గవ్వయైన నే
విధమున బొందనైతిఁ గద ♦ వేముదమందఁగ దే దురాశరో! 3

తా. భూమియందు పాతులున్నవని పెల్లగించితిని, బంగారము దొరకునని కొండధాతువులనెల్ల మూసలోఁ బెట్టి యగ్నియందుంచి యూదితిని. ధనసంపాదనకై సముద్రములదాటి ద్వీపాంతరమున కేగితిని. రాజానుసారముగ మెలఁగితిని. ఐశ్వర్యవంతుఁడ నగుదునని దేవతారాధనమైన మంత్రాదుల జపించుచు ప్రేతభూమి యందుండితిని. కాని గడ్డిపోచయైనను లభింపలేదు దురాశాయింకనైనను సంతోషింపుమా!

శ్లో. ఖలోల్లాపా స్సోఢాః కథ మపి తదారాధనపరై
ర్నిగృహ్యాంతర్బాష్పం హసిత మపి శూన్యేన మనసా
కృతో విత్తస్తంభ ప్రతిహతధియా మంజలి రపి
త్వ మాశే మోఘాశే కి మపర మతో నర్తయసి మామ్. 4

చ. పలువలు పల్కుమాట లోక ♦ భంగి సహించితి బాష్పవారిలో
పల వెహరించి శూన్యమగు ♦ భావముననవ్ వెడనవ్వునవ్వితిం
బొలుపటి విత్తజాడ్యహృత ♦ బుద్ధుల కంజలిచేసితిం గటా
తలకకు యింక నేపనికి ♦ దార్చెదు నన్ను దురాశ నీవిటన్. 4

తా. దుష్టాత్ములు ములుకులవంటి పలుకులు నాడ నెటులనో సహించితిని వారి మాటలకు గన్నులనీరు గమ్మబోగా లోపలనే యడంచి వారు నన్ను మెచ్చుకొనుటకై వెడనవ్వు నవ్వితిని ద్రవ్యరోగముచే నన్నమర్యాద జేసిన వారికి జేయెత్తితిని. దురాశా నాచే నింక నెట్టిపనులు జేయింతువో కదా!

శ్లో. అమీషాం ప్రాణానాం తులితబిసినీపత్రపయసాం
కృతే కిం నాస్మాభిర్విగలితవివేకైర్వ్యవసితం
యదాఢ్యానామగ్రే ద్రవిణమదనిస్సంజ్ఞమనసాం
కృతం వీతవ్రీడైర్నిజగుణకథాపాతక మపి.

మ. నళినీపత్రగతాంబుచంచలము లె ♦ న్నం బ్రాణముల్ వీనికై
గళితప్రజ్ఞత మేము చేయనియన ♦ త్కార్యంబు లేదేమియున్
బలవద్విత్తమదాతిరేకజనితా ♦ పస్మారులైనట్టి లు
బ్ధుల ప్రోలన్ నిజసద్గుణస్తుతిమహా ♦ దోషంబుగావించుటన్. 5

తా. ధనగర్వాంధుల యొద్ద మాగుణములను లజ్జవిడిచి స్తుతించుకొంటిమి. తామరాకునందలి బిందువుతో సమమగు ప్రాణము గాపాడుకొనోరి మాకెలివితక్కువే మాచే ననేక యకృత్యములఁ జేయించినది. అందుచే మేము చేయని యకృత్య మీ జగంబున లేదు.

శ్లో. క్షాంతం న క్షమయా గృహోచిత సుఖం త్యక్తం న సంతోషతః
సోఢో దుస్సహశీతవాతతపనక్లేశో న తప్తం తపః
ధ్యాతం విత్త మహర్నిశం నియమితప్రాణైర్న శంభోః పదం
తత్తత్కర్మ కృతం యదేవ మునిభిస్తైస్తైః ఫలైర్వంచితాః.

మ. క్షమచేఁ గాదవమానమోర్చుట మహా ♦ సంతుష్టిచేఁ గాదు గే
హామునందైన సుఖంబు మానుట తపో ♦ వ్యాసక్తిచేఁ గాదు దు
ర్దమ శీతోష్ణజయంబు కాదు హరుపై ♦ ధ్యానంబు విత్తంబుపై
నమరెన్ మాకు మునీంద్రకృత్యములు లే ♦ వాసత్ఫలాభ్యున్నతుల్ 6

తా. నే మావమానంబుల నోర్చుట క్షమచేఁ గాదు మనఃపూర్వకముగా నింట్లో యందలి సుఖమును మానలేదు. శీతోష్ణాదుల జయించితిమిగాని తపముఁ జేయలేదు. ఇట్లు ధనమునకై పెనగులాడితిమే కాని శివచరణంబుల ధ్యానింపలేదు. మానికృత్యములు జేసినను ఫలాపేక్షాపరుల మవుటచే మునీంద్రఫలములఁ బొందలేక పోయితిమి.

శ్లో. భోగా నభుక్తా వయమే వ భుక్తా
స్తపో న తప్తం వయమేవ తప్తాః
కాలో నయాతో వయమేవయాతా
స్తృష్ణా నజీర్ణా వయమేవ జీర్ణాః

క. భోగానుభవంబు తపో
యోగము కాలంబు చనుట ♦ యును ఘనతృష్ణో
ద్యోగ విరామము లేదహ
హా గురుతవహించి తృష్ణ ♦ యలజడిఁ దెచ్చెన్. 7

తా. సుఖంబు లందలేదు. తపస్సు చేయలేదు మంచికాలము దాటిపోయినది అంత్యదశ నొందినాము కాని ఆశ నశించినదికాదు. నేము వృద్ధులమైనాము.

శ్లో. వలిభి ర్ముఖమాక్రాంతం పలితై రంకితం శిరః
గాత్రాణి శిథిలాయంతే, తృష్ణైకా తరుణాయతే.

క. కరచరణాద్యవయవముల
భర ముడిగెన్ వళులు మొగము ♦ నిండారెన్
శిర సెల్లఁ దెల్లఁ బాఱెను
దరి మాలిన తృష్ణయొకటె ♦ తరుణతఁ బూనెన్. 8

తా. అవయవములెల్ల ముడుతలుపడినవి శిరస్సంతయు బూడిదగుమ్మడి కాయవలె నెరసినది. శరీరపటుత్వము దప్పినది కాని దురాశ నశింపక నవయౌవనముగనే యున్నది.

శ్లో. నివృత్తాభోగేచ్ఛా పురుష బహుమానో విగళితః
సమానా స్స్వర్యాతా స్సపది సుహృదో జీవితసమాః
శనై ర్యష్ట్యుత్థానం ఘనతిమిరరుద్ధేచ నయనే
అహో ధృష్టః కాయ స్తదపి మరణాపాయచకితః. 9

శా. భోగాపేక్షదొలంగె బూజ్యత సెడెం ♦ బోరానిమిత్రుల్ సఖా
భాగుల్ సెల్లిరి దండమాత్రగొనుటల్ ♦ ప్రాప్తించెఁగన్నుల్ తమో
రోగచ్ఛన్నములయ్యె దేహము జరా ♦ రూఢంబు ప్రాణానిల
త్యాగాపాయభయంబునన్ వడఁకెడుం ♦ దా నెంతస్మమూఢ మో. 9

తా. భోగములందాశలేదు గౌరవము నశించినది స్నేహితులందరు జముని జూడఁబోయిరి వృద్ధత్వ మావహించినది. కఱ్ఱయాధారమయ్యెను. చత్వారముచే నేత్రము లగుపడుటలేదు. శరీరము మరణమునిన భయ మొందుచున్నది. ఆశ్చర్య మింక గలదు? ఇదంతయు దురాశా ప్రభావమే కదా ?

శ్లో. ఆశానామ నదీ మనోరథజలా తృష్ణాతరంగాకులా
రాగగ్రాహవతీ వితర్కవిహగా ధైర్యద్రుమధ్వంసినీ
మోహావర్తసుదుస్తరాతిగహనా ప్రోత్తుంగ చింతాతటీ
తస్యాః పారగతా విశుద్ధమనసో నందంతి యోగీశ్వరాః. 10

చ. కలితమనోరథంబు లుద ♦ కంబులు తృష్ణలు భూరివీచికా
వళు లనురాగముల్ మకర ♦ వర్ణము మోహవితర్కముల్ సుడుల్
పులుఁగులు గాఁగ ధైర్యఖల ♦ భూజముఁ గూల్చు దురాశ పేరి పు
ష్కలనదిదాటి నిత్యసుఖ ♦ సంపద గాంతురు యోగిపుంగవుల్. 10

తా. కోరికలనెడి నీరుగల్గి దురాశయనెడి తరంగములచే గొట్టుచు ప్రేమలను మొసళ్ళు కలిగి వితర్కమనెడి పక్షితోఁగూడి ధీరత్వమనే ఫలతరువుఁ బడగొట్టు దురాశయను మహానదిని దాటి యోగులు సదానందులగుదురు.

## 2 విషయపరిత్యాగ విడంబనము

శ్లో. న సంసారోత్పన్నం చరిత మనుపశ్యామి కుశలం
విపాకః పుణ్యానాం జనయతి భయం మే విమృశతః
మహద్భిః పుణ్యౌఘైశ్చిరపరిగృహీతా హి విషయాః
మహాంతో జాయంతే వ్యసన మివదాతుం విషయిణామ్. 11

చ. భవమునఁ బుట్టు సత్క్రియకు ♦ భంబని చూడము పుణ్యకర్మగౌ
రవ ఫలమైన సంపద క ♦ రంబు భయావహ మెన్ని చూచినం

బ్రబిమల పూర్వపుణ్యసము ♦ పార్జిత చందన ముఖ్యభోగ వై
భవమును భోగశీలురక ♦ పాయముఁ జేయును వృద్ధిఁబొందెడున్.

తా. సంసారసాగరమందు జనించిన క్రియలు మంచివని తలంపుము విచారణ చేసినచో పూర్వపుణ్యార్జిత ఫలమైన ఐశ్వర్యము చాలభయంకరమైన దగుసు స్వచ్ఛమైన పూర్వపుణ్యలేశంబున సార్జింపబడిన సుగంధాదులు మొదలగు సుఖ సంపద సౌఖ్యాపేక్ష కలిగించును.

శ్లో. అవశ్యం యాతార శ్చిరతర ముషిత్వాపి విషయాః
వియోగే కో భేద స్త్యజతి న జనో యత్స్వయ మమూన్
వ్రజంతః స్వాతంత్ర్యా దతులపరితాపాయ మనసః
స్వయం త్యక్తా హ్యేతే శమసుఖ మనంతం విదధతి. 12

చ. ఉరుగతితోడ నేగు దడ ♦ వుండియు భోగము లట్టివానిఁ దా
సరుఁడు పరిత్యజింపఁడు క ♦ నంగనఁ దద్విరహంబు భిన్నమే
పురుషుని భోగముల్ విడిచి♦ భూరిమనోవ్యథ లాచరించు నా
పురుషుఁడె భోగముల్ విడిచి♦పొందునిరామయశాంతిసౌఖ్యముల్.

తా. విషయభోగములు చిరకాలమునుండి తమంతతామే విడిచిపోవును. అట్లు విడిచిపోవుటచే సంతాపము కలుగుచున్నది. పురుషుడు విషయభోగములు, తనంత తాను విడిచెనేని వానిమానసవీధిని చరించెడి తృష్ణశాంతిపొంది దానిచే నిక్కిలి సుఖమునందును. కనుక విషయములు వానియంతట నే నడిచి చనుటకంటె పురుషుడా విషయసుఖములను వదులుట శ్రేయము !

శ్లో. బ్రహ్మజ్ఞానవివేకినో మలధియః కుర్వంత్యహో దుష్కరం
యన్ముంచ న్త్యుపభోగభాజ్యపి ధనా న్యేకాంతతో నిస్పృహాః
న ప్రాప్తాని పురా న సంప్రతి నచ ప్రాప్తౌ దృఢప్రత్యయా
వాంఛామాత్రపరిగ్రహాణ్యపి పరిత్యక్తుం న శక్తావయం. 13

చ. అనఘులు బోధపూర్ణులు మ ♦ హాత్ములు భోగనిదానమౌమహా
ధనముఁ బరిత్యజింతురు గ ♦ తస్పృహులై పరమాద్భుతంబుగా
మునుపును బొంద కిప్పుడును ♦ ముట్టక యింకను జెందలేక నె
మ్మనమునఁ దోచుభోగములఁ♦బూనఁగజాలము మే మొకింతయున్

తా. సర్వసుఖముల కాధారమగు ధనమును పరిత్యజించుట సత్కారము బ్రహ్మజ్ఞానముచే రంజిలువారు యట్టిసత్కారమగు ధనపరిత్యాగముం జేయుదురు. మా బోంట్లకు వెనుక ధనసంపద లేదు. ఇప్పుడు ధనసంపద అబ్బలేదు. ముందు కలుగునని నమ్మిక లేదు. అందుచే ననుభవింపబడక మనస్సున కోరంబడుచు మాత్రమే యుండుటచే కాసువ నశస్తులమై యున్నాము.

శ్లో. ధన్యానాంగిరికందరేషు వసతాంజ్యోతిః పరంధ్యాయతా
మానందాశ్రుజలం పిబంతిశకునా నిశ్శంక మంకేశయాః
అస్మాకంతు మనోరథోపరచిత ప్రాసాదవాపీతట
క్రీడాకానన కేళికౌతుకజుషా మాయుః పరిక్షీయతే. 14

చ. గిరిగుహలన్ వసించి వృష ♦ కేతన చింతన మాచరించు స
త్పురుషులసమ్మదాశ్రు కణ ♦ పుంజముఁ గ్రోలుచు నంకశయ్యలం
దిరవుగనుండు పక్షులు స ♦ మిద్ధమనః కృతసౌధ వాపికా
వరవన కేళిశీలురగు ♦ వారలకాయువె క్షీణితం బగున్. 14

తా. పర్వతగుహలందు నిశ్చలుండై పరబ్రహ్మను భవజనితమైన యానందము వలన వచ్చుబాష్పవారి నోడియుండు జంకులేక వ్రాలి పక్షులు త్రాగునంతటి నిశ్చలులై కాలముగడుపు వారల నాయువే సార్థకము మంచిమనస్సుచే మేడలు, చెరువులు, ఉద్యానవనములు మొదలగువానిని గల్పించుకొని కల్లక్రీడ లనుభవించెడి వారల యాయుర్దాయము నిరర్థకము.

శ్లో. భిక్షాశనం తదపి నీరస మేకవారం
శయ్యా చ భూః పరిజనో నిజదేహ మాత్రం
వస్త్రం సుజీర్ణశతకండమయీ చ కంథా
హాహా తథాపి విషయా న్న జహాతి చేతః 15

చ. నిరతముఁ దిండి బిచ్చమగు ♦ నీరస మద్దియు నొక్కపూఁటయే
ధరణితలంబు సెజ్జ సత ♦ తంబును దోడు శరీరమాత్రమే
చెఱఁగుల చేరతున్క గమి ♦ చేత నమర్చిన బొంత పుట్ట మీ
కరణి మెలంగినన్ విషయ ♦ కాంక్షలొకింతయుఁ బాయవక్కటా.

తా. సదా భిక్షాటనమే జీవనాధారము అదియు నొక్కపూటనే భిక్షతిండి యైన రుచిలేనిది భూమియే పాన్పయి యున్నది. శరీరము మాత్రమే తోడు చింకి బొంతయే బట్ట. ఇట్టితక్కువ దశయందున్నను విషయ వాంఛలు పోకయున్నవి. ఔరా? ఏమి వింత?

శ్లో. స్తనౌ మాంసగ్రంథీ కనకకలశావిత్యుపమితౌ
ముఖం శ్లేష్మాగారం తదపిచ శశాంకేన తులితమ్
స్రవ న్మూత్రక్లిన్నం కరివరశిర స్స్పర్ధిజఘనం
అహో నింద్యం రూపం కవిజనవిశేషైర్గురుకృతం. 16

చ. స్తనములు మాంసపిండములు ♦ చక్కని బంగరు కుండలంచు నా
ననము కఫాలయంబు తుహి ♦ నద్యుతితుల్యమటంచుమూత్ర భా
జనజఘనస్థలంబు కరి ♦ చారుశిరస్సను ముంచుఁ గామినీ
జనమలినాంగముల్ సుకవి♦చాతురి వర్ణనకెక్కె నిమ్మహిన్.

తా. స్తనద్వయము మాంసముద్దలైనను హేమ కుంభములనియు, ముఖము తెమడ చొల్లుతో కూడినదైనను చంద్రబింబ మనియు, మొల చెమటచేతడసి యసహ్యమైనదైనను నేనుఁగుకుంభముల కెనయగుచున్నదనియు నిట్లు యసహ్య భాజనములగు వానిని కడుంగడు గొప్పగా కొందరు కవులు కాముకుల రంజించుటకయి వర్ణించుదురు.

శ్లో. ఏకో రాగిషు రాజతే ప్రియతమా దేహార్ధహారీ హరో
నీరాగేషు జనోవిముక్త లలనా సంగో న యస్మాత్పరః
దుర్వార స్మరబాణపన్నగ విషవ్యావిద్ధముగ్ధో జనః
శేషః కామ విడంబితాన్న విషయాన్ భోక్తుం నమోక్తుం క్షమః

చ. కాముకులందు మే సగము ♦ గాంతకు నిచ్చిన శంకరుండె ని
ష్కాములలోనఁ బంచశర ♦ శాసను కన్నఁబరుండుఁ గల్గ దు
ద్దామ మనోజ బాణవిష ♦ దగ్ధులు తక్కిన మూఢు లోప రే
సీమల భామినీ సుఖముఁ ♦ జేరి భుజింపఁ బరిత్యజింపఁగన్. 17

తా. ఈశ్వరుఁడు ప్రియురాలనే తనసగ దేహముచేసి కొనుటవలన నతని కంటే కాముకులలో గొప్పవాఁడులేడు. నిష్కాములలో శివుండే పెద్ద తక్కిన కామాంధులెవ్వరు స్త్రీ సౌఖ్యము నొందుటకు, విడచుటకు, సమర్థులు కారుకదా?

శ్లో. అజానం దాహాత్మ్యం పతతు శలభో దీపదహనే
సమీనోప్యజ్ఞానా ద్బడిశయుత మశ్నాతు పిశితం
విజానంతో ప్యేతే వయ మిహ విపజ్జాల జటిలా
న్న ముంచామః కామా నహహ గహనో మోహమహిమా. 18

చ. తెలియక నాశహేతువగు ♦ తీవ్రతరానలకీలలోపలన్
శలభము చొచ్చుఁగాక మఱి ♦ చాలక మీనముగాలపుం గొనం
గలపిశితంబు తా మెసఁగు ♦ గాక యెఱింగియు మేము దుఃఖదో
హాల వనితా సుఖంబు విడ ♦ నాడము మోహమహత్త్వమెట్టిదో.

తా. అవివేకముచే శలభము దీపపు సెగయందుఁబడి మృతినొందుచున్నది. జ్ఞానహీనమైన గాలమునందు చిక్కుకొని మత్స్యము చెడుచున్నది. అది తెలియక చేయుటచే నిరపరాధులు, మేము తెలిసియు దుఃఖప్రదమగు స్త్రీ సౌఖ్యము విడువఁ జాలకున్నాము. అందువలన మేము సాపరాధులము అహో! మోహమహిమ తెలియ లేముగదా?

శ్లో. తృషా శుష్య త్యాస్యే పిబతి సలిలం శీతమధురం
క్షుధార్త శ్శాల్యన్నం కబళయతి మాంసాదికలితం
ప్రదీప్తే కామాగ్నౌ సుదృఢతర మాలింగతి వధూం
ప్రతీకారం వ్యాధేః సుఖ మితి విపర్యస్యతి జనః

ఉ. శీతలవారిఁ ద్రావు వడఁ ♦ జెందినవాఁడు క్షుధార్తుఁ డిష్టమృ
ష్టాతతభక్ష్యమాంసకలి ♦ తాన్నము సాపడు మన్మథాగ్ని తా
పాతురుఁ డైనవాఁడు జవ ♦ రాలి గవుంగిటిలోనఁ జేరు నీ
రీతిని రోగశాంతికర ♦ కృత్యము భోగమనంగఁ జెల్లునే. 19

తా. వడగొట్టినవాఁడు చల్లనీటిని ద్రావ దప్పిఁదీర్చుకొనును. ఆకలిగొనిన వాఁడు రుచికరములగు వంటకములతోడి భోజ్యమొనర్చును మన్మథాగ్ని కాహుతి యైనవాడు జవరాలిని కవుగలించుకొనును ఈవిధముగ రోగశాంతి యగు కార్య ములను సౌఖ్యమనఁ జెల్లునే?

శ్లో. తుంగం వేశ్మ సుతా స్సతా మభిమతా స్సంఖ్యాతిగా స్సంపదః
కల్యాణీదయితా వయశ్చ నవ మిత్యజ్ఞానమూఢో జనః

మత్వా నిత్యం మనశ్వరం నివిశతే సంసారకారాగృహే
సంద్పశ్య క్షణభంగురం తదఖిలం ధన్యస్తు సన్న్యస్యతి.

చ. పొడవులు మాడువుల్ ఘనులు ♦ పుత్రులు పెక్కులురమ్యసంపదల్
పడఁతుక చారుశీల యెల ♦ ప్రాయమటంచు నరుండుమూఢుడై
కడు జగమెల్ల శాశ్వతము ♦ గాఁ గొని సంసృతి బందిలోపలం
బడునిదిమాయయంచు నుతి ♦ మంతుడు దావిడుచున్ సమస్తమున్

తా. ఎత్తగు రమ్యహర్మ్యంబులు, సుగుణులగు పుత్రులు మహదైశ్వర్యము గుణవతియగు పెండ్లము జలయౌవ్వనము మఱియు ప్రపంచము నిత్యమని యజ్ఞానియగు మనుజుడు నమ్మిన సంసారసాగరమున దుముకుచున్నాడు. పుణ్యాత్ముడవియెల్ల నస్థిరమని గ్రహించి సన్యాసి యగుచున్నాడు.

## 3 యాచ్ఞాదైన్యదూషణము

శ్లో. దీనాదీనముఖై స్సదైవ శిశుకై రాకృష్ట జీర్ణాంబరా
క్రోశద్భిః క్షుధితైర్నిరన్నవిధురా దృశ్యేన చే ద్గేహినీ
యాచ్ఞాభంగ భయేన గద్గదగళత్రుట్యద్విలీనాక్షరం
కో దేహీతి వదే త్స్వదగ్ధజఠరస్యార్థే మనస్వీపుమాన్

ఉ. ఆఁకొని యేడ్చు లేఁజిఱుత ♦ లన్నముకై తనకొంగులాగఁ బె
ల్లాకట సోలుచుండెడు ని ♦ జాంగన దుర్దశఁజూడఁడేని యా
చ్ఞా కలనావిభంగ భయ ♦ సంభృత గద్గదశూన్యకంఠుఁడై
చేకొని దేహియంచడుగఁ ♦ జేరునె కాలినపొట్టకెవ్వఁడున్. 21

తా. ఆకలిబాధకోర్వలేక నేడ్చుచిన్నపిల్లలు తనచిరిగినపైట కొంగులాగు చుండగా నీచావస్థనొందెడిభార్యను చూడక పోయిన పాడుపొట్టకై యాచించి నచో యొసఁగలేని మాలనాడుగురోయని భీతిచే "దేహి"యని యెవఁడును నడుగ జాలఁడు.

శ్లో. అభిమతమహామానగ్రంధిప్రభేదపటీయసీ
గురుతరగుణగ్రామాంభోజస్ఫుటోజ్జ్వలచంద్రికా
విపులవిలసల్లజ్జావల్లీవితానకుఠారికా
జఠరపిఠరీ దుష్పూరేయం కరోతి విడంబనం?

శా. మానగ్రంధివిభేదనక్షమము సుం ♦ భద్దైర్యగాంభీర్యము
ఖ్యానేకప్రియసద్గుణాంబుజసమూ ♦ హజ్యోత్స్న లజ్జాలతా

హాసిస్ఫారకుఠారధారజఠరం ♦ బన్నట్టి పెన్నాన యా
రానింతారమదైన్యవృత్త్యభిమయః ♦ ప్రాగల్భ్యమున్ జూపునన్ 23

తా. కడు పనియొడికుండ వివరానట్టి మానమునుగూడఁ బోగొట్టుచున్నది గొప్ప గుణములనెల్ల వెన్నెల యందలి తామరలవలె సంకోచింపఁ జేయుచున్నది, గొడ్డలి తెగనఱకుచునట్లు లజ్జను బోగొట్టుచున్నది. ఎంతనింపించినను నిండదు గదా! మఱియు యాచనగూడ చేయించును.

శ్లో. పుణ్యే గ్రామే వనేవా మహతి సితపచ్ఛన్నపాలీం కపాలీ
మారాయన్యాయగర్భద్విజహుతహుతభుగ్ధూమధూమ్రోపకంఠే
ద్వారం ద్వారం ప్రవిష్టో వర ముదరదరీ పూరణాయ క్షుధార్తో
మానీ ప్రాజ్ఞై స్సనాథో పునరనుదినం తుల్యకుల్యేషు దీపః

చ. అవనిసురావళీహుతహు ♦ తాశనకోమలధూమధూమలా
ప్రవిశదవాటియందు వన ♦ భాగమునందు గపాలపాణియై
భవనములందు భిక్షుగొని ♦ ప్రాణముఁ దాల్చుట కొంతమేలు బాం
ధవులను జేరి వేఁడి కడు ♦ దైన్యముఁ జెందుటకంటె మానికిన్. 23

తా. స్వరసహితముగ ద్విజులు మంత్రోచ్చారణజేయుచు వేల్చునగ్నిహోత్రముల మండివచ్చు పొగలచే నావరింపబడిన పుణ్యగ్రామమందుగాని, కాననమందుఁ గాని క్షుద్బాధ తీర్చుకొనుటకై యిల్లిల్లుదిరిగి దిరిపె మెత్తుకొనుట గొంత మేలన వచ్చును. అంతియేగాని తనపాటి బంధువుల నడుమ యాచించు దీనవృత్తినుండుట శ్రేయముకాదు.

శ్లో. గంగా తరంగ కరశీకర శీతలాని
విద్యాధరా ధ్యుషిత చారుశిలాతలాని
స్థానాని కిం హిమవతః ప్రళయం గతాని
య త్సావమానపరపిండరతా మనుష్యాః

తే. గీ. పూతగంగోర్మిశీకర ♦ శీతలములు
లలితవిద్యాధరాధ్యుషి ♦ లాతలముల
హిమగిరిస్థానములు నశి ♦ యించెనో క్కొ
నరులు నిందితపరపిండ ♦ నిరతులగుట.

తా. ఇతరు లపమానపూర్వకముగాఁ బెట్టు భోజనము తినుటకంటె గంగాతరంగములవలన చల్లనివాయువులతోఁ గూడి విద్యాధరాదులు విహరించెడి మనోహరశిలా ప్రదేశములతోఁ గూడిన హిమవత్ప్రాంతములందు సుఖముగా వసించి కాలముఁ బుచ్చుట మనుష్యులకు మిక్కిలి శ్రేయస్కరము.

శ్లో. కిం కందాః కందరేభ్యః ప్రలయ ముపగతా నిర్ఝరా వాగిరిభ్యః
ప్రధ్వస్తా వా తరుభ్య స్సరసఫలభృతో వల్కలీనశ్చ శాఖాః
వీక్ష్యంతే యన్ముఖాని ప్రసభ ముపగత ప్రశ్రయాణాం ఖలానాం
దుఃఖోపాత్తాల్పవిత్త స్మయపవనవశా న్నర్తితభ్రూలతాని

మ. ఇల గంధంబులు మూలముల్ మడిసెనో ♦ యేళ్ళింకెనో కొండలన్
ఫలముల్ నారలు వృక్షశాఖలయెడం ♦ బాడయ్యెనో చూడ గే
వలదుఃఖాప్తమితార్థగర్వపవన ♦ వ్యావర్తితభ్రూలస
త్ఖలభూపాస్యము లర్థిఁజూచెదరు ♦ భ్రాంతిస్వాంతులై యాచకుల్

తా. ధనగర్వంబున మరియాదతప్పి బొమ్మలెగాదిగా త్రిప్పు దుష్టాత్ముల యాచించుటకు, కందమూలఫలములు నాశనమైనవా కొండలయందలి సెలయేరులన్నియు యెండినవా? రుచిగాదినుటకుఁ జెట్లయందలి తియ్యనిపండ్లు కట్టుటకు నారలు పాడయినవా? ఇవేవియు గలుగనప్పుడు వారిని యాచించు టెందులకు?

శ్లో. పుణ్యై ర్మూలఫలైః ప్రియే ప్రణయినీం వృత్తిం కురుష్వాధునా
భూశయ్యానవపల్లవై రకరుణై రుత్తిష్ఠ యామో వనమ్
క్షుద్రాణా మవివేకమూఢమనసాం యత్రేశ్వరాణాం సదా
విత్తవ్యాధివికారవిహ్వలగిరాం నామాపి న శ్రూయతే.

చ. ప్రవిమలకందమూలఫల ♦ పంక్తుల జీవికఁ జేయు ముర్విపై
నవనవపల్లవంబుల నొ ♦ నర్పుము పానుపు లెమ్ము పావనా
టవికిని బోవుమయ్యెడ దృ ♦ ఢద్రవిణామయదుర్వికారగౌ
రవవికలోక్తులై మెలఁగు ♦ రాజుల పేరును జెప్పఁ డెవ్వఁడున్. 26

తా. నీకు నీచులం గొలిచి బ్రతుకరాదను కోరికయున్నచో కందమూలఫలాదులఁ దిని భూమియే బాన్పుఁ జేసికొని క్రొత్త క్రొత్త చిగుళ్ళు ప్రక్కగ నమర్చుకొని నారబట్టలు దాల్చి యరణ్యమున సంచరింపుము అడవియందు ధనమదముచే తాఱుమాఱుగా మాటలాడు నీచప్రభువులతో సంబంధముండదు. అందుచే గాననమందు నీ స్వేచ్ఛకేమియు భంగముకాదు.

శ్లో. ఫలం స్వేచ్ఛాలభ్యం ప్రతివనమఖేదం క్షితిరుహాం
పయస్స్థానే స్థానే శిశిరమధురం పుణ్యసరితాం
మృదుస్పర్శా శయ్యా సులలితలతాపల్లవమయీ
సహంతే సంతాపం తదపి ధనినాం ద్వారి కృపణాః. 27

చ. కలవు పచేళిమంబులయి ♦ కానలలోపలఁ బండ్లు ప్రాకులం
గలవు పవిత్రవాహినులఁ ♦ గమ్మని శీతలవారిపూరముల్
గలవు చివుళ్ళపాన్పులవి ♦ గైకొనవేరక దీనులై ధనా
ఢ్యుల గనినిన్ వసించి నరులోలి ♦ సహింతురు తీవ్రతాపమున్.

తా. వనమునందలి తరుశాఖలన్నియు దియ్యనిపండ్లతోఁ గూడియున్నవి. గంగా నర్మదాది పవిత్రనదులందు సదా తియ్యనినీరు ప్రవహించుచున్నది. మృదువగు పల్లవశయ్యాతలంబు లున్నయవి. పైవానితోఁ దృప్తిజెందక దరిద్రులై గొప్పవారల పంచను నిలువంబడి పెక్కుబాధల నొందెదరేల ?

శ్లో. యే వర్ధంతే ధనపతిపురః ప్రార్థనా దుఃఖభాజో
యే చాల్పత్వం దధతివిషయాక్షేపపర్యస్తబుద్ధేః
తేషా మంతస్స్ఫురితహసితం వానరాణాం స్మరేయం
ధ్యానచ్ఛేదే శిఖరికుహరగ్రావశయ్యానిషణ్ణః 28

చ. ధనపతిమ్రోల నిల్చి కడు ♦ దైన్యముఁజూపెడు వారలెవ్వరో
ఘనవిషయాభిలాష మతి ♦ కల్పనమీరిన నీచులెవ్వరో
మొనయుచు వారిదుష్టదిన ♦ ముల్ మదినవ్వ తలంతు నాత్మచిం
తనము తుదిన్ గుహాంతరము ♦ నగ రుచిరోపల తల్పశాయినై.

తా. ఐశ్వర్యవంతులఁజేరి కడుదరిద్రులుగా నెవరు నటింతురో ఎవరింద్రియార్థములయొక్క కోరికలవలన మానసమునం దుపాయముగల నైచ్యముతో నుందురో, వారి దుర్దినములఁగూర్చి, విరక్తినొంది గిరిగుహలందుండెడి శిలశయ్యయందుండి సమాధి యనంతరము "ఎటులాదినముల గడపితిమో?"యని ఆశ్చర్యచకితుడనై లోలోన నవ్వుకొందురు.

శ్లో. యేసంతోష నిరంతరప్రముదితాస్తేషాం న భిన్నోముదో
యే త్వన్యే ధనలుబ్ధసంకులధియస్తేషాం నతృష్ణాహతా

ఇష్టం కస్యకృతే కృత స్స్వవిధినా తాదృక్పథంసమ్ప్రదాం
స్వాత్మన్యేవ సమాప్త హేమమహిమా మేరుర్న మే రోచతే. 29

మ. వరసంతోషనిరంతరప్రముదితుల్ వర్ణింప నెవ్వారు ని
ర్భరముల్ వారికి మోదముల్ కనకలు ♦ బ్ధస్వాంతు లౌవారికిన్
విరతింబొందదు తృష్ణ యెవ్వనికిఁ గా ♦ వింపంబడెన్ బ్రహ్మచే
స్థిరసంపన్నిధి మేరు వాత్మధృతల ♦ క్కిస్మకంబు నాకిష్టమే? 29

తా. నైవికముగా దొరికినవాటితోఁ దృప్తిజెందుఁ పురుషులకు నానందమేమియు జెడక పెరుగుచునేయుండును. ద్రవ్యమునకై పేరాసఁ జెందియుండు వానికి తృష్ణపోవకనేయుండును. నిత్యానందునకు మేరువువచ్చిపడినను నపేక్ష గలుగదు. పేరాస గలవానికి మేరువైనను జాలదు. అట్టి మేరువెవ్వని కుపయోగ పడకుండుటచే నాకును సమ్మతముగాదు.

శ్లో. భిక్షాహార మదైన్య మప్రతిముఖం భీతిచ్ఛిదం సర్వదా
దుర్మాత్సర్యమదాభిమానమథనం దుఃఖౌఘవిధ్వంసనం
సర్వత్రాన్వహ మప్రయత్నసులభం సాధుప్రియం పావనం
శంభో స్సత్రమ వార్యమక్షయనిధిం శంసంతి యోగీశ్వరాః. 30

మ. అభివర్ణింతురు యోగిపుంగవులు భి ♦ క్షాహారమున్ భూతదై
న్య భయక్రోధ మదాభిమాన జడిమా ♦ హంకారమున్ సత్సుఖ
ప్రభవం బశ్రమ లభ్యమూర్జిత మవా ♦ చ్యం బక్షయం బుగ్రదుః
ఖభిదాదక్షము శంభుసత్రము మహా ♦ కైవల్యసత్పాత్రమున్.

తా. భిక్షయే యాహారమయినది. దీనత్వము కలుగునది అడ్డములేనిది, సదా భయము పోఁగొట్టునది, అజ్ఞానగర్వముల బాధించునది. కష్టముల నివారించుచు ప్రతిదినము నిష్ప్రయత్నముగ దొరకునదియగు శివపూజ వారింపరాని నిక్షేపముగా యోగిపుంగవులు వక్కాణించెదరు.

## 4 భోగాస్థైర్యవర్ణనము

శ్లో. భోగే రోగభయం కులే చ్యుతిభయం విత్తే నృపాలాద్భయం
మానే దైన్యభయం బలే రిపుభయం రూపే జరాయాభయం

శాస్త్రే వాదభయం గుణే ఖలభయం కాయే కృతాన్తాద్భయం
సర్వం వస్తు భయాన్వితం భువి నృణాం వైరాగ్య మేవా భయం. 31

చ. బలగుణభోగ రూపకుల ♦ ధర్మకళేబర శాస్త్ర మానముల్
బలిఖల దుర్జరాచ్యుతి నృ ♦ పాలయమ ప్రతివాది దైన్య సం
కుల భయయుక్తముల్ నరుల ♦ కున్ భువి నెవ్వియు నిర్భయంబు లే
నెలకొని యెన్ని భంగులను ♦ నిర్భయ మొక్క విరాగమే సుమీ

తా. మనుజులశక్తి వైరులచేతను, సుగుణంబులు దుష్టులచేతను భోగములు రోగములచేతను, అందము ముసలితనముచేతను, కులము చెడిపోవుటవలనను, ధనము రాజులవలనను, జమునిచే దేహము, పాండిత్యము ప్రతివాదముచేతను, మనస్సు దీనత్వమువలనను నాశనమగును, నాశనము కానిది యొక్క విరక్తియే.

శ్లో. ఆక్రాంతం మరణేన జన్మ జరయా విద్యుచ్చలం యావనం
సంతోషో ధనలిప్సయా శమసుఖం ప్రౌఢాంగనావిభ్రమైః
లోకైర్మత్సరిభిర్గుణా వనభువో వ్యాళైర్నృపా దుర్జనై
రస్థైర్యేణ విభూతయోప్యుపహతా గ్రస్తం న కిం కేన వా. 32

చ. జననము చావుచేత శమ ♦ సౌఖ్యము కాంతలలీలచేత జ
వ్వనము జరారిచేత గుణ ♦ వర్గము కూళలచేత రాజు దు
ర్జనములచే ముదంబు ధన ♦ రాగముచే సిరులెల్ల లేమిచే
వినిహతిఁ జెందె దోషపరి ♦ విద్ధముగాదె తలంప నెద్దియున్.

తా. పుట్టుకను చావుస్వరూపముతో నాశనముఁ జేయుచున్నది. శాంతి సౌఖ్యము స్త్రీలీలచేఁ గలతనొందుచున్నది. యౌవనమును ముదిమిపాడుచేయు చున్నది. సుగుణములన్నియు దుర్జనులచే పాడుచేయబడుచున్నవి. రాజు దుర్మంత్రములఁ జెప్పువారల వలన పాడగుచున్నాఁడు. ద్రవ్యాశ సంతోషమును చెఱచు చున్నది. నిలుకడలేనివి సంపదలు, ఇట్లు ప్రతివిషయము దోషసహితమైనదేగదా?

శ్లో. ఆధివ్యాధిశతైర్జనస్య వివిధై రారోగ్య మున్మూల్యతే
లక్ష్మీర్యత్ర పతంతి తత్ర వివృతద్వారా ఇవ వ్యాపదః
జాతం జాత మవశ్య మాశు వివశం మృత్యుః కరో త్యాత్మసా
త్తత్కిం నామ నిరంకుశేన విధినా య న్నిర్మితం సుస్థిరం.

శా. ఆధివ్యాధిశతంబుచే జనులధై ♦ ర్యంబెల్ల నిర్మూలమై
బాధింపంబడు సంపద ల్గలుగునో ♦ ప్రత్యక్షమై ద్వారసం
రోధం బేమియులేక దుర్దశలు చే ♦ రుఁ మృత్యువున్ మర్త్యులఁ
వేధించున్ విధి యేది సుస్థిరముగా ♦ నిర్మించెఁదర్కించినన్. 33

తా. మనుష్యుల ధైర్య మనేకవిధములగు మనోవ్యాధులచేతను వ్యాధులచేతను, నశించుచున్నది. సంపదలున్న నిరాటంకముగా నాపదలు కలుగును. ఫుట్టిన ప్రాణికెల్ల చావు విధింపబడియే యున్నది. బ్రహ్మ నిర్మించిన దేదియు స్థిరము నిర్బాధాకరమైనది సృష్టింపఁబడి యుండలేదు.

శ్లో. భోగాస్తుంగతరంగ భంగతరళాః ప్రాణాః క్షణధ్వంసినః
స్తోకాన్యేవ దినాని యౌవనసుఖస్ఫూర్తిః ప్రియాసుస్థితా
తత్సంపాతః మసార మేవ నిఖిలం బుద్ధ్వా బుధా బోధకా
లోకానుగ్రహపేశలేన మనసా యత్నస్సమాధీయతాం. 34

ఉ. తుంగ తరంగ భంగముల తోఁ ♦ దులఁదూఁగు విలోలభోగముల్
భంగపడున్ నిమేషమునఁ ♦ బ్రాణము కొన్ని దినంబులే సుఖం
బంగనలందు నిట్లు మది ♦ నారసి బ్రహ్మ విచారయత్న ము
ప్పొంగుచుఁ జేయఁగావలయు ♦ భూరి జగద్ధిత బుద్ధి బండితుల్. 34

తా. భోగములు చంచలములై స్థిరమైనవిగావు. నిమిషమాత్రమైనదే గాని ప్రాణము నిలుకడలేనిది. వనితాసుఖము కొలదిదినములే గాని యావజ్జీవమంతయు నుండదు. కావున పండితులయినవారు సంసారమనిత్యమని యెఱిఁగి విరక్తినొంది యుండవలయును.

శ్లో. భోగా మేఘవితానమధ్యవిలసత్సౌదామినీచంచలా
ఆయుర్వాయువిఘటితాబ్జపటలీలీనాంబువద్భంగురమ్
లోలా యౌవనలాలనా తనుభృతా మిత్యాకలయ్య ద్రుతం
యోగీ ధైర్యసమాధిసిద్ధసులభే బుద్ధిం విదధ్వం బుధాః. 35

చ. జలదములోని క్రొమ్మెఱుఁగు ♦ జాయలు భోగపరంపరల్ మహా
నిలపరిఘట్టితాబ్జదళ ♦ నీరతుషారము జీవితంబు చం
చలతరముల్ వయోభిమత ♦ సౌఖ్యములీగతి నాలకించి స
భ్యులు పరమాత్మ యోగమున ♦ బుద్ధిఘటింపుడు సత్వరంబునన్

తా. భోగములు మేఘములలోని తళుక్కుని మెఱుగు రేఖలోని సమానములు, తామరాకునందలి నీటిబిందువుతో సాటియైనది. జీవితము యౌవన సౌఖ్యమతి చంచలమయినది. కావున బుద్ధిమంతులు సత్వరముగాఁ బరబ్రహ్మ పదార్థముఁ దెలిసికొనవలెను.

శ్లో. ఆయుః కల్లోలలోలం కతిపయదివసస్థాయినీ యౌవనశ్రీ
రర్థా స్సంకల్ప కల్పాఘనసమయతటిద్విభ్రమా భోగపూగాః
కంఠాశ్లేషోపగూఢం తపసి చ నచిరం యత్ప్రియాభిః ప్రణీతం
బ్రహ్మణ్యాస క్తచిత్తా భవత భవభయాంభోధి పారం తరీతుమ్.

ఉ. ఆయువు వీచి చంచలము ♦ యౌవన మల్పదినోచితంబు పు
ష్పాయుధ కేళిజన్యసుఖ ♦ మస్థిర మర్థము వాంఛవోలె సా
పాయము భోగముల్ మెఱపు ♦ లట్లభ్రమించు భవాబ్ధి లంఘనో
పాయము బ్రహ్మచింతనము ♦ బాయక చేయుడు సజ్జనోత్తముల్.

తా. తరంగములవలె జంచలమైనది. ఆయువు జవ్వన మల్పదిన పరిమాణము విషయసౌఖ్యము లస్థిరములు ద్రవ్యము వాంఛవలె నాపాయముగలది. సంసారసాగరము దాటుటకు బ్రహ్మచింతనమే నావయైయున్నది. కావున సదా సజ్జనులు బ్రహ్మధ్యానైకపరులు కండు.

శ్లో. కృచ్ఛ్రేణా మేధ్యమధ్యే నియమితతనుభిః స్థీయతే గర్భవాసే
కాంతావిశ్లేషదుఃఖవ్యతికరవిషమో యౌవనే చోపభోగః
వామాక్షీణా మవజ్ఞావిహసిత వసతి ర్వృద్ధభావోప్యసాధుః
సంసారే రే మనుష్యా వదత యది సుఖం స్వల్ప మప్యస్తికించిత్.

ఉ. కాయము కుంచిగర్భనర ♦ కంబున నుండుట దుఃఖమాదియం
దాయతలోచనావిరహ ♦ మబ్బుట దుఃఖము జవ్వనంబునం
బాయక భామినీ సహన ♦ పాత్రము దుఃఖము వృద్ధభావ మిం
కేమెడఁ గల్గు సౌఖ్యలవ ♦ మించుకయే జనులార చెప్పుడీ. 37

తా. పరిశ్రమ విచారకారణము సర్వావయవములు ముడుచుకొని గర్భనరకమందుండుట, పిదప యౌవనమున స్త్రీ వియోగము గలిగిన దుఃఖము మూడవది ముసలితనము సౌఖ్యముగ గడుపుదమన్న స్త్రీల పరిహాసముల పాలగుట, ఇట్టిసంసారమున వీసమయిన సౌఖ్యమున్నదని బుద్ధిమంతులు చెప్పుదురా?

శ్లో. వ్యాఘ్రీవ తిష్ఠతి జరా పరితర్జయంతీ
రోగాశ్చ శత్రవ ఇవ ప్రహరంతి దేహమ్
ఆయుః పరిస్రవతి భిన్నఘటా దివాంభో
లోకస్తథా ప్యహిత మాచర తీతిచిత్రం. 38

చ. కడు నెఱిసించుచున్ ముదిమి ♦ గడఁటిబెబ్బులిమాడ్కి నున్న దె
క్కుడువగ దాయలంబలెం దె ♦ గుళ్ళు శరీరము నొంచుచున్న వె
వ్వుడుం జనుభిన్నకుంభజల ♦ ముంబలె నాయువు లిట్టులయ్యు దా
రడఁగక మానవుల్ దురిత ♦ మోలినొనర్చుచు నున్నవారహో.

తా. వ్యాఘ్రమువలె ముదిమి వృద్ధత్వము సదా భయముగలిగించుచున్నది. శత్రువుల వలె రోగములు దేహమును పీడించుచున్నవి. భిన్నభాండమందలి జలమువలె వాయువు క్షణక్షణము క్షీణించుచున్నది. ఇట్లయ్యును జనులు పాపకృత్యములే చేయుచున్నారు.

శ్లో. భోగా భంగుర వృత్తయో బహువిధాస్తై రేవ చాయం భవ
స్తత్కస్యేహ కృతే పరిభ్రమత రేలోకాః కృతం చేష్టితైః
ఆశాపాశశతోపశాంతి విశదం చేత స్సమాధాయ తే
కామోచ్ఛిత్తివశే స్వధామని యది శ్రద్ధేయ మస్మద్వచః 39

చ. తరళతరంబులుగ్ బహువి ♦ ధంబులు భోగము లీభవంతసం
సరణము వానిచేఁ బొడమెఁ జాలుఁ ♦ బరిభ్రమణంబువానికై
నరులు మదీయభాషణము ♦ నమ్మెద రేని శమప్రసన్నమై
పరగు మనంబు శంభుపద ♦ పద్మయుగప్రవణంబు సేయుడీ.

తా. బహువిధములుగానున్న భోగములు స్థిరముకావు. అట్టి యస్థిరములచేఁ జేయఁబడిన యీ సంసారమనెడుచే నదియు స్థిరము కాదు. నిస్సారమగు నీసంసారమునఁ దిరుగుటకంటె నే చెప్పుమాట వినుఁడు. అదియేదన సదాశివధ్యానైక తత్పరులు కండు, అదియే మోక్షసాధనము.

శ్లో. బ్రహ్మేంద్రాదిమరుద్గణా స్తృణకణా న్యత్రస్థితో మన్యతే
యత్స్వాదా ద్విరసా భవంతి విభవా స్త్రైలోక్య రాజ్యాదయః
భోగం కోపి స ఏక ఏవపరమో నిత్యోదితో జృంభతే
భోసాధో క్షణభంగురే తదితరే భోగే రతిం మాకృథాః. 40

ఉ. ఎందు వసించి ధన్యుఁడు వి ♦ ధీంద్రముఖామరకోటి నల్ల నెం
చుం దృణమట్లు దేనిఁ జవి ♦ చూచుటచే రసహీనభావముం
జెందు జగత్ప్రభుత్వములు ♦ చెప్పగరాని యనంత కేవలా
నందము దాని యందు మది ♦ నాటుము మానుముసీచభోగముల్.

తా. ఎవండు పరబ్రహ్మపదార్థమును దెలిసికొనునో యతఁడు బ్రహ్మేంద్రాది దేవతలంగూడ దృణీకరించును బ్రహ్మజ్ఞానముచే సంతతానందము సంపన్నమై వెలయుచుండును. కేవల మజ్ఞానాంధకారమగు సంసారము విడచి పరబ్రహ్మ పదార్థముఁ దెలిసికొనఁ బ్రియత్నింపుము.

## 5 కాలమహిమానువర్ణనము

శ్లో. సా రమ్యా నగరీ మహాన్స నృపతిస్సామన్త చక్రంచ త
త్పార్శ్వే తస్య చ సా విదగ్ధపరిషత్తాశ్చంద్రబింబాననాః
ఉద్రిక్త స్సచ రాజపుత్రనివహా స్తేనందిన స్తాః కథాః
సర్వం యస్య వశా దగాత్ స్మృతిపథం కాలాయ తస్మై నమః. 41

మ. అది మేలైనపురంబు పూజ్యచరితుం ♦ డా రాజు రాజన్యమండలం
బది పార్శ్వంబున నావిదగ్ధసభ వా ♦ రజ్జాస్య లత్యుద్ధతం
బది రాకన్యక యుద్ది వందినికరం ♦ బా గాథలున్ సర్వమున్
గదలం జేసిన కాలమూర్తికి నమ ♦ స్కారంబు సత్కీర్తికిన్.

తా. అది రమ్యమగు పురరాజము. ఆపురమేలురాజు గొప్పవాఁడు. అతని చుట్టు సామంతరాజులు గొల్చుచున్నారు. పండితబృంద మారాజుతో సరసగోష్ఠి నెఱపుచున్నది. అతని స్తుతిపాఠకులాతనిని స్తుతించుచున్నారు. అతని ముచ్చటలు మొదలయినవియన్నియు నశించి కేవలము స్మరణమాత్రావశిష్టములై యున్నవి. ఇదంతయుఁ గాలమహిమయే. అట్టి కాలంబునకు నేను నమస్కారంబుఁ జేయుచున్నాను.

శ్లో. యత్రానేకే క్వచి దపి గృహే తత్ర తిష్ఠ త్యథైకో
యత్రాప్యేక స్తదను బహవ స్తత్ర నైకోపి చాంతే
ఇత్థం చేమౌ రజనిదివసౌ దోలయంద్వావివాక్షౌ
కాలః కళ్యా భువన ఫలకే క్రీడతి ప్రాణి శారైః. 42

శా. ఏయింటన్ వసియించుఁ బెక్కలోకఁ డా ♦ యింటం బ్రవర్తించునే
చాయన్ నిల్చునొకండు పెక్కలచటన్ ♦ సంధిల్లు నొండైన లే
దాయింటన్ మది నిట్లు రాత్రి దిన రూ ♦ పాక్షద్వయింజిమ్ముచుం
జేయుంగాలుఁడు క్రీడలోకఫలక ♦ శ్రేణిన్ నృశారంబులన్. 42

తా. సంసారమందు నొకయింటిలోఁ బెక్కండ్రుండిన నచట నొకఁడేయుండును. ఎచట నొకఁడు దర్వాతఁ బెక్కండ్రుందురుగలరో యచటచివరకు నొకఁడైన నుండఁడు. ఇదంతయుఁ జూడగా కాలమనుజూదరి భూమియనెడి నెత్తపుఁబలకయందు దివారాత్రములనెడి రెండుపాచికల ద్రోర్లించుచు కాళికతోడ ప్రాణులనెడి సారెలతో జూదమాడుచున్నట్లు తోఁచును.

శ్లో. ఆదిత్యస్య గతాగతై రహరహస్సంక్షీయతే జీవితం
వ్యాపారై ర్బహుకార్యభార గురుభిః కాలో న విజ్ఞాయతే
దృష్ట్వా జన్మజరావిపత్తి మరణం త్రాసశ్చ నోత్పద్యతే
పీత్వా మోహమయీం ప్రమాద మదిరా మున్మత్తభూతంజగత్.

చ. అనుదినమున్ నశించుఁ బర ♦ మాయువు సూర్యుని రాకపోకలన్
ఘనబహు కార్యభారములఁ ♦ గాలము పోవుటగానరాదు సం
జనన జరామయంబులును ♦ జావును జూచి భయంబులేదు దు
ర్జన భువనంబు మోహమది ♦ రారసవిహ్వలమయ్యె నయ్యయో!

తా. సూర్యోదయాస్తమయములచే నాయువు క్షీణించుచున్నది. జీవితము కొరకు పెద్దకార్యములలో మునిగియుండుటచేఁ గాలముపోవుచు నాయువు క్షీణించుట తెలియుటలేదు. పుట్టుట ముసలితనము కష్టములు. గిట్టుట మొదలగువానికి భయముఁజెందరు. కేవలము పరాకువలన పిచ్చివాని యిట్లెల్ల చేయుదురు.

శ్లో. రాత్రి స్సైవ పునస్సఏవ దివసో మత్వాబుధా జంతవో
ధావ త్యుద్యమిన స్తథైవ నిభృత ప్రారబ్ధ తత్తత్క్రియాః
వ్యాపారైః పునరుక్త భుక్త విషయై రేవం విధే నాముసా
సంసారేణ కదర్థితా వయమహో మోహాన్న లజ్జామహే. 44

ఉ. వచ్చిన రాత్రులే తిరిగి ♦ వచ్చుట పోయిన వాసరంబులే
వచ్చు టెఱింగి గూఢతర ♦ వర్తనులై పునరుక్త కార్యముల్

నిచ్చలు సేయుచున్ జనులు ♦ నిశ్చయవృత్తిఁ జరింతు రీభవా
భ్యుచ్చయ రీతిచేఁ జెడి కు ♦ బుద్ధులు సిగ్గువహింప రెంతయున్.

తా. రాత్రింబవళ్ళుగాని వాసరంబులుగాని వచ్చిపోయినవే మరలవచ్చు గాని యంతకంటె విశేషించిరావు. ఈ విషయ మెఱింగియు పూర్వమొనరించిన కార్యములనే మరలఁజేయుటకుఁ బరుగెత్తుచున్నారు. లజ్జాకరమైన సంసారము నిర్వేదకముకదా! సంసారమందలి లజ్జాకరమైన బ్రతుకున కెంతో సిగ్గుపడవలసిన వారమైనను అజ్ఞానాంధకారమున సిగ్గుపడకుండు టెంతయు వింతగానున్నది.

శ్లో. నధ్యాతం పదమీశ్వరస్య విధివత్సంసార విచ్ఛిత్తయే
స్వర్గద్వారకవాటపాటనపటు ర్ధర్మోపి నోపార్జితః
నారీపీనపయోధరోరుయుగళం స్వప్నేపి నాలింగితం
మాతుః కేవలమేవయౌవనవశేచ్ఛేదే కుఠారావయం. 45

ఉ. శ్రీరమణీయ శంభుపద ♦ చింత యొనర్చుట లేదు గోపుర
ద్వార కవాట పాటన సు ♦ ధర్మము జేయుట లేదు సుందరీ
హారి కుచోపలబ్ధిఁగల ♦ నైన నెఱుంగము మాతృయౌవనో
దార వనీకుఠారముల ♦ మైజనియించిన వార మిమ్మహిన్.

తా. సంసారము వదలునట్లు పరమేశ్వర ధ్యానముఁజేసి మోక్షమైన సంపాదింపలేను. స్వర్గము నిరాటంకముగఁ బోనిచ్చు ధర్మమైన గడింపలేను. స్త్రీల తోడి సౌఖ్యము కలలోనైనఁ బొందకపోవుటచే గానుపురుషార్థమునకు దూరుల మైతిమి. కనుక తల్లిప్రాయమును దూలించుటకై పుట్టితిమిగాని వేఱుప్రయోజనము కొఱకై పుట్టలేక పోయితిమి.

శ్లో. నాభ్యస్తా భువి వాదిబృందదమనీ విద్యావినీతోచితా
ఖడ్గాగ్రైః కరికుంభపీఠదళనై ర్నాకం న నీతం యశః
కాంతాకోమలపల్లవాధరరసః పీతో న చంద్రోదయే
తారుణ్యం గతమేవనిష్ఫల మహో శూన్యాలయే దీపవత్. 46

చ. వలనుగ విద్య నేర్చి ప్రతి ♦ వాదుల గెల్చుట లేదు కుంభిని
గ్గళననిశాతఖడ్గముల ♦ దైవతలోకమునందుఁ గీర్తులున్
నిలుపుట లేదు చారురమ ♦ ణీమధురోష్ఠముఁ గ్రోలలేదు ని
ష్ఫలమయి జవ్వనం బరిగె ♦ బాడుగృహంబున దీపముంబలెన్. 46

తా. సర్వవిధముల నుపయోగించువిద్య సంపాదించి ప్రతివాదులను గెలువ లేదు. వీరత్వముఁబొంది పగవారి యేనుఁగులకుంభములఁజీల్చి కీర్తినిలుపుటయు లేదు. శృంగారముప్పతిలు చంద్రోదయకాలమునఁ బ్రియురాలి చిగురాకుమోవి నానిన వారముగాము. ఇట్లు విద్యార్జనము లేక కీర్తిధనము లేక సుఖమునందక కటా! మా జవ్వనమంతయు వ్యర్థమైనది.

శ్లో. విద్యా నాధిగతా కళంకరహితా విత్తంచ నోపార్జితం
శుశ్రూషాపి సమాహితేన మనసా పిత్రోర్నసమ్పాదితా
ఆలోలాయతలోచనాః ప్రియతమాః స్వప్నేపి నాలింగితాః
కాలోయం పరపిండలోలుపతయా కాకైరివ ప్రేరితః 47

చ. వినయవిశేషహృద్యలగు ♦ విద్యలు నేర్చుటలేదు నీతిచే
ధనమును గూర్పలేదు తలి ♦ దండ్రుల సేవయుఁ జేయలేదు చ
క్కని చిగురాకు బోండ్ల బిగి ♦ కౌగిలియుంగలనైన లేదు గో
బ్బున సమయంబు కాకులకుఁ ♦ బోలె గతించెఁ బరాన్నభుక్తులన్ .

తా. కళంకరాహిత్యమగు విద్య నభ్యసింపలేదు. భోగ త్యాగ సాధనమగు ధనమునుగూడ బెట్టలేదు. తలిదండ్రుల కెచ్చరికతోఁ బనిచేయలేదు ప్రణయంపు చూపుల వనితల గౌఁగలింపలేదు. కాలమంతయు బరులపంచనుండి కాకవలె పొట్ట పోసికొను చుంటిమి. కాని మత్తే పురుషార్థమును గడింప నేరమైతిమి.

శ్లో. వయం యేభ్యో జాతా శ్చిరపరిగతా ఏవ ఖలుతే
సమం యైస్సంవృద్ధా స్స్మృతివిషయతాం తేపిగమితాః
ఇదానీ మేతే స్మః ప్రతిదివస మాసన్నపతనా
గతాస్తుల్యావస్థా సికతిలనదీతీరతరుభిః 48

ఉ. తాలిమిమాలి కన్నతలి ♦ దండ్రుల తోడ మెలంగు వారలం
గాలము గోలుపుచ్చనని ♦ కావరు ఘోరజరాభరార్తులై
తూలుచు నిత్యసన్నిహిత ♦ మద్దశులై సికతాలగన్నదీ
కూలమహామహీజముల ♦ కున్ సరివత్తురు మూఢమానవుల్ . 46

తా. మనలఁ గని పెంచినవారుపోయి చాలకాలమయినది. మన మిత్రులోఁ బెరిగితిమో వారు స్మరణమాత్రమే యున్నారు. ఇఁక మేము ఇసుకభూమైన యేటిగట్టున నానాటికి చావును సమీపించుచు నిందె యున్నారము.

శ్లో. ఆయుర్వర్షశతం నృణాంపరిమితం రాత్రౌతదర్ధంగతం
తస్యార్ధస్యపరస్య చార్ధమపరం బాలత్వ వృద్ధత్వయోః
శేషం వ్యాధి వియోగదుఃఖసహితం సేవాదిభిర్నీయతే
జీవే వారితరంగచంచలతరే సౌఖ్యంతనుః ప్రాణినామ్.

ఉ. ఆయువు నూఱువత్సరము ♦ లందు సగంబు నశించె నిద్రచే
నాయములో సగంబు గత ♦ మయ్యెను బాల్యజరాప్రసక్తిచేఁ
బాయక తక్కినట్టి సగఁ ♦ బాలు గతించుఁ బ్రయాసవృత్తిచే
నాయువు చంచలంబగుటఁ ♦ బ్రాణుల కెట్లు సుఖంబుచేకుఱున్.

తా. మనుష్యులకు ఆయుర్దాయము నూరువర్షములు, అందు నేబది సంవత్సరములు నిద్రాకాలమగు రాత్రికాలములఁ దీరినది. మిగత సగమునందు సగము ఇరువదియైదేండ్లు అజ్ఞానాసక్తులతోఁ గూడిన బాల్యవృద్ధత్వములనఁ గడచినది మిగిలిన యిరువదియైదేండ్లు సంసారమందలి కష్టములలోఁ దీఱినది. అతిచంచలమగు నాయువుకలిగిన సుఖమున కవకాశ మెక్కడిది?

శ్లో. క్షణం బాలో భూత్వా క్షణమపి యువా కామరసికః
క్షణం విత్తైర్హీనః క్షణమపిచ సంపూర్ణవిభవః
జరాజీర్ణై రంగై ర్నట ఇవ వలీమండితతను
ర్నర స్సంసారాంతే విశతి యమధానీయవనికాం.

ఉ. బాలకుఁడై క్షణంబు యువ ♦ భావయుతుండయి కొంతకాల
ము ద్వేలదరిద్రుఁడై క్షణము ♦ విత్తసమన్వితుఁడై క్షణంబు జీ
ర్ణాలస గాత్రుఁడై నటుని ♦ యట్ల నటించి తుదిన్ నరుండు యా
మ్యాలయ నామమైన తెర ♦ యందుఁ జొరంబడు సత్వరంబుగన్.

తా. మనుష్యుఁ డొకనటకునివలె, కొంతకాలము బాలుఁడుగాను, కొంత కాలము కామసుఖము లనుభవించు యువకుండుగాను, క్షణకాలము గొప్ప దరిద్రుండుగాను, మఱికొంతకాలము ఐశ్వర్యవంతుఁడుగాను, చూపట్టిముదిముచే నంగములు సడలి, ముడతలుగల్గిన దేహముతో నటుండాటతుదను తెరలోనికిఁ బోవునట్లు సంసారము చివర యమపుర ద్వారముసొచ్చి మఱుగుపడుచున్నాఁడు.

## ౬ యతినృపతి సంవాదవర్ణనము

శ్లో. త్వం రాజా వయమప్యుపాసితగురుప్రజ్ఞాభిమానోన్నతాః
ఖ్యాతస్త్వం విభవై ర్యశాంసి కవయో దిక్షు ప్రతన్వంతి నః
ఇత్థం మానధనాతిదూర ముభయో రప్యావయో రంతరం
యద్యస్మాసు పరాఙ్ముఖోపి వయమప్యేకాంతతో నిస్పృహాః 51

ఉ. రాజవునీవు మేము గురు ♦ రాట్కలితప్రతిభాభిగాన వి
భ్రాజ మహోన్నతాత్ములము ♦ భవ్యధనప్రథితుండ వీవు స
ద్రాజి నుతించు మాయశము ♦ దవ్వుగమిూ మనవాసి మమ్ము ని
ర్వ్యాజతఁ జూడవేనియను ♦ రాగము మాకును లేదు నీయెడన్.

తా. నీవు మహారాజువు మేము గురుముఖముగాఁ బడసిన ప్రజ్ఞావిభవమున పేరొందిన వారము నీవైశ్వర్యవంతుఁడవగుటచేఁ బ్రసిద్ధుడవు మాకీర్తి కవులచే వర్ణింపబడుచు దిశాంతముల చూరగొనుటచే మేముగూడ ప్రసిద్ధులమే. కనుక నీకును మాకును విశేష తారతమ్యములేదు. కాబట్టిమాయడల ననాదరముగా మెలగితచో నీయెడల మేమును ననాధారముగా వర్తించెదము. మేము విరక్తులము గాన నీయనాదరము మమ్ముల బాధింపదు సుమా!

శ్లో. అర్థానా మీశిషే త్వం వయమపిచగిరామీశ్మహే యావదర్థం
శూరస్త్వంవాదిదర్పవ్యుపశమనవిధా వక్షయం పాటవం నః
సేవంతే త్వాం ధనాఢ్యామతిమలహతయే మామపిశ్రోతుకామా
మయ్యప్యాస్థా నతేచే త్త్వయి మమ సుతరామేష రాజన్గతోస్మి.

చ. ధనపతి వీవు మేము విని ♦ ధశ్రుతిపుంజపదార్థతత్త్వశా
సనులము నీవు శూరుఁడవు ♦ చండతరప్రతివాదిగర్వభం
జనులముమేము నిన్ను ధన ♦ శాలురుమమ్ము భజింతురాశ్రితుల్
వినయము సేయవేని పృథి ♦ వీవర సాగెద మీక్షణంబునన్. 52

తా. రాజా! నీవు ధనములకు రాజువు. మేము సర్వశాస్త్రములకు రాజులము వైరులనీవడంచుటచే శూరుడవు మేము ప్రతివాదుల నడంచెడి శూరులము. ధనాశాపరులు నిన్ను సేవింతురు. శాస్త్రశ్రవణము గోరువారు మమ్ముఁగొలుతురు. కావున నీకు మాకు భేద మేమియులేదుమమ్మనాదరణముగాఁ జూచినచో వేఱొండుచోటునకుఁ బోయెదము.

శ్లో. వయ మిహ పరితుష్టా వల్కలై స్త్వం దుకూలై
స్సమఇవ పరితోషో నిర్విశేషో విశేషః
సతు భవతి దరిద్రో యస్య తృష్ణా విశాలా
మనసి చ పరితుష్టే కోర్థవాన్ కో దరిద్రః 53

చ. కలితదుకూలవస్త్రములు ♦ గట్టితనీవును జీర్ణవల్కలం
బులుధరియించువారమును బ్ర ♦ మోదమతుల్యము లేదు వాసి య
గ్గల మగుతృష్ణ యెవ్వనికి ♦ గాఢదరిద్రుఁడు వాఁడు లేమియుం
గలిమియు నేలసమ్మదవి ♦ కస్వరమానసులైనవారికిన్. 53

తా. నారచీరలు ధరించు మేము కాంచనపీతాంబరముల ధరించు నీవారు మన ముభయులము సమాన సంతోషుల మేగదా ? ద్రవ్యాశగలవానికి దారిద్రియము గాని మనస్సంతుష్టిగలవానికి ద్రవ్యమక్కరలేదు దారిద్రభావము లేదు.

శ్లో. ఫల మల మశనాయ స్వాదుపానాయ తోయం
క్షితి రపి శయనార్థం వాససే వల్కలంచ
నవధనమధుపాన భ్రాంతిస ర్వేంద్రియాణా
మవినయ మనుమన్తుం నోత్సహే దుర్జనానాం. 54

చ. ఫలములుచాలు జీవికకుఁ ♦ బానముసేయ జలంబుజాలు వ
ల్కలములుచాలు కట్టుటకు ♦ లాతలముల్ శయనింపఁజాలు ని
ష్ఫలనవవిత్తశీధురస ♦ పానవిజృంభిత మోహలీన చి
త్తులగు నికృష్టభూపతుల ♦ దుర్నయ మించుకయున్ సహింతునే.

తా. ప్రాణాధారమునకుఁ బండ్లుచాలును. దప్పితీర్చుకొనుటకు తియ్యని జలము చాలును, కట్టుకొనుటకు నారచీరెలు చాలును, నిద్రించుటకు భూమి చాలును. మదిరపానప్రమత్తులగు రాజుల నేసౌఖ్యమునకై యాశ్రయించవలయును

శ్లో. అశ్నీమహి వయంభిక్షా, మాశావాసో వసీమహి
శయీమహి మహీపృష్ఠే, కుర్వీమహికి మీశ్వరైః. 55

గీ. చేరి భిక్షాన్న మారగిం ♦ చెదము మేము
కట్టెదము దిక్కులనియెడి ♦ కలితశాటిఁ
బవ్వళించెద మిలయను ♦ పాన్పుమీఁద
నేమికార్యము మాకు న ♦ రేంద్రులందు. 55

తా. భిక్షాన్నము భుజించెదము నలిక్కూల వస్త్రముగాఁ గట్టుదుము అవని పాన్పునఁ బవళించెదము. ఇట్టిమాకు రాజులతోఁ బనియేమి ?

శ్లో. న నటా న విటా న గాయకా, న చ సభ్యేతరవాదచుంచవః
నృపమీక్షితు మత్ర కేవయం, స్తనభారానమితానయోషితః.

క. విట గాయక వైతండిక
నటజనులముగాము పృథుఘ ♦ న స్తన నమితో
త్కట వారకాంతలము గా
మటుగావున నృపునిజూడ ♦ నగునే మాకున్. 56

తా. మేము విటులము, వితండవాదులము, గాయకులము, నటకులము, మన్మథాగ్నినడంచు బలితంపు గబ్బిగుబ్బలు గలిగిన వారకాంతలము గాము, కావున మేము రాజుపాలికిఁ బోనక్కరలేదు.

శ్లో. విపులహృదయైర్ధన్యైః కైశ్చి జ్జగ జ్జనితం పురా
విధృత మపరైర్దత్తం చాన్యై ర్విజిత్య తృణంయథా
ఇహ హి భువనాన్యన్యే ధీరా శ్చతుర్దశ భుంజతే
కతిపయపురస్వామ్యే పుంసాం క ఏష మదజ్వరః. 57

ఉ. అంచితబుద్ధులైనమను ♦ జాధిపతుల్ జగమెల్లఁదొల్లి ని
ర్మించిరి దానిఁ గొందఱు భ ♦ రించిరి యిచ్చిరి కొంద ఱర్థికి
న్మించి జగంబులన్నియును ♦ నెమ్మిభుజించుచుఁ గొందఱుండఁగా
బంచకపట్టణేశుల ♦ పార మదజ్వరమింత యేటికిఁ. 57

తా. ప్రపంచమంతయు నుదారమనస్కులతోఁ సృష్టింపఁ జేయఁబడినది. అటు తర్వాతఁ గొందరిచేఁ బాలింపఁబడినది. అటుపిమ్మటఁ గొందఱిచే జయింపబడి తృణమట్లు నాశము చేయబడినది. ఇఁక నిప్పుడు గొందఱు ధీరులు సమస్తలోకముల పాలింపుచున్నారు. ఇదంతయు నిట్లుండ నేఁడు నాల్గైదు పత్తనంబులేలు వారలింత మదాంధులై కన్నుమిన్నుగానక చరించు టేలకో ?

శ్లో. అభుక్తాయాం యస్యాం క్షణమపి న యాతం నృపశతై
ర్భువ స్తస్యాలాభే క ఇవ బహుమానః క్షితిభృతామ్
తదంశస్యాప్యంశే తదవయవ లేశేపి పతయో
విషాదే కర్తవ్యే విదధతి జడాః ప్రత్యుత ముదం. 58

చ. ఎడ నిమిషంబులేక ధర ♦ నేశతంబు భుజించుచున్న యి
ప్పుడమి లభించినన్ మహిమ ♦ పొందునె రాజుల నేల తుచ్ఛులో
నడరు లవంబులోఁ దునియ ♦ యందొకమూలగ సాధులైన వా
రడలక వైపరీత్యమున ♦ హర్షముఁ జెందుదు రెంత మందులో 58

తా. భూమిని రాజులేలని క్షణములేదు ఏరాజో యొకరాజు భూమినిపాలించుచునే యున్నాడు. అట్టిరాజునకే యతిశయము లేనప్పుడు అట్టిభూమిలో సహస్రాంశములోని యొకమూలకుఁ బ్రభువైన తానేమి గొప్పవాఁడనని వగచుటకు మారుగా యుబ్బునొందెదరు ఆహా ఏమి వీరికింత యవివేకము ?

శ్లో. మృత్పిండో జలరేఖయా వలయిత స్సర్వోప్యయం న స్వణుః
స్వాంశీకృత్య సఏవ సంయుగశతై రాజ్ఞాం గణైర్భుజ్యతే
నో దద్యుర్దధతేధవా కిమపి తే క్షుద్రా దరిద్రా భృశం
ధిగ్ధిక్తాన్ పురుషాధమాన్ ధనకణం వాంఛంతి తేభ్యోపి యే. 59

చ. తగ జలరేఖచేవలయి ♦ తంబగు కొంచపు మట్టిముద్దకై
జగడము లాడి యాడి పెలు ♦ చన్ విభజించి భుజించు చున్నదు
ర్భర నృపులిచ్చువారె తలఁ ♦ పం గడునీచులు వారియందు నొ
ప్పుగ ధనలేశ కాంక్షగల ♦ పూరుషులుం గడు హీనులేకదా!

తా. భూమియంతయు జలరేఖచేఁ జుట్టుకొనఁబడి యున్నది. అట్టిభూమికై రాజుల తమలోఁదాము పోటలాడుకొని తమకై విభజించికొని యనుభవించుచున్నారు. వారామట్టిపెళ్ళకై పోరాడినవారు కనుక క్షుద్రులు ఆదియుపూర్ణముగా లేక కొంత భాగమునే పొందుటవలన దరిద్రులు కావున వారు ఇదివరకు పెట్టియుండలేదు. ఆప్పుడు పెట్టరు. ముందుఁ పెట్టబోరు అట్టివారిని యాచించినవారు వారికంటె నీచులు గాన నిందింపదగినవారు.

శ్లో. స జాతః కోప్యాసీ న్మదనరిపుణా మూర్ధ్ని ధవళం
కపాలం యస్యోచ్చై ర్వినిహిత మలంకారవిధయే
నృభిః ప్రాణత్రాణప్రణవమతిభిః కైశ్చి దధునా
నమద్భిః కః పుంసా మయ మతులదర్పజ్వరభరః

చ. అతఁడ సుజన్ముఁ డెవ్వని స ♦ మంచితశుభ్రకపాల మద్రిజా
పతి కుతుకంబుతోడఁ దల ♦ పై ధరియించె విభూషణంబుగా

క్షితిపయిఁ బ్రాణరక్షణము ♦ చేయుటకై తముఁజేరి కొంద ఱా
నతు లయిరంచు దుర్మదఘ ♦ నజ్వర మేటికి మానవాళికిన్. 10

తా. ఎవ్వాని ధవళంపుఛత్రచ్ఛాయ నీశ్వరుఁడానందముతోఁ ధరించెనో యాతఁడే సార్థకజన్ముఁడు. అట్టిస్థితియందు భూమియందుఁ బ్రాణరక్షణోపాయముగాఁ గొందరు తమ్ముజేరి వినమ్రులైనంతమాత్రాన దోషయుక్తమగు గర్వమనెడి పెద్దరోగ మెందులకుఁ బొందిరోగదా ?

## ౭ మనస్సంబోధన నియమనము

శ్లో. పరేషాం చేతాంసి ప్రతిదివస మారాధ్య బహుధా
ప్రసాదంకిం నేతుం విశసి హృదయ క్లేశకలిలం
ప్రసన్నే త్వ య్యంత్య స్స్వయ ముదితచింతామణిగుణే
విముక్తస్సంకల్పః కి మభిలషితం పుష్యతి నతే. 61

చ. పరులమనంబు లోలి బహు ♦ భంగులఁ గొల్చి ప్రసన్నతాగుణ
స్ఫురణ వహింపఁ జేయుటకుఁ ♦ బూనగ నేటికి నీవు చిత్తమా!
స్థిరముగ సుప్రసాదము భ ♦ జించి నిలింపమణీగణోదయ
స్ఫురితగతిః మనోరథము ♦ సొంపువహింపదె నీకు మేలుగన్. 61

తా. ఓ మనసా! ఇతరులంగొలిచి దాతలను ప్రసన్నులుగా జేసికొనుటకు యత్నించెదవే ? నీవే స్వచ్ఛమయిన చింతామణివంటి గుణము లలవరచు కొంటివేని కోరికలన్నియు పొందగలుగుదువు కావున నితరులనుగొలువకుము.

శ్లో. పరిభ్రమసి కిం వృథా క్వచన చిత్తవిభ్రామ్యతాం
స్వయం భవతి యద్యథా భవతి తత్తథా నాన్యథా
అతీతయ మనుస్మర న్నపి చ భావ్యసంకల్పయ
న్నతర్కితసమాగమా ననుభవాని భోగా నహం. 62

ఉ. ఏలపరిభ్రమించెద వ ♦ నేకవిధంబుల వెఱ్ఱిచిత్తమా
తాలిమి విశ్రమింపు మొక ♦ తావున యత్నములేకయే యగుః
మేలును గీడు నేఁ దలఁప ♦ మించినకార్యము భావికార్యమున్
లాలసవృత్తిఁ గోర విధి ♦ లబ్ధఫలంబులు నెభుజించెడన్. 62

తా. మనసా! నాకైయనేక విధములుగా నలుగడల భ్రమించెదవు. ఏది యెట్లు జరుగవలయునో యట్లు జరిగితీరును అన్యథా జరుగదు. కాన నీప్రయత్నముచే నాకేమియు కలుగదు. దైవికముగా వచ్చిన భోగములనే పొంది సుఖింతురు,

శ్లో. ఏతస్మాద్విరమేంద్రియార్థగహనా దాయాసకా దాశ్రయ
శ్రేయోమార్గ మశేషదుఃఖశమనవ్యాపారదక్షం క్షణాత్
శాంతం భావ ముపైహి సంత్యజ నిజాం కల్లోలలోలాం గతిం
మా భూయో భజ భంగురాం భవరతిం చేతః ప్రసీ దాధునా 63

శా. ఆయాసప్రద మింద్రియార్థగహనం ♦ బాత్రోవ వర్జింపుమీ
శ్రేయోమార్గము సర్వదుఃఖనికర ♦ చ్ఛేదార్థమై చేరుమీ
ధ్యేయాద్వైతముఁ బొందు మీ స్థిరతచే ♦ దీపింపుమీ చిత్తమా
మాయాకేళికి వెండియుం జొరకుమీ ♦ మాలిన్యమున్ వీడుమీ.

తా. ఓమనసా! సర్వానర్థములకాలవాలమైన యింద్రియముల నడంచి జ్ఞానమార్గమునఁ బ్రవర్తింపుము. గంభీరహృదయముతో నాత్మస్వరూపముఁ గనుచు, యతిచంచలమగు సివృత్తినివిడిచి నిత్యముకాని యీసంసారమును విడిచి యానందాంబుధిలో నోలలాడుము.

శ్లో. మోహం మార్జయ తా ముపార్జయ రతిం చంద్రార్థచూడామణౌ
చేత స్స్వర్గతరంగిణీతటభువా మాసంగ మంగీ కురు
కోవా వీచిషు బుద్బుదేషుచ తటిల్లేఖాసుచ స్త్రీషుచ
జ్వాలాగ్రేషుచ పన్నగేషుచ సరిద్వేగేషుచ ప్రత్యయః. 64

చ. దురితపుమోహముం దొలఁగఁ♦జేయుము సేయుము భక్తి శూలిపై
వరసురవాహినీతటసి ♦ వాసముఁ జేకొను మేటినమ్మికల్
తరగలయందు బుద్బుదవి ♦ తానములందు మెఱుంగుదీగలం
దరయఁగఁ గీలలందు ఫణు లందు సుహృజ్జనులందు డెందమా!

తా. ఓమనసా! నీకొకమాటఁ జెప్పెదవినుము. మోహవికారము తొలంగఁ జేయుము. సతతము శివధ్యానతత్పరుఁడవై గంగాతీర ప్రదేశమునందు వాసముఁ జేయుము వనితలుగాని, సంపదలుగాని, తరంగములవలెను, నీటిబుడగ వలెను, మెఱుపుదీగవలెను నిప్పుకొనవలెను, సర్పమువలెను, నదీవేగమువలెను, చంచలమయినవి. కావున వానినెంతమాత్రము నమ్మందగదు.

శ్లో. చేతశ్చింతయ మా రమాం సకృ దిమా మస్థాయినీ మాస్థయా
భూపాలభ్రుకుటీకుటీవిహరణవ్యాపారపణ్యాంగనాం

కంథాకంచుకితాః ప్రవిశ్య భవనద్వారాణి వారాణసీ
రథ్యాపంక్తిషు పాణిపాత్రపతితాం భిక్షామపేక్షామహే. 65

మ. అవనీశభ్రుకుటీకుటీవిహరణ ♦ వ్యాపారపణ్యాంగనన్
భువిలో సంపద నెంచుకొం గొనకుమీ ♦ భోగార్థమై చిత్తమా
శివమోచావహ కాశికానగరిని ♦ శ్రీరాజమార్గంబులన్
భవనద్వారకములందుం జేతనిడు స ♦ ద్భైక్షంబపేక్షించెదన్. 65

తా. మనసా! రాజానుగ్రహముచే గలుగుచు నిగ్రహముచే బోవును. వెల వెలందివలె చంచలమైన లక్ష్మి కాంక్షించి మమ్ములయింపకుము. మాకు చింకిబొంతం గప్పుకొని కాశీపురమున భిక్షమెత్తుకొని బ్రతుకవలయునని కోరిక యున్నది సుమా!

శ్లో. అగ్రే గీతం సరసకవయః పార్శ్వయో ర్దాక్షిణాత్యాః
పశ్చా ల్లీలావలయరణితం చామరగ్రాహిణీనాం
యద్యస్త్యేవం కురు భవరసాస్వాదనే లంపటత్వం
నో చే చ్చేతః ప్రవిశ సహసా నిర్వికల్పే సమాధౌ. 66

చ. సరసులు దాక్షిణాత్యకవి ♦ చంద్రులు చెంతలయందు ముందటన్
సురుచిరగీతమున్ వెనుక ♦ శోభిత చామర పాణిమానినీ
కరమణికంకణక్వణముం ♦ గల్గిన యేని భవానుభూతిచే
బరగుము గల్గవేని భవ ♦ భంజన యోగముం బూను మానసా. 66

తా. ఓ మనసా! సరసవచన రచనా ధురంధరులగు కవిపుంగవులును, వీణాదివాద్యముల వాయించు గాయకులును, వెనుకదెస వింజామరలవీచెడి చెలియల కంకణక్వణములు మొదలగునవి యుండినచో సంసారసుఖ మనుభవింపుము లేదా తక్షణమే నిర్వికారుండవై నిర్వికల్పసమాధిం జేకొని పరబ్రహ్మ పదార్థముం జూడుము.

శ్లో. ప్రాప్తా శ్శ్రియ స్సకలకామదుఘా స్తతః కిం
న్యస్తం పదం శిరసి విద్విషతాం తతః కిం
సంపాదితాః ప్రణయినో విభవై స్తతః కిం
కల్పస్థితం తనుభృతాం తనుభి స్తతః కిమ్. 67

చ. సకలశుభంబు లిచ్చుసిరియ ♦ సంపద వచ్చిననేమి దానిచేం
బ్రకట విరోధి మస్తకము ♦ పైంబదముంచిన నేమి దానిచే

నికట ధనంబుచే హితుల ♦ నేర్పుగ నేలిన నేమి దానిచే
వికృతము గాక ప్రాణికి భు ♦ విం దనువుండిన నేమి దానిచేన్. 67

తా. ఓ మనసా! మనుజులకుఁ గాంక్షల నొడగూర్చు సంపదలుండినను, వైరులు పాదాక్రాంతులైనను, స్నేహితులఁ జక్కఁగ బ్రోచినను, దేహము కల్పాంతమువరకుండినను నవియన్నియు నిత్యశ్రేయస్కరములుగావు. కనుక వైవాటితోఁ బనిలేదు.

శ్లో. భక్తిర్భవే మరణజన్మభయం హృదిస్థం
స్నేహో న బంధుషు న మన్మథజా వికారాః
సంసర్గదోషరహితా విజనా వనాంతా
వైరాగ్య మస్తి కిమితః పర మర్థనీయం. 68

చ. హరచరణాబ్జయుగ్మమున ♦ నంచితభక్తి మనంబులో జరా
మరణభయంబు బాంధవస ♦ మాజముపై స్పృహ లేమి దుస్సహ
స్మరశరనిగ్రహంబు ముని ♦ మాన్యవివిక్తవనప్రదేశముల్
పరమవిరక్తియుం గలుగ ♦ భాగ్యమహోన్నతి వేఱ యున్నదే?

తా. ఓ మనసా! శంభుభక్తియు, జరామరణములందు నిర్భయమును, భార్యాపుత్రాదులందు విరక్తియు, మన్మథోద్రేకము నొందకుండుటయు, నిర్జనములగు వనప్రదేశములు గోరవలయును. అందువలన వైరాగ్యము వచ్చును. వైరాగ్యముకంటె శ్రేయస్సాధనము మరియొకటిలేదుగదా?

శ్లో. తస్మా దనంత మజరం పరమం వికాసి
తద్బ్రహ్మ చింతయ కి మేభి రసద్వికల్పైః
యస్యానుషంగిణ ఇమే భువనాధిపత్య
భోగాదయః కృపణ లోకమతా భవంతి. 69

తే. గీ. కావున ననంత మజర మ ♦ క్షర మజంబు
బ్రహ్మము భజింపు మతివిక ♦ ల్పములు వలదు
బ్రహ్మసంగికి భువనాధి ♦ పత్యభోగ
పదవియును నీకు దుచ్ఛమై ♦ పరఁగుఁ జువ్వె. 69

తా. కావున ఓ మనసా! యనంతమైనదియు సర్వోత్కృష్టమైనదియు సకల ప్రదేశముల నావరించియుండు బ్రహ్మమును జింతింపుము. అనవసర చింతలేల? ఆ బ్రహ్మమునకుఁ బరతంత్రుండైనవానికి సమస్తలోకాధిపత్యము తదితరము లన్నియు యోగ్యమైనవిగాఁ దోచును. గాని తనకు దగినట్లుదోపదు.

శ్లో. పాతాలమావిశసి యాసినభో విలంఘ్య
దిఙ్మండలం భ్రమసి మానస మానసచాపలేన
భ్రాంత్యాపి జాతు విమలం కథ యాత్మనీనం
తద్బ్రహ్మ న స్మరసి నిర్వృతి మేషి యేన. 70

చ. బలిసదనంబుఁ జొచ్చెదవు ♦ ప్రాకెద వభ్రపదంబు దాటి ది
గ్వలయము సంక్రమించెదవు ♦ వారక చిత్తమ చాపలంబునం
దలప వొకప్పుడున్ మఱచి ♦ తప్పియు లోన వెలుంగుబ్రహ్మము
న్దలచెద వేని పొందెదవు ♦ నాశవివర్జితనిత్యసౌఖ్యమున్. 70

తా. ఓ మనసా! పాతాళలోకముఁజొచ్చెదవు. ఆకసంబును గడచిపోయె దవు. దిగాంతముల జారగానెదవు నీవిట్టి గమనశక్తి గలిగినను వివేకముచేఁ గాక పోయినను భ్రమకలిగియైన నేవేళనంకైనను యాత్మోపకారమై పరబ్రహ్మమును స్మరింపకెంచులకు? పరబ్రహ్మచింతనముచే నాత్మతృప్తినొంచి యుండునుగదా.

## ౮ నిత్యానిత్య వస్తు విచారము

శ్లో. కిం వేదైః స్మృతిభిః పురాణ పఠనైః శాస్త్రైర్మహావిస్తరైః
స్వర్గగ్రామకుటీనివాసఫలదైః కర్మక్రియావిభ్రమైః
ముక్త్వైకం భవదుఃఖభారరచనావిధ్వంసకాలానలం
స్వాత్మానందపదప్రవేశకలనం శేషా వణిగ్వృత్తయః 71

ఉ. శ్రీమహితశ్రుతిస్మృతుల ♦ చే బహుశాస్త్రపురాణయుక్తిచే
నేమిఫలంబు లౌక్యజన♦వృత్తికి నీఁ దగు నిర్జరాలయ
గ్రామకుటీనివాసఫల ♦ కర్మముచే ఫలమేమి జన్మదుః
ఖామయభేషజాకృయమ ♦ హాసుఖ మొక్కటి దక్క నన్నిటన్.

తా. వేద, శాస్త్ర శ్రుతి. స్మృతి, పురాణాదిసద్గ్రంథపఠనమువలన గాని, స్వర్గమునకెనయగు పల్లెటూరుయందుండి స్నానాది నిత్యకర్మల నిర్వర్తించినను, నిష్ప్రయోజన మావంతయు లేదు. పూర్వకర్మల వలనగల్గు సంసార దుఃఖసమూహ ములు గాలాగ్నివోలె పోగొట్టునవి. ఆత్మస్వరూపానందానుభవము నొందుట యొకటియేదక్క మిగిలినవన్నియు వ్యర్థములుగదా?

శ్లో. యదా మేరు శ్శ్రీమా న్నిపతతి యుగాంతాగ్ని వలితః
సముద్రా శ్శుష్యంతి ప్రచురమకరగ్రాహనిలయాః
ధరా గచ్ఛ త్యంతం ధరణిధరపాదై రపిధృతా
శరీరే కావార్తా కరికలభకర్ణాగ్రచపలే. 72

చ. స్థిరతరమైన మేరువు న ♦ శించు యుగాంత కృశాను కీలలన్
పరమకరాకరంబు లగు ♦ వారినిధానములెల్లనింకు భూ
ధరములచే ధరింపఁబడి ♦ ధారుణి పోడిమిదప్పు గావునం
గరి కలభశ్రవచ్ఛపల ♦ కాయమునం దిక వార్తలేటికిన్. 72

తా. స్థిరమైన మేరుపర్వతము ప్రళయాగ్నియందు నీరగుచున్నది. సర్వజల జంతువుల కాటపట్టయిన మహాసముద్రము ప్రళయాగ్నివలన నెండిపోవు చున్నది. సప్తకుల పర్వతములపై నిలచియున్న భూమి నాశన మగుచున్నది. ఇట్టి వానికే చంచలము కలిగియుండగా నేనుఁగుపిల్ల చెవికొనవలె నతిచంచలమగు కాయము నశింపదని యాయూహ!

శ్లో. గాత్రం సంకుచితం గతి ర్విగళితా భ్రష్టాచ దంతావలి
ర్దృష్టి ర్నశ్యతి వర్ధతే బధిరతా వక్త్రంచ లాలాయతే
వాక్యం నాద్రియతే చ బాంధవజనో భార్యా న శుశ్రూషతే
హా కష్టం పురుషస్య జీర్ణవయసః పుత్రోప్యమిత్రాయతే.

చ. తనువు ముడుంగుఁ బాదగతి ♦ దప్పును దంతములూడుఁ జీకటుల్
గనుఁగవ వర్తిలుం జెవుడు♦ గ్రమ్మును జొంగలుగాఱు మోమునన్
జనములు మాట చేకొనరు ♦ సన్నిధిఁ జేరదు భార్య పుత్రుడుం
గొనకొని శత్రువట్ల తిరు ♦ గుం గడుఁగష్టము వృద్ధదేహికిన్. 73

తా. వృద్ధత్వమునందు దేహము ముడుచుకొనుచు నడక తొట్రిలుచున్నది. పండ్లూడిపోవుచున్నవి. చత్వార మావహించుచున్నది. బధిరత్వము బాధించు చున్నది. నోటినుండి చొల్లు కారుచున్నది. బంధువులు చెప్పినమాట నాలకింపరు భార్య కొలువుఁజేయదు. కన్నకుమారుఁడు పరమశత్రువగును ముదుసలికష్టము వర్ణించుట యాదిశేషునకయిన తరము గాదుగదా!

శ్లో. వర్ణం సితం శిరసి వీక్ష్య శిరోరుహాణాం
స్థానం జరాపరిభవస్య తదా పుమాంసమ్

ఆరోపితాస్థిశకలం పరిహృత్య యాన్తి
చండాలకూపమివ దూరతరం తరుణ్యః. 74

ఆ. సుదతుల తెలుపుఁజూచి ♦ కోఅగాఁడు వీఁడని
ముసలివాని విడిచి ♦ ముదితలెల్ల
దూరముగఁ బోలంగు ♦ దురు నాస్థిశకలమా
మాల నూతివిడిచి ♦ మలఁగుభంగి.

తా. కాంతలు వృద్ధుని నెరసిన కేశంబులపరికించివీఁడు పాత్రుఁడుకాఁడని విడిచి, పంచములు నీరువాడు నూతినివిడిచినట్లు విడచి దూరముగాఁ బోవుదురు.

శ్లో. యావత్స్వస్థ మిదం కళేబరగృహం యావచ్చ దూరే జరా
యావ చ్చేంద్రియశక్తి రప్రతిహతా యావత్క్షయో నాయుషః
ఆత్మశ్రేయసి తావదేవ విదుషా కార్యఃప్రయత్నో మహా
న్ప్రోద్దీప్తే భవనే తు కూపఖననం ప్రత్యుద్యమః కీదృశః 75

చ. ధృతిఁగొని రోగముల్ జరయు ♦ దేహమునొంపకముందెయింద్రియ
ప్రతిహతి లేకముందె తన ♦ ప్రాణవిరామము కాకముందె పం
డితజనుఁ డాచరింపఁదగు ♦ తీవ్రప్రయత్నము ముక్తికిన్ మహో
ద్ధతశిఖ నిల్లుగాలుతఱిఁ ♦ దాలిమి నూతులు ద్రవ్వటొప్పునే. 75

తా. శరీరము రోగములులేక యెంతకాలము బలీయముగా నుండునో యెంత కాలము వృద్ధత్వము దవ్వుగానుండునో, యింద్రియ పటుత్వ మెందాక మేరదప్పక యుండునో, ఆయు వెంతకాలము క్షీణింపక యుండునో, యంతలోపల నేతన శ్రేయస్సాధనమునకుఁ గడంగవలయును. ఇట్లు ప్రథమమున ప్రయత్నింప కత్యంతదశ యందు బ్రయత్నించినచో నిల్లు కాలుచుండగా నూయిత్రవ్వినట్లగును.

శ్లో. తపస్యన్తః సన్తః కిముధినివసామ స్సురనదీం
గుణోదారాన్దారా నుతపరిచరామ స్సవినయం
పిబామ శ్శాస్త్రౌఘా నుతవివిధకావ్యామృతరసా
న్నవిద్మః కింకుర్మః కతిపయనిమేషాయుషిజనే. 76

మ. తపముల్ సేయుచు దేవతాతటిని చెం ♦ తన్ నిల్తుమో కాక దా
రపర్వతంబుననుందుమో వివిధశా ♦ స్త్రశ్రవ్యకావ్యామృతం

బుపభోగింతుమొ యేమిసేతుమొ హితం ♦ బూహింపఁగా లేమని
త్యపులోకంబున మానవుల్ మితనిషా ♦ సాయుష్మలై యుండఁగన్.

తా. నరు లస్థిరమగు జగంబున పరిమితితోఁగూడిన కొన్ని గొప్పపాటుల కాలమాయువుఁగలిగి యుండుటంజేసి ప్రపంచానర్చును గంగానదతీరమునందుందుమా ? లేక యనేకశాస్త్రములు విన దగిన కావ్యములునాడి సుస్తుతము ననుభవించుచుందుమా ? ఇంకేమిచేయుటకును నిష్టమునునదానిని నిశ్చయింపఁజాలము.

శ్లో. దురారాధ్యా శ్చామీ తురగచలచిత్తాః క్షితిభుజో
వయం తు స్థూలే చ్ఛా స్సుమహతి పదే బద్ధమనసః
జరా దేహం మృత్యు ర్హరతి దయితంజీవితమిదం
సఖే నాన్య చ్ఛ్రేయో జగతి విదుషో న్యత్ర తపసః. 77

ఉ. వాజిచలస్వభావులగు ♦ వారు ప్రసన్నులుగారు భూపతుల్
రాజసవృత్తి మానరు దు ♦ రాశయు నెక్కుడుమాకు సొమ్ముపైఁ
దేజమడంచు వృద్ధదశ ♦ దీకొని ప్రాణమునోంచుఁ గాలుఁడ
వ్యాజతపంబుకన్న భువి ♦ నాత్మ హితంబగు కృత్యమున్నదే. 7

తా. వాజివలె నిలుకడలేని మనస్సులుగలిగిన రాజుల యనుగ్రహము సంపాదించుట యెంతయు నష్టము. మనకాశ యత్యధికమై గొప్పపదవులు గావలయునని మనస్సువివ్విళూరుచుండును వృద్ధత్వ మావహించి దేహము జర్ణింపఁ జేయుచున్నది. అత్యంత ప్రియమగు ప్రాణమును మృత్యువు వెన్నాడుచున్నది కావున నో నేస్త కాఁడా బుద్ధిమంతులకు తపస్సే శ్రేయస్సాధనమని యెఱుంగవలెను.

శ్లో. మానే మ్లాయిని ఖండితే చ సునివ్యర్థం ప్రయాతేర్థిని
క్షీణేబంధుజనే గతే పరిజనే నష్టే శనైర్యావనే
యుక్తం కేవలమేతదేవ సుధియాం యజ్జహ్నుకన్యాపయః
పూతగ్రావగిరీంద్ర కన్దరదరీకుంజే నివాసః క్వచిత్. 78

ఉ. మానముగ్రుంగఁగా ధనము ♦ మట్టముగా నిజబాంధవాశ్రితుల్
దీనతఁ జెందియేగ నతి ♦ ధిప్రకరంబు నిరాసమైజనన్
మానుగ జవ్వనం బఱుగ ♦ మాన్యునకుందగు జహ్నుకన్యకా
నూనతరంగపూతకలి ♦ తోపలశైలనికుంజవాసముల్. 78

తా. మనోబలంబు పోవురీతి డబ్బుతగ్గునట్లు తనచుట్టములు నాశ్రితులు దైన్యతతోఁ జనునట్లు యాచక సమూహ మాసవిడుచుకొని పోవునట్లు జవ్వనము వెడలునట్లును బూజ్యుఁడగువాఁడు గంగానదియొక్క యధికమైన యలలచేతఁ బవిత్రమైనట్టియు మనోహరమైనట్టియు శిలలందుఁ కొండలందుఁ గొదరిండ్లయందునుండ తగును.

శ్లో. రమ్యా శ్చంద్రమరీచయ స్తృణవతీ రమ్యా వనాంతస్థలీ
రమ్యం సాధుసమాగమాగతసుఖం కావ్యేషు రమ్యాః కథాః
కోపోపాహితబాష్పబిందుతరళం రమ్యం ప్రియాయా ముఖం
సర్వం రమ్య మనిత్యతా ముపగతే చిత్తేన కించిత్పునః 79

ఉ. మంచివి పండువెన్నెలలు ♦ మంచివి పుష్పవనప్రదేశముల్
మంచిది సాధుసంగమస ♦ మాగతసౌఖ్యము చాటువాక్యముల్
మంచివి మంచి దశ్రుయుత ♦ మానవతీముఖ మీసమస్తమున్
మంచిదిగా దనిత్య మవి ♦ యానశవృత్తి నెఱుంగువారికిన్. 79

తా. చంద్రునివెన్నెలలు. పచ్చగాయుండు నడవిపట్టులు సజ్జనస్నేహము వలని సుఖము, కావ్యములందలి కథలును, ప్రణయంపుఁ గోపమువలన వచ్చిన కన్నీటిబిందువుతోఁగూడిన ప్రియురాలి నెమ్మొగమును, ఇవియన్నియును రమ్యకృత్యంబులేయగును, కాని యివి యనిత్యమని తోచెనా రమ్యములు కానేరవు.

శ్లో. రమ్యం హార్మ్యతలం న కిం వసతయే శ్రావ్యం న గేయాదికం
కిం వా ప్రాణసమాసమాగమసుఖం నైవాధికప్రీతయే
కింతు భ్రాంతపతంగపక్షపతనవ్యాలోలదీపాంకుర
చ్ఛాయాచంచల మాకలయ్య సకలం సంతో వనాంతం గతాః 80

ఉ. సంతతముఁ సుఖం బొసఁగఁ ♦ జాలవె చాల విశాలసౌధముల్
కాంతలసంగమున్ మధుర ♦ గానములుఁ వివరించిచూడ సం
భ్రాంతపతంగపక్షభవ ♦ మారుతఘాతవిధూతదీపికా
కాంచిచలంబు సర్వమని ♦ కానల కేగిరి పండితోత్తముల్. 80

తా. సుఖకాలక్షేపమునకు మంచి రమ్యహర్మ్యంబులును, శ్రవణానందమగు గానములును, మిగుల సంతుష్టి నందుటకు గబ్బిగుబ్బలుగల జవరాండ్ర సంగమసుఖంబును సుఖములు కానేరవు అందుచే సుజనులు మిడుతల యీకల గాలిచే జలించు దీపములవలె నివియన్నియుఁ జంచలములని కాననములకుఁ బోయిరి.

## శివార్చనము

శ్లో. ఆసంసారం త్రిభువన మిదం చిన్వతాం తాత తాదృ
ఙ్నైవాస్మాకం నయనపదవీం శ్రోత్రమార్గం గతో వా
యోఽయం ధత్తే విషయకరిణీగాఢరూఢాభిమాన
క్షీబస్యాంతఃకరణకరిణ స్సంయమాలానలీలామ్.

మ. తగ సంసార మనాదినుండియును ద ♦ త్తత్కర్మసంయుక్తను
జ్జగముం ద్రిమ్మరు మాకుఁ గానఁబడఁడే ♦ చందంబునం గర్ణమా
ర్గగతుం డైనను గాఁడు భోగకరణీ ♦ గాఢాదరోన్మత్తచి
త్తగరిష్ఠద్విపరాజసంయమపటు ♦ స్తంభాత్మకుం డెవ్వఁడున్. 81

తా. సంసారము ప్రారంభమయినది మొదలుకొని యీ త్రిలోకములును గాలించి చూచితిమిగాని విషయములనియెడు నాడుయేనుంగులందు మిగుల దృఢమగుయాసక్తిచే మదించియున్న మానసమనియెడి యేనుఁగును నియమించుటకుఁ గట్టుకంబమువంటి వాఁడగు పురుషుని నే మెంతును చూచినవారమును, విన్నవారమును కాము.

శ్లో. యదేత త్స్వచ్ఛందం విహరణ మకార్పణ్య మశనం
సహార్యై స్సంవాస శ్శ్రుత ముపశమైకవ్రతఫలం
మనో మందస్పందం బహిరపి చిరస్యాపి విమృశ
న్నజానే కస్యైషా పరిణతి రుదారస్య తపసః. 82

చ. ఇచ్ఛకు వచ్చినట్లు చరి ♦ యించుట దైన్యము లేని తిండియున్
నిచ్చలు సాధుసంగమును ♦ నిర్మలశాంతియు శాస్త్రబోధమున్
మచ్చిక లోనఁ బూని వెలి ♦ మట్టనిచిత్తము నాఁగ నింతయున్
విచ్చుటయో మహోన్నతత ♦ పంబుఫలంబొయెఱుంగ నేర్తుమే82

తా. ఇతరులను లోకువగాక యిచ్చవచ్చినట్లు మెలంగుట, దీనత్వములేని తిండియు, గొప్పవారితోడ స్నేహము, శాంతినొసగు వేదాంతశాస్త్రపఠన, మనస్సు బాహ్య విషయములయందు మిగులఁ గొంచెముగాఁ బ్రసరించుట, నిదియంతయు నే గొప్ప తపమువలన కలుగునో యెంతకాల మాలోచించినను నాకుం దెలియ రాకున్నది.

శ్లో. జీర్ణా ఏవ మనోరథాశ్చ హృదయే యాతంచ తద్యౌవనం
హంతాంగేషు గుణాశ్చ వంధ్య ఫలతాం యాతా గుణజ్ఞైర్వినా

కిం యుక్తం సహసాభ్యుపైతి బలవాన్కాలః కృతాంతోఽక్షమీ
హా జ్ఞాతం మదనాంతకాంఘ్రియుగళం ముక్త్వాస్తి నాన్యాగతిః

ఉ. చిత్తమునందె కోరికలు ♦ జీర్ణములయ్యె నశేషగాత్రమున్
హత్తిన జవ్వనంబరిగె ♦ నార్యులు లేమి గుణంబులున్ ఫలో
చ్ఛిత్తివహించె నెద్ది తగుఁ ♦ జేరక మానదు కాలుఁడక్కటా!
చిత్తజవైరి పాదయుగ ♦ సేవనమే గతిగా నెఱింగితిన్. 83

తా. కోరికలన్నియు హృదయమునందే యణగియున్నవి. ప్రాయముదప్పినది. అవయవ సామర్థ్యము వెలి బుచ్చుటకుఁ దగినవేత్తలు లేమిచే నన్నియు నిష్ప్రయోజనములైనవి. కనికర మేమియులేక మృత్యు వెన్నాడుచు క్షణక్షణము బాధించుచున్నది. ఇట్టి విషమ పరిస్థితియందుఁ గైకొనవలసిన మార్గమేదియో ? ఆఁ తెలిసినది ! కందర్పుని గర్వమణచిన పరమశివుని పాదారవిందద్వయంబును విడచిన వేఱుగతి లేదు. కాన నదియే శరణ్యము.

శ్లో. మహేశ్వరే వా జగతా మధీశ్వరే
జనార్దనే వా జగదంతరాత్మని
న వస్తుభేద ప్రతిపత్తి రస్తిమే
తథాపి భక్తి స్తరుణేందు శేఖరే.

తే. గీ. జగదధీశ్వరుఁడగు మహే ♦ శ్వరుని యందు
సకల జగదంత రాత్ముఁడౌ ♦ శార్ఙ్గియందు
భేద విజ్ఞాన మెయ్యెడ ♦ లేదు మాకు
నైనఁ దరుణేందు శేఖరు ♦ నందె భక్తి. 84

తా. మేము సర్వజగంబులకు స్వామియగు శంభునందుఁగాని, సమస్తలోకములందు వ్యాపించియుండువిష్ణువునందుఁగాని, వీరిరువురు వేఱువేఱు వస్తువులనెడి భేదబుద్ధిని కలిగియుండలేము. అయినను లేతచంద్రుని ధరించు పరమశివునియందే స్వభావసిద్ధమైన శక్తి కురియున్నది.

శ్లో. స్ఫురత్స్ఫారజ్యోత్స్నా ధవళితతలే క్వాపి పులినే
సుఖాసీనా స్సంతధ్వనిషు రజనీషు ద్యుసరితః
భవా భోగోద్విగ్నాః శ్శివశివశివే త్యార్తవచః
కదా స్యామానందో ద్గతబహుళ బాష్పాప్లుతదృశః. 85

శా. శాంతారావనిశీథకాలముల భా ♦ స్వత్సాంద్రచంద్రా తపా
క్రాంతస్వచ్ఛమరున్నదీపులినయో ♦ గ్యక్షోణిఁ గూర్చుండి జ
న్మాంతోద్వేగుల మైనమేము శివశ ♦ బ్దావృత్తితో నెప్డు డ
త్యంతానందభవాశ్రుసంకులదశా ♦ వాప్తిన్ సుఖం బుందుమో.

తా. రాత్రులందు ధ్వనులన్నియు నడగిన పిదప ధవళ కాంతులతోఁ గూడిన వెన్నెలచేఁ దెల్లగా విలసిల్లుచున్న గంగానది యిసుకదిన్నెలయందుఁ గూర్చుండి మేము సంసారసాగరము దాటశక్యము గాదని చింతించుట "శివ శివ శివ" యని ధ్యానించుచు నందుచే గలుగు నానందబాష్పము లుప్పతిల నేత్రములు జాలుకొన్న వారమగుట యెన్నఁడో గదా ?

శ్లో. వితీర్ణే సర్వస్వే తరుణ కరుణాపూర్ణహృదయా
స్స్మరంత స్సంసారే విగుణపరిణామాం విధిగతిమ్
వయం పుణ్యారణ్యే పరిణత శరచ్చంద్ర కిరణా
స్త్రియామా నేష్యామో హరచరణ చింతైక శరణాః. 86

చ. కలధన మంతయున్ సెలవు ♦ గానిడి నూత్నకృపాప్రపూర్ణచి
త్తుల మయి సంసృతిం గుశల ♦ దూరవిపాకము గాఁగ దైవముం
దలఁచుచుఁ గానలో శివప ♦ దస్మృతి నిష్ఠురమై నయింపగాఁ
గలము శరత్ప్రసన్న మిహి ♦ కాకరరమ్యములైన రాత్రులన్.

తా. మేము మెత్తని మానసంబుగలిగి యాచకులకు ధనమంతయు నొసంగి, సంసారమునందు దైవము సేయు కష్టపరంపరల మనసునందలంచుచు వానినిరోసి తపోవనముఁ జేరి శివచరణారవింద యుగళధ్యానమే రక్షణోపాయముగా నుంచుకొన శరదృతువునందలి పండువెన్నెలతోఁగూడిన రాత్రుల నానందముతోఁగడుపుదుము. గభాగ్య మెన్నడుగలుగునో తెలియరాదు.

శ్లో. కదా వారాణస్యా మమరతటినీరోధసి వస
న్వసానః కౌపీనం శిరసి నిదధానోంజలిపుటం
అయే గౌరీనాథ త్రిపురహర శంభో త్రినయన
ప్రసీదేతి క్రోశ న్నిమిషమివ నేష్యామి దివసాన్.

ఉ. శ్రీనుతకాశియం దమర ♦ సింధుపు చెంగట నిల్చి గోచినిం
బూని ప్రణామముద్రఁ దల ♦ మోపి పురాంతక పార్వతీశ శం

భో నిటలాక్ష శశ యని ♦ మొఱ్ఱలు వెట్టుచు నిశ్చలానుసం
ధానత యెన్నఁ డేఁ గడపె ♦ దన్ దినముల్ నిమిషంబులై వడిన్.

తా. కాశీపురంబున గంగానదీతీరమున నివసించు గోచిని ధరించి తల యందు జేతులుంచి ఓ పార్వతీశా! త్రిపుర సంహరణా! హే శంభో నిటలాక్షా! ప్రసన్నుండవు కమ్మని బిగ్గరగ నరచెడి దినములు క్షణమువలె గడచిపోవుట యెప్పుడు గలుగునో గదా!

శ్లో॥ స్నాత్వా గాంగైః పయోభిశ్శుచికుసుమఫలై రర్చయిత్వా విభో త్వాం
ధ్యేయే ధ్యానం నియోజ్య క్షితిధరకుహరగ్రావపర్యంకమూలే
ఆత్మారామః ఫలాశీ గురువచనరత స్త్వత్ప్రసాదాత్స్మరారే
దుఃఖం మోక్ష్యే కదాహం సమకరచరణే పుంసి సేవాసముత్థమ్.

ఉ. వేలుపుటేటఁ దోఁగి సుప ♦ విత్రఫలాదులఁ బూజచేసి ని
న్నోలి మనంబులో నిలపి ♦ యోగ్య గుహాశిలయందు నాత్మసం
శీలుఁడనై ఫలాశినయి ♦ శ్రీగురు వాక్యరతుండనై మహీ
పాలక సేవన శ్రమముఁ ♦ బాసెద నెన్నఁడు మన్మథాంతకా! 88

తా. ఎన్నఁడు గంగాజలమందు స్నానమాచరించి, పరిశుద్ధమగు ఫలపుష్పములతో నిన్నుఁ బూజించి, నీపదారవిందములు ధ్యానించుచు, పర్వతగుహాలందలి రాతి మెట్టపయి సుఖముగాఁ గూర్చుండి, విషయవాంఛలు మాని, యాత్మస్వరూపమునందే యాసక్తిగలిగి దేహధారణముకొరకు ఫలమూలంబు లాహారముగాఁగొని, గురూపదేశమును సదా ధ్యానించుచు నావలె సమస్తావయవములుగలిగిన యొక పురుషుని గొలుచుటవలన దుఃఖమును, మన్మథాంతకా! నీయనుగ్రహపాత్రుండనై యెప్పుడు వీడుదునో కదా!

శ్లో. ఏకాకీ నిస్పృహశ్శాంతః
పాణిపాత్రో దిగంబరః
కదా శంభో భవిష్యామి
కర్మనిర్మూలనక్షమః. 89

తే. గీ. ఒంటిఁ దిరుగుచుఁ గోరిక ♦ లుజ్జగించి
శాంతిఁ జేకొని పాణి భా ♦ జనుఁడనై ది
గంబరుఁడనై సమస్తక ♦ ర్మంబు లెపుడు
మొదలు చెడఁ ద్రుంతుఁ బరమేశ ♦ సదయహృదయ! 89

తా. హే శంభో! నేను నిస్సంగుడనై, నిరాశాపరుండనై, శాంతాత్ముఁడనై బిచ్చమెత్తుకొని దిగంబరుండనై, నాపూర్వకర్మములెల్ల నిర్మూలింపఁజాలు టెప్పుడో కదా!

శ్లో. పాణిం పాత్రయతాం నిసర్గశుచినా భైక్షేణ సంతుష్యతాం
యత్ర క్వాపి నిషీదతాం బహుతృణం విశ్వం ముహుః పశ్యతామ్
అత్యాగేపి తనో రఖండపరమానందావబోధస్పృశా
మధ్వా కోపి శివప్రసాదసులభ స్సంపత్స్యతే యోగినాం.

చ. హితునకుఁ జాఁచిపాత్రు నకు ♦ నిచ్చునకున్ శుచిభైక్షమాత్రతో
హితునకుఁ నెట్టితావున వ ♦ సించెడు వానికి విశ్వముం దృణ
ప్రతినిధిఁ జేయువానికిఁ బు ♦ రస్థితుఁ డయ్యు నఖండ సౌఖ్య సం
గతుఁడగు యోగి కేర్పడు నొ ♦ కానొకమార్గము శంభుసత్కృపన్

తా. అరచేయి నే పాత్రగా నుంచుకొని పవిత్రభిక్షవలన నే తృప్తినొంది, ప్రదేశ భేదములేక గూర్చుండుచు, క్షణక్షణము జగమునంతయుఁ దృణప్రాయముగా జూచుచు, బ్రహ్మానంద జ్ఞానమనుభవించుచు నుండెడి యోగులకు చెప్పశక్యము గాని మోక్షమార్గము శంభుకృపవలన నత్యంత సులభముగా లభించును.

## ౧౦ అవధూత చర్య

శ్లో. కౌపీనం శతఖండజర్జరతరం కంధా పునస్తాదృశీ
నైశ్చింత్యం నిరపేక్షభైక్ష మశనం నిద్రా శ్మశానే వనే
స్వాతంత్ర్యేణ నిరంకుశం విహరణం స్వాంతం ప్రశాంతం సదా
స్థైర్యం యోగమహోత్సవేపి చ యది త్రైలోక్యరాజ్యేన కిం.

శా. కౌపీనంబును జీర్ణకంథయు నపే ♦ క్షాశూన్య భైక్షంబు జిం
తాపాయంబు వనశ్మశానముల ని ♦ ద్రావాప్తి దుర్వార స
ద్వ్యాపారంబుఁ బ్రశాంతచిత్తమును యో ♦ గారూఢియుఁ వృత్తి
సంక్షేపంబుంగలదేని యోగికిఁ ద్రిలో ♦ కీ ప్రాభవం బేటికిన్. 91

తా. సహస్రాతులు గలిగినగోచిని గాని, బొంతను గాని, విషయచింత లేకుండుటయు, బిచ్చపుదెండి, ప్రేతభూమియందో లేక కౌననములందుఁ గాని నిదురించుటయు స్వేచ్ఛగా దిరుగుటయు, నిర్మలమగు మనస్సు గలిగియుండుట, యోగాభ్యాసమువలన,

నిలుకడగాని యుండిన త్రిలోక రాజ్యాధిపత్యము వచ్చినను యోగి తృణప్రాయము గాఁజూచును.

శ్లో. బ్రహ్మాండ మండలీ మాత్రం
కిం లోభాయ మనస్వినః
శఫరీ స్ఫురితే నాబ్ధిః
క్షుబ్ధో న ఖలు జాయతే.

క. మండల మాత్రంబగు బ్ర
హ్మాండములో భకరమగునె ♦ యతి ధీరునకున్
నిండు సముద్రము జలచర
తాండవగతిచే విలోడి ♦ తము గాదు గదా! 92

తా. మహాసముద్రమునందు యొక చేప యదరుటచే సముద్రము చలింపనట్లు ఆత్మజ్ఞానము బొందినధీరుని బ్రహ్మాండసమూహములకధికారిగా నుంచియైనను కలఁపజాలదు.

శ్లో. మాతర్లక్ష్మి భజస్వ కంచి దపరం మత్కాంక్షిణీమాస్మభూ
ర్భోగేషు స్పృహయాళవ స్తవ వశేకానిస్పృహాణామసి
సద్య స్స్యూత ఫలాశ పత్రపుటికా పాత్రే పవిత్రీకృతే
భిక్షాస క్తుభి రేవ సంప్రతి వయం వృత్తిం సమీహామహే.

క. అమ్మా లక్ష్మినమస్కా
రమ్ములు గావించి నిన్నుఁ ♦ బ్రార్థించెద నా
నెమ్మదిలో విద్యాభ్యా
పమ్మున నేలుకొను ముఖ్య ♦ ఫలమదియకదా! 93

తా. అమ్మా! లక్ష్మీ! మమ్ములవదలి మరెవ్వరి నేనిగొలువుము. మమ్ములగోరకు సుమా! ఏమన భోగాశక్తగలవారే నీకిష్టులుగాని భోగాశక్తిలేని మాకునునీకును సంబంధమేమి? నీవులేకున్నచో మాజీవితము జరుగదని యనకుసుమా! ఇప్పుడు మేము పవిత్రమగు మోదుగాకుల పాత్రగాఁజేసుకొని యిచ్చుమెత్తుకొని తిని మాజీవితము గడుపదలఁచుకొని యున్నాము. అట్లుజీవించు మాకు నీతోటి సంబంధమేల?

శ్లో. మహీ రమ్యా శయ్యా విపుల ముపధానం భుజలతా
వితానం చాకాశం వ్యజన మనుకూలోయ మనిలః

స్ఫురద్దీప శ్చంద్రో విరతివనితాసంగముదితః
సుఖీ శాంత శ్శేతే ముని రతనుభూతి ర్నృప ఇవ. 94

చ. ధరణి విశాలతల్ప ముప ♦ ధానము బాహువునింగి చందువా
సురటులు గంధవాహములు ♦ శోభన దీపము చందురుండుగా
విరతివధూమణిం గలసి ♦ వేడుక మీఱ సుఖించి శాంతుఁడై
నిరుపమలీల యోగి శయ ♦ నించు మహీపతి మాళికై వడిన్. 94

తా. వానికి నేలయే పాన్పు లతవలె నిడుదయైన భుజమే తలగడ. ఇంపుగా వీచెడి గాలియే వీవన, చంద్రుఁడే దీపము విరక్తియనెడి స్త్రీ సంభోగమువలన సంతుష్టాంత రంగుండైయుండు నాముని సర్వసంపన్నుండైన సార్వభౌమునిం బోలి సుఖమున నిదురించును.

శ్లో. భిక్షాశీ జనమధ్యసంగరహిత స్స్వాయత్తచేష్ట స్సదా
హానాదానవిరక్తమార్గనిరతః కశ్చిత్తపస్వీ స్థితః
రధ్యాకీర్ణ విశీర్ణ జీర్ణవసనై రాస్యూతకంథాధరో
నిర్మానో నిరహంకృతి శ్శమసుఖాభోగైక బద్ధస్పృహః. 95

శా. హానాదాన విరక్త మార్గనిరతుం ♦ డక్షయ్యభిక్షాశి స్వా
ధీనారంభుఁడు లోక సంగదురితా ♦ తీతస్వభావుండు ర
థ్యానిక్షిప్తవిశీర్ణవస్త్రకృతకం ♦ థాసీనుఁ డాత్మేక్షర
థ్యానాసక్తుఁడొకానొకండు విగతా ♦ హంకారుఁ డొప్పున్ భువిన్.

తా. బిచ్చమెత్తుకొని దేహయాత్రగడపుచు సర్వజనానుగ్రహపాత్రుఁడై సర్వేంద్రియముల లోఁబరచుకొని హేయాహేయములఁ బాఱద్రోలి చింకిగుడ్డలతో నిర్మించిన బొంతఁగట్టుకొని, యభిమానాహంకారములనణఁచి శాంతముచే వచ్చునానంద మనుభవించుచు నుండువాఁడు యెవఁడో యొకఁడరుదుగా నుండును

శ్లో. చండాలః కి మయం ద్విజాతి రథవా శూద్రోథ కిం తాపసః
కిం వా తత్త్వవివేక పేశలమతి ర్యోగీశ్వరః కోపికిం
ఇత్యుత్పన్న వికల్పజల్పముఖరై రాభాష్యమాణాజనై
ర్న క్రుద్ధాః పథినైవతుష్టమనసో యాంతి స్వయం యోగినః 96

ఉ. మాలఁడొ వీఁడు విప్రకుల ♦ మండనుఁడో మఱి శూద్రుఁడో
తపశ్శీలుఁడో సిద్ధుఁడో యనుచు ♦ జెంతలఁ జేరి వికల్పజల్పవా
చాలజనంబులాడఁగ వె ♦ సం గుపితాత్ములు గారు సమ్మదో
ద్వేలురుగారు మిన్నక భు ♦ విన్ విహరింతురు యోగిపుంగవుల్.

తా. జనులు మార్గమునఁ బోవుయోగులఁ జూచి వీఁడు చండాలుఁడా? బ్రాహ్మణుఁడా? శూద్రుఁడా? తపస్వియా? పరమార్థమునుగోరెడి యోగిపుంగవుఁడా యని తమ్మాక్షేపింపగా కోపముగాని సంతోషముగాని లేకతలవంచుకొని పోవుదురు.

శ్లో. హింసాశూన్య మయత్నలభ్య మశనం ధాత్రా మరుత్కల్పితం
వ్యాళానాం పశవ స్తృణాంకురభుజ స్తృష్టా స్థలీశాయినః
సంసారార్ణవలంఘనక్షమధియాం వృత్తిఃకృతా సా నృణాం
యా మన్వేషయతాం ప్రయాంతి సతతం సర్వే సమాప్తింగుణాః.

చ. చిలువల గాలిమేపరులఁ ♦ జేసి తృణాంకురభోజనంబు భూ
తలశయనంబు గోవ్రిలకుఁ ♦ దామర చూలి విధించెఁ దత్త్వవే
శలమతులైన వారలకు ♦ సన్మతవృత్తిఘటించె దానిచేఁ
బోలఁగు రజస్తమోజసిత ♦ దోషము లెల్ల భజించువారికిఁ. 97

తా. పాములు, భూమియందుఁ బరుండు జంతువులు, అవివేకము గలవగుటచే వాని కేప్రాణిహింసయులేని గాలినిగడ్డిని సృజించినాఁడు. సంసార సాగరమునుండి ధరింపజేయునట్టి జ్ఞానాత్ములకు వారిశక్తులన్నియుఁ పూర్ణముగా చేర్పఁబడయందగిన బ్రతుకుగలిగించి యున్నాఁడు.

శ్లో. గంగాతీరే హిమగిరిశిలా బద్ధపద్మాసనస్య
బ్రహ్మధ్యానాభ్యసనవిధినా యోగనిద్రాం గతస్య
కిం తైర్భావ్యం మమ సుదివసై ర్యత్ర తే నిర్విశంకాః
కండూయంతే జరఠహరిణా స్స్వాంగమంగే మదీయే.

ఉ. శ్రీసురసింధుతీరమున ♦ శీతనగోపలసీమయందుఁ బ
ద్మాసన వర్తినై శివు ను ♦ పాస్తియొనర్చుచు యోగనిద్రచే
భాసిలుచున్న నాతనువు ♦ పైఁ దమమేనులతీటఁదీఱ న
త్రాసములై కురంగములు ♦ రాపులు సేయుట గల్గునేకదా. 98

తా. గంగాతీరమున హిమగిరియందలి యొక శిలయందు పద్మాసనము వైచుకొని కూర్చుండి బ్రహ్మచింతనముఁజేయుచు సమాధియందుండఁగా నంచలి ముసలిజింకలు కదలక మెదలకయుండు నాకునిని నాకుచుండెడి దినములు నిం కెన్నడు ప్రాప్తించునోకదా ?

శ్లో. పాణిః పాత్రం పవిత్రం భ్రమణపరిగతం భైక్షమక్షయ్యమన్నం
విస్తీర్ణం వస్త్రమాశాదశకమచపలం తల్ప మస్వల్పముర్వీ
యేషాం నిస్సంగతాంగీకరణపరిణతస్వాంతసంతోషిణ స్తే
ధన్యా స్సన్యస్తదైన్యవ్యతికరనికరాః కర్మ నిర్మూలయంతి. 99

ఉ. పాత్రము పాణిపంకజము ♦ భైక్షము భోజ్యమనల్పతల్ప మీ
ధాత్రి దిశాష్టకంబు పరి ♦ ధానమగుఁ భువి నేరి కానుచా
రిత్రుల సంగతాగుణధు ♦ రీణులు రీణసుఖానుభూతికిం
బాత్రులు మోహపాశములఁ ♦ బాసి దహింతురు కర్మబీజమున్.

తా. పాణియే పవిత్రమయిన పాత్రగాను, ఒచ్చుమెత్తుకొని తెచ్చుకొన్న అన్నమే తరుగునదిగాను, పదిదిక్కులే మురికిలేనట్టి బట్టలుగాను భూమియే పాన్పు గాను గలిగి నిస్సంగమువలన పరిపాకమునందిన మనస్సుకలిగి సంతసించు పుణ్యాత్ములు దైన్యముచేఁ గలుగు కష్టములన్నియు విడిచి జన్మపరంపరలంగూర్చు కర్మబంధముల నిర్మూలము చేయుదురు.

శ్లో. మాత ర్మేదిని తాత మారుత సఖే తేజ స్సుబంధో జలః
భ్రాత ర్వ్యోమ నిబద్ధ ఏవ భవతా మంత్యః ప్రణామాంజలిః
యుష్మత్సంగవశోపజాతసుకృతస్ఫారస్ఫురన్నిర్మలా
జ్ఞానాపాస్తసమస్తమోహమహిమా లీయే పరబ్రహ్మణి.

మ. జననీ మేదిని తాత మారుత వయ ♦ స్యా వహ్ని చుట్టంబ జీ
వనమా సోదర తారకాపథమ భ ♦ వ్యప్రేమ సంధిల్లమీ
కొనరింతుం జరమప్రణామము భవ ♦ ద్యోగస్ఫురత్పుణ్య సం
జనితజ్ఞాననిరస్తమోహపతినై ♦ సద్బ్రహ్మముం బొందెదన్. 100

తా. మాతృసమానమగు ఓభూమీ! పితృసమానవగువాయూ! చెలిసమాన మగు తేజమా! మంచిబంధువగు జలమా! తోబుట్టువగు నాకాశమా! ఇదే మీకు కడపటిసారి చేమోడ్చి మ్రొక్కెదను. మీ తోడిస్నేహమువలనఁగలిగిన సుకృతముచే నాకుమిక్కిలి ప్రకాశించుచున్న విమలజ్ఞానముప్పతిల్లగా దానిచే నజ్ఞానాంధకారము గడచినవాఁడనై యానందస్వరూపమగు పరబ్రహ్మమందు లీనుండ నగుచున్నాను.

ఉ. కూడిక చెందెి కొన్నితమ ♦ కూరిమికీర మదెట్లు పల్కిన
న్వేడుక చేయుచందమున ♦ నీదయఁ గాంచిననాకవిత్వ మే
జాడ వహించి యున్నఁగడు ♦ సమ్మదమే ఘటియించు నీకుఁ బె
ద్దాడపురీనివాస నిజ ♦ దాసశివంకర సోమశేఖరా! 101

శా. తారామండలకుండలీశ్వర సుధా ♦ తారామరత్నోజ కాం
తారామర్త్యగజాంబుజ ప్రభవకాం ♦ తారామగౌర ప్రభా
దారాలంకృతవామ భాగబుధమం ♦ దారాగ యోగీంద్రబృం
దారాధ్యాంఘ్రిసరోరుహాద్వితయ పే దారామఖేలత్ప్రికా! 102

మాలిని. ప్రణుతకుధరకన్యా ♦ పాలసాదృశ్యహేతు
ప్రణయభరశిరస్స ♦ వ్రాపితాబ్జారిరేఖా
ప్రణవసలినపీఠో ♦ పాంతసాంతత్యసేవా
చణహరిసిధిరామా ♦ చామరోద్వీజ్యమానా! 103

క. సంతోషబాష్పవారిని
రంతరదృగ్జలజభర్తృహరి ♦ సంయమిరాట్
శాంతస్వాంతనిశాంతని
శాంతోజ్జ్వలబోధదీప ♦ శరవరచాపా! 104

గద్యము.

ఇది శ్రీమదుమామహేశ్వర కరుణాకటాక్ష వీక్షాపాత్రి యేనుఁగు
లక్ష్మణకవిరాజపౌత్ర తిమ్మనార్యపుత్ర విద్వజ్జనవిధేయ
లక్ష్మణకవి నామధేయ ప్రణీతంబయిన సుభాషిత
రత్నావళి కావ్యంబునందు వైరాగ్యశతకంబున
తృష్ణాదూషణాది దశప్రకరణంబులు గల
తృతీయాశ్వాసము
సంపూర్ణము.

---

# అధిక శ్లోకములు



శ్లో. విశేకవ్యాకోశే వికసతి శమే శ్యామతితృషా
పరిష్వంగే తుంగే ప్రసరతి తరాం సా పరిణతిః
జరా జీర్ణైశ్వర్య గ్రసన గహనాక్షేపకృపణః
కృపా పాత్రం యస్యాం భవతి మరుతా మరుతా మహ్యధిపతిః
మ. శమముఁ జారువివేక యుక్తిని వికా ♦ సంబొందఁగాఁ దృష్ణ దు
ష్షమమౌ పట్టునుపీడఁగాఁ గలుగు నా ♦ సౌఖ్యాతి రేకంపుఁ బా
కమునుం జూడ జరా విజీర్ణ విభవ ♦ గ్రాసాగతాక్షేప వి
శ్రమదీనంబగు వేల్పు తేని దశయుఁ ♦ జాలిం దగం జేయదే.
శ్లో. పురా విద్వత్తాసీదుపశమవతాం క్లేశహతయే
గతా కాలేనాసౌ విషయసుఖసిద్ధ్యై విషయిణాం
ఇదానీం తు ప్రేక్ష్య క్షితితలభుజ శ్శాస్త్రవిముఖా
నహో కష్టం సాపి ప్రతిదిన మదోధః ప్రవిశతి.
చదు వది తొల్లి శాంతిపర ♦ సంతతి వంతలఁ బొందుచుండెఁ బా
చ .బడపడిఁ గామలోలజన ♦ పాళిసుఖంబు గూర్పఁజొచ్చె న
య్యది మఱి శాస్త్రదూరమతు ♦ లౌ పతు లిప్పుడుపేక్ష సేయగా
బొదుపరినాఁడు నాఁటికిని ♦ గ్రుంగుచుఁ గ్రుంగుచు నున్నదక్కటా
శ్లో. అతిక్రాంతః కాలో లటభలలనాభోగసుభగో
భ్రమంత శ్శ్రాంతాస్స్మ స్సుచిరమిహ సంసార సరణౌ
ఇదానీం స్వస్సింధో స్తటభువి సమాక్రందనగిర
స్సుతారైః ఫూత్కారైః శివశివశివేతి ప్రతనుమః
ఉ. చారుముఖీ సుఖైకరతి ♦ జానగు కాలమువోవు దెంచె సం
సారపుఁ ద్రోవఁ ద్రిమ్మరుట ♦ జాల శ్రమంబునుగల్గె నింకఁబూ

ఓంకార పురస్సరంబుగను ♦ దైవతరంగిణి తీరసీమనే
పాఱ వెలుంగునన్ శివశి ♦ వాయని కూయుచు వారమెంతయున్

శ్లో. అహో ధన్యాః కేచిత్త్రుటితభవబంధవ్యతికరా
వనాంతే చిత్తాంతో విషమవిషయాశీవిషగతిం
శరచ్చంద్రజ్యోత్స్నాధవళగగనాభోగసుభగాం
నయంతే యే రాత్రిం సుకృతచయచింతైకశరణాః

ఉ. దారితబంధులై విషయ ♦ దారుణసర్పవిషాగ్నిదూరులై
భూరితపోవనంబునను ♦ బుణ్యచయైకపరాయణాత్మతన్
శారదచంద్రికాధవళ ♦ చారునభోపభాసమాన మై
వారక వెల్గు రేల్ గడపు ♦ వారలు సూయురె యెంతధన్యులో.

శ్లో. మహాదేవో దేవ స్సరి దపిచ సైవామరసరి
ద్గుహా ఏవాగారం వసనమపి తా ఏవ హరితః
సుహృద్వా కాలోయం వ్రత మిద మదైన్య వ్రత మిదం
కియద్వా వక్ష్యామో వటవిటప ఏవాస్తు దయితా:.

మ. దివిషద్వాహిని మాకు వాహిని మహా ♦ దేవుండె దేవుండు బ
ల్లవిగేహం మాకు గృహంబు నీదశ దిశ ♦ ల్బాగైన పుట్టంబు మ్రొ
త్త్యవ మాడం జెలికాండు సువ్రతము నెం ♦ తో మీఱు దైన్యవ్రతం
బు విచారింపఁగ వేయునేల వటస ♦ ద్భూజంబె కంజాక్షియున్.

శ్లో. జ్ఞానం సతాం మానమదాదినాశనం
కేషాంచిదేత న్మదమానకారణం
స్థానం వివిక్తం యమినాం విముక్తయే
కామాతురాణా మతికామకారణం.

క. జ్ఞానము మదమానంబుల
మానుచు సుజనులకుఁ జిచ్చు ♦ మఱికొందఱకున్

జ్ఞానికి గామికి విజన
స్థానము ముక్తియును రక్తి దానొసగు గతిన్.

శ్లో. శయ్యా శైలశిలాగృహం గిరిగుహావస్త్రం తరూణాంత్వచ
స్సారంగా స్సుహృదో నను క్షితిరుహాం వృత్తి: ఫలై: కోమలై:
యేషాం నైర్ఝర మంబుపాన ముచితం రత్యైచ విద్యాంగనా
మన్యేతే పరమేశ్వరా శ్శిరసి యై ర్బద్ధోస సేవాంజలి:

చ. శిలదగు శయ్య యిల్లుగుహ చీరయునార చెలుల్ కురంగముల్
నలువగు పండ్లు నిర్ఝరజ లంబులమన్కియు మాఱు కేళికిం
జెలువయు విద్యయై యమరఁ జేతుల నొదల మోడ్చియన్యులం
గొలువక యుండువారలె యకుంఠిత భూరి కృతార్థులారయన్

శ్లో. సత్యామేవ త్రిలోకేసరితి హరిసిరశ్చుంబినీవిచ్ఛటాయాం
సద్వృత్తిం తల్పయంత్యాం తటవిటపిభర్వల్కలై స్సత్ఫలైశ్చ
కోయం విద్వాన్విపత్తి జ్వరజనితరుజాతీవ్ర దుఃఖాస్తికానాం
వక్త్రం వీక్షేపదుర్ధేయదిహీనబిభృయా త్స్వేకుటుం బేనుకంపామ్.

చ. హరితర సోకుపోకముడి యంచితకాంతుల మించుగంగయున్
దరిగలమ్రానిపండులను నారలనల్వగు ప్రోవుఁజూపనే
వెరవరి గాని పేదఱిమి వేదన బొక్కుచునుండు బిడ్డలాం
డ్రురదయఁ జూడకుండినఁ గనుం బెనువంతల దారిద్రొక్కునే.

శ్లో. ఉద్యానేషు విచిత్రభోజన విధి స్తీవ్రాతి తీవ్రంతపః
కౌపీనా వరణం సువస్త్రమమితం భిక్షాటనంమండనం
ఆసన్నం మరణంచ మంగళసమం యస్యాంసముత్పద్యతే
తాంకాశీంపరిహృత్య హంత విబుధై రన్యత్ర కింస్థీయతే.

చ. అరిది మహాతపంబు చెలు వానెల దోటలఁ గుడ్పువిందుగా
గరువపుగోచి బల్వలువగాఁ దిరిపం బది భూషణంబుగా
మరణము దాపు మంగళస మంబుగ సొంపలరారునెందు నా
యురవగు కాశివీడి బుధు లేటికి నొండొక చోటనుండగన్,

శ్లో. నాయం తే సమయో రహస్యమధునా నిద్రాతినాథో యది
స్థిత్వా ద్రక్ష్యసి కుప్యతి ప్రభు రతి ద్వారేషు యేషాం వచః
చేతస్తా నపహాయ యాహి భవనం దేవస్య విశ్వేశితు
ర్నిర్దౌవారికనిర్దయోక్త్యపరుషం నిస్సీమ శర్మ ప్రదం.

శా. నీకుం గాదిది వేళ మంతనము సూ నిద్రించె డిం నాథుడుం
బోకే నిల్చియుఁ జూచితేఁ గినియుఁ బో ♦ పొమ్మన్నయ ద్వాకిళుల్
వీఁకన్ వీడి మనంబ వేగచనుమా ♦ విశ్వేశు సద్మంబుకై
నీకుంగల్గు సుఖంబు క్రూరు లరయన్ ♦ లేరందు దౌవారికుల్.

శ్లో. అకించనస్య దాంతస్య
శాంతస్య సమచేతసః
సదా సంతుష్ట మనస
స్సర్వా స్సుఖమయాదిశః.

క. దాంతుఁడు నకించనుఁడును
శాంతుఁడు సమచిత్తవృత్తి ♦ సంయుతుఁడు సదా
సంతుష్టుఁడునగు వానికి
సంతత మెల్ల దిశలు సుఖ ♦ సంతతి మయమున్.

శ్లో. ఉత్తిష్ఠ క్షణ మేక ముద్వహ గురుం దారిద్ర్యభారం సఖే
శ్రాంతస్తావ దహం చిరంమరణజం సేవేత్వదీయం సుఖం
ఇత్యుక్తోధన వర్జితే వ సహసా గత్వాస్మశానే శవో
దారిద్ర్యా స్మరణాం వరం వరమితి జ్ఞాత్వైవ తూష్ణీంస్థిత:

శా. ఆరుం బేద యొకండు ప్రేతమును డా ♦ యంబోయి యోమిత్రయో
దారిద్ర్యంబును గొమ్ము లెమ్ము మృతిచే ♦ తంగన్న పొంపిమ్ము వే
సారం జొచ్చితి నంచు వేడ శవముం ♦ జావెంతయున్ మేలు మేల్
దారిద్ర్యంబున కంటె నంచునదియుం ♦ దాబల్కకుండెంగడున్,

శ్లో. ఏతా హసంతి చ రుదంతిచ కార్యహేతో
ర్విస్వాస యంచిత పరంనచ విశ్వసంతి
తస్మాన్న రేణ కుల శీల సమన్వితేన
నార్య స్స్మశాన ఘటికా ఇవ వర్జనీయే.

తే. గీ. చిగురుఁ బోడులు కార్యంబు ♦ నిగుడు కొఱకు
నగుదు రేడ్తురు నమ్మింతు ♦ నమ్మరొరుల
గాన కుల శీల వంతుండు ♦ మాన వలయు
నారులను వల్లకాటి ప ♦ నంట్లఁబోలె.

శ్లో. క్వచిద్వీణా వాద: క్వచి దపిచ హాహేతి రుదితం
క్వచి ద్విద్వద్గోష్ఠీ క్వచిదపి సురామత్తకలహ:
క్వచి ద్రామారమ్యా క్వచిదపి గళత్కుష్టవపుషో
నజానే సంసార: కి మమృత మయ: కిం విషమయ:

చ. ఒకయెడ వీణియల్ మెరయ నొక్కెడహాయని యేడ్పు విచ్చువే
ఱొకయెడ నూరిగోష్ఠి మఱి యొక్కెడ త్రాగియొనర్చు చివ్వయొం
డొకటఁ బెడంగుఁ జేడియలు నొక్కట గుష్ఠముగాఱు నారులా
నొకటి యెఱుంగరా దమృత మో మఱి సంసృతిదా విషంబొకో.

శ్లో. చలా లక్ష్మీ శ్చలాని ప్రాణా
శ్చలం జీవిత యౌవనమ్
చలాచలేచ సంసారే
ధర్మ ఏకో హి నిశ్చల:

క. చలము సిరి చలము ప్రాణము
చల మరయుగ జీవనంబు జవ్వన మతిచం
చలమగు సంసారము నం
దలఁపగ నిశ్చలన మొక్క ధర్మము కాదే!

# పుష్పగిరి తిమ్మకవి ప్రణీత
# నీతి శతకము

అవతరణిక:—ఏనుఁగు లక్ష్మణార్యుని నీతిశతకంబునందలి పద్యరత్నంబులకంటె పుష్పగిరి తిమ్మనార్యుని నీతిశతకములు వాడుకలో లేకపోయినను నుత్తమంబులని పలువురచేఁ గొనియాడబడుటచే నాపద్యంబులనిందుఁ బొందుపరచుచున్నాను.

ఉ. శ్రీలసమానభానుశిఖిశీతమయూఖరుచుల్ గ్రసించి ది
క్కాలపదాద్యుపాధులనుగాంచక యంతము లేక జ్ఞానమా
త్రాలఘుతాద్వితీయపరమాకృతి స్వానుభవైకగమ్యమై
చాల వెలుంగు శాంతమయశాశ్వతతేజము గూర్చి మ్రొక్కెదన్.

ఉ. బోద్ధలు మత్సరోచ్ఛలితబుద్ధుల నూఁకొనబో రహంక్రియా
బుద్ధులు గాపునన్ బరలు బాలిశులైన లే రబోధపు
న్బద్ధతి నున్కిఁ దక్కిన యపండితులొల్ల రసద్వివేదస
న్నద్ధ సుభాషితంబు లివి నాతనువందె యణంగుఁ గాకకన్.

ఉ. అజ్ఞుఁడు సజ్జనోక్తులెట్టులైనవిను న్సులభంబుగా విశే
షజ్ఞుఁడు దెల్పినంత సరసస్థితి నూఁకొను జ్ఞానలేశ దు
ర్విజ్ఞల దుర్విదగ్ధుఁడగు పామరుడే గతి దెల్పఁబోయిన
న్ప్రాజ్ఞతఁ జెందఁ డజ్ఞుఁడని బ్రహ్మయు రంజిలఁజేయ నోపునే?

చ. మకరము కోఱనున్న పెనుమానికమైన హరింపవచ్చు దు
ష్కర చలదూర్మిఘోషయగు సాగరమైనఁ దరింపవచ్చు దు
ష్ప్రకుపితభోగినైనఁ బువుదండవలె న్దలఁదాల్పవచ్చుఁ బా
యక ప్రతికూల మూర్ఖహృదయంబది త్రిప్పగ రాదొకప్పుడున్.

చ. ఇసుకఁ బ్రయత్నత న్పిడిచి హెచ్చుగఁ దైలముఁ గాంచవచ్చు బె
ల్లిసఁగెడు దప్పిఁ జిక్కి మృగతృష్ణ జలంబులు గ్రోలవచ్చునల్

దెసలఁ జరించి యొక్కపుడదే దొరకున్ శశపున్విషాణము
న్బసగఁగ దుర్వివేకియగు మూర్ఖుని చిత్తము ద్రిప్పనేరికిన్

ఉ. బాలిశు చిత్త మేజనుఁడు బల్మి సుభాషితులఁ ద్రిప్పఁబూను వాఁ
డీలవణాబ్ధి దీపుఘటియింపఁగఁ బూనును దేనెబొట్టుచే
బాలమృణాలతంతువునఁ బన్నగరాజముఁ గట్టబోవు వ
జ్రాలకు బెజ్జముల్ నునుపఁజాలు శిరీషసుమాంతసంహతిన్

చ. పరమహితంబుగాఁ దగును పాయము చే ననిశంబధీనమై
పరఁగెడునట్టు లజ్ఞతకు బల్విగు కప్పడమొప్పఁ జేసెను
న్సరసిజగర్భుఁ డెట్లనిన సర్వమెఱింగిన వారి రచ్చలం
దెఱుఁగని వారి కాభరణ మెంచ విశేషపు మౌనమే కదా

చ. ఎపుడొక యింతగంటినని యేనుఁగురీతి మదించి యుంటినో
యపుడె సమస్తవిత్ప్రభుఁడనైతి నటంచు మదించె నామనం
బెపుడొక యించుకించుక బుధేంద్రుల చెంత నెఱింగికొంటినో
యపుడె విమూర్ఖతాత్త దురహంకృతి వీడె జరంబు కైవడిన్

చ. తొరఁగెడు జొల్లునన్ దడిసి దుష్టపుఁగంపున జేరరాక లోఁ
బురువులు గాఱ నంజుడును బోఁడిమి లేనినరాస్థిఁ జొక్కుచు
న్నొఱికెడు కుక్క పార్శ్వమునకున్ జనుదెంచిన యింద్రుఁగాంచిన
న్నొరయదు శంక క్షుల్లకులు బొందిన తక్కుడు లెక్క సేతురే.

చ. సురపురినుండి శంకరుని జూటముజూటము వాసిగట్టుగ
ట్టురువడి వీడి భూమి భువినుండియు వారధి వార్ధి నిల్వక
య్యురగులలోకము న్బొరసియు న్మొఱసె న్మఱి గంగ గావున
న్మొఱకులు స్థానము ల్విడచి నానాముఖంబుల గాసిఁ జెందరే.

చ. సురుచిర శాస్త్రపాఠ పరిశుద్ధవచస్కులు శిష్టధేయ సు
స్థిరనిగమాగము ల్గడుఁ బ్రసిద్ధులునై ఘనులే నృపాలుచేఁ

బారసిరో లేమి యక్కడన భూపతిదే ఘను లైనవారి లే
మరసి పరీక్షకుండు వెల యల్పము సేసిన రత్న మల్పమే.

శా. కనఁబడ దెవ్వ రేబలిమిఁ గైకొనవచ్చిననిచ్చలుం సుఖం
బెసఁగఁగఁ జేయు నర్థులకు నిచ్చిన హెచ్చు యుగాంతవేళలం
దును జెడ దట్టివిద్య యనునుత్తమ ధనంబు గడించి కొన్న వా
రిని నపరింప నేరని కుభృత్తులతోడ విరోధమేటికిన్.

చ. అధిగత వేదశాస్త్ర పరమార్థుల బండితులైన వారి నీ
వధిప! నిరాకరింపవల దల్పతృణోపమమీదు లక్ష్మి య
య్యధికుల నడ్డగింపఁ గలదా మదవార్యసితోరుగండ భా
క్కధరనిభేభరాజములకుం బిసతంతువ దేమి యడ్డమో.

చ. అల కమలాసనుండు మదినల్క వహించిన నేని యంచనై
లలిత సరోజినీ వనవిలాస నివాసము మాన్పఁగాక దా
బలిమి యడంచు దాని దగుపాలును నీరును నేర్పరించు నే
ర్పులఁ గలసుప్రసిద్ధ యశము న్హరియించుటకు న్సమర్థుఁడే

చ. జలకము గంధమున్ గుసుమచారుశిరోజములున్ భుజాంగదం
బులు శశిగౌరహారముఖభూషలు మర్త్యు నలంకరింపలే
వలర నలంకరించు విమలాంచితసంస్కృతవాణియొక్కటే
పొలుపగుసొమ్ము లెల్లఁ జెడిపోవదు వాక్సుభూషణంబిలన్.

చ. నరులకు దాచిపెట్టినధనంబును జిక్కనిరూపు శ్రీయశ
స్కరియును భోగభాగ్యసుఖకారిణియున్ గురుకోటికి న్మహా
గురువు విదేశబంధువును గూర్చిన దైవము రాజవశ్యమున్
నెరపు సువిద్యయే ధర నవిద్యుఁడె పో పశువర్థమిట్టిదే.

చ. క్షమ మది నున్న నేల కవచం బది యేటికి క్రోధమున్న దా
యమలయ నేల చిచ్చు పరమౌషధమేల సుహృత్తు గల్గ మూ
ర్ఖమనుజుఁ డున్న నేలఫణి ద్రవ్య మదేల సువిద్యయున్న సి
గ్గమరినసొమ్ము లేక కవితాఢ్యతగల్గిన రాజ్య మేటికిన్.

చ. పరిజనకోటిపైఁ గరుణ బంధులపై మొగమాట మల్పులం
దరతియుఁ బ్రీతిసాధుజనులం దిలజానియడ న్నయంబు శాం
పరుల పయిన్ బుధాళియెడ నార్జవముస్ గురులందు నోర్పు బి
త్తరులెడ ధూర్తతం దెలుపు ధన్యులయందె తగు న్జగద్గతుల్.

చ. మతిగలజాడ్యముల్ చెరచుమాటల సత్యముగూర్చు మానము
న్నతి నెనయించు బాపములు నాశ మొనర్చు మనంబున బ్రస
న్నతగదియించు దిక్కులఘనంబుగఁ గీర్తులు నించుసాధుసం
గతి యిక నేవిశేషములు గల్గఁగఁ జేయదు మర్త్యకోటికిన్.

చ. చతురమతి ప్రసిద్ధియు వచఃపరిశుద్ధి ప్రబంధవర్ధన
స్థితికలనాసమృద్ధి రససిద్ధయుఁ గాంచి యగణ్యపుణ్య భా
గతులితకీర్తి దేహధరులై సుకవీశ్వరు లెవ్వడ న్జరా
మృతిజనితోగ్రభీతులు వహింపక యెప్పుడు నున్నవారిలన్.

చ. వాఁడె కులీను డుత్తముఁడు వాఁడె రసజ్ఞుడువాడె యార్యుఁడున్
వాఁడెబహుశ్రుతుండుమఱివాఁడె గుణాఢ్యుఁడు వాఁడెవక్తయున్
వాఁడె సురూపియందు ధనవంతుని నందఱు నెంతు రెంతయుం
బోడిమిగాన సర్వగుణముల్ గనకాశ్రయ భూతముల్గదా.

ఉ. ఆఁకట స్రుక్కిన న్ముదిమి నంగము చిక్కినఁ గష్టదుగ్దశ
లోఁకిన గాంత్రిదక్కిన నసుప్రజము ల్చనుచున్న డస్సిన
న్వీక మదేభకుంభపదపీపిశితస్పృహఁ జెంది సింగ మ
స్త్రాకఁట వాడుపు ల్మేసవునో యభిమానిమృగేంద్రుఁడెయ్యెడన్

ఉ. స్నాయువసాదు లల్పములు నంజుడులే దది పంకదూష్య మా
హేయపుటస్థిఁ కుక్క భుజియింపుచు రంజిలు దాన తృప్తినుం
బాయును ప్రాప్తజంబుకము మాని మృగేంద్రము చించునేనుగుఁ
డాయదు రెల్ల వారు కడుడస్సియు శక్తి కొలంది కోరికల్.

చ. బలువిడి తోఁక ద్రిప్పి పదపాదములూనుచు గ్రిందవాలుచు
న్వాలికిఁ జేలఁ బైఁబడుచు వేమఱునో ఱుదరంబె చూపుచు
న్మెలఁకువఁ గుక్క గొక్కువడి బెట్టరు ధీరతఁ జూచుచున్ మదా
వళము భుజించుఁ జాటుశతవాక్యముల బెక్కుగవళంబు లిమ్ములన్.

చ. ఎడతెగకిల్లు సంసరణ మెల్లపుడున్ బరివర్తిలంగ నే
యెడ మృతిఁబొంది యెవ్వఁడు దయింపఁడు పుట్టుక కేమి యెవ్వఁడీ
పుడమి జనింపఁ దత్కులము భూరిసమున్నతిఁ జెందు వాని దే
మొదలును జన్మము న్సురువు లొక్కొకచోఁ బదికోట్లు పుట్టవే.

ఉ. సూనశర వాసనైన కుసుమస్తబకాకృతి రెండువృత్తుల
న్మానిసిలు మానశాలియగు ప్రాజ్ఞుఁడ దెట్లనఁగా బురంబుఁదా
జేసిన సర్వలోకములు జెల్వుగ నొసల దాల్పనుండు న
య్యాసలు వాసిన న్దపసియై వనసీమలనుండు నెమ్మదిన్.

చ. అల గురుభార్గవప్రభృతు లైదుగురు న్మరువాద వారిపై
నలుగక శీర్షమాత్రయుతుఁ డయ్యునుజూడు విశేషవిక్రమే
చ్ఛలుగల రాహుదైత్యపతి చంద్ర దినేంద్రులఁ బట్టు నిర్వర
స్థలమున బర్వవేళల యశంబున కింతె మహద్విరోధమున్.

చ. ఘనుఁ డహిభర్త భోగఫలకంబునఁ దాల్చు జగంబులెల్ల నా
యన నలకూర్మరాజు చరమాంగమునన్భరియించు నాగుణా
ఢ్యుని ధరియించు ఘోణిమణి యూను దదంగభరంబనాదృతి
న్వనధి యయారె యార్యుల యుదారచరిత్రములౌ విచిత్రముల్

ఉ. ఆకడ దండ్రి క్లేశవశుఁడై కృశియింపగ గాంచుచున్న మై
నాకునకు న్బయోధి భువనంబులఁ గూలుట న స్వర్గమా సడిం
జేకొనుకంబె దృప్త సురశేఖర భూరి శిఖి స్ఫులింగ కీ
లాకర భీకరోదకులిశాహతిఁ జచ్చినఁ గీర్తిగల్గదే.

చ. కరము ప్రకాశమొందఁగ రవికాంత మచేతనమయ్యుఁ జూచి తే
రెఱ బఱికంబు కోపమొక యించుక భానుఁడు పాదమూఁదినన్
గఱకఱి జెందినట్లు లక్షకత్వరమందెడుఁ జండతేజముల్
బొరసిన పూరుషుల్ పరులు పూనిచొనర్చు నవజ్ఞ లోర్తురే.

ఉ. సింగముగన్న యక్కొదమ చిన్నది యయ్యు నభంగ వాసనా
సంగత భృంగగాన ఝరసంగమలీమసగండరంగ మా
తంగ విభంగ భంగులకు దాఁటు బలాఢ్యులకున్ స్వభావమీ
యంగ వయోవిశేషము పరాక్రమసంపదకున్ బ్రధానమే.

చ. కులము రసాతలస్థలిని గూలిన మంచిగుణంబధోగతిం
గూలసిన శీల మద్రితటభూమిని జాఱి విదగ్ధమైన ద్వి
ట్కుల హర శౌర్యమంపుఁ బిడుగుల్ పడినన్ గడుమేల్ ధనంబె కా
వలె నది లేనిచోఁ దృణలవంబులుగా గుణకోటులన్నియున్

చ. కుమతులయోచనన్ నృపతి కూటమిచే యతి లాలనన్ సుతుం
డమహితవిద్య విప్రుఁ డసదాత్మజుచేఁ గుల మల్పుచే సుశీ
లము త్రప హాలచేఁ గృషి యలక్ష్యతఁ జెల్మి ప్రవాసవృత్తిని
య్యు మరతి దుర్ణయాప్తి సిరి యర్థము లీవిఁ బ్రమాదతన్ జెడున్

చ. అనుపమ దానభోగవిలయంబులనన్ దగు మూఁడు మార్గముల్
దనరు ధనంబునం దది యుదారమతిన్ మనుజుం డెఱింగి దా
ననుభవి గానలెన్ బుధుల కర్థుల కీవలె లేక మూలయిం
టనె పెనుఁగాంతుదాఁప నది దక్కుదు మూఁడవ త్రోవఁ గైకొనున్

ఉ. శాణవిలీఢరత్న మరిసందళితాంగ జయాఢ్యుఁడున్ మద
క్షీణగజంబు నిర్జలవిశీతలసైకతశారదాపగా
శ్రేణి కళావశిష్టశశి చెల్వనిచే రతిఁజిక్కుబాల వి
శ్రాణవలీలఁ బేదగిలు రాజులు మింతురు కార్శ్యమొందియున్.

ఉ. చేరెడుగంజికోస మొరుచెంగటి కేఁగుచు డస్సియున్న వాఁ
డే రమఁ జెంది వెన్క జగమెల్లఁ దృణంబుగ నెంచు నర్థముల్.

మీఱిన యందమునన్ దుదనులేక యణంగిన యందున న్నరుల్
జేరును రెక్కవస్థలు గృశించుట మించుట దానసే కదా.

చ. తడవని బుద్ధియొక్కపుడు దబ్బఱ యొక్కడ నిష్ఠురోక్తు లొ
క్కడఁ బ్రియవాద మొక్కపుడు హింసయొకప్డు దయాళుభావ మొ
క్కడ ధనకాంక్షయొక్కపుడునిచ్చుటలొక్కడ వెచ్చ మొక్కెడన్
గడన యొకప్డుగా గణిక కైవడి నె నృపనీతి నైకతన్.

చ. ఇల యను ధేనువున్బిదుక నిచ్చ జనించిన యేని రాజ నీ
వెలమిని దూడఁబెంచినటు లెప్పుడు లోకము బ్రోవవయ్య నీ
వలన జనంబు లెస్సయయి వర్థిలు చుండినఁ గల్పవల్లియుం
బలె సకలేప్సి తార్థఫలవర్గము లీధర యీనకుండునే.

ఉ. భూరితరాజ్యకీర్తియును భూసురరక్షయుఁ బాత్రదాతయై
మీఱుట భోగ మొందుటయు మిత్రులఁ బ్రోచుటనాఁగ నొప్పనీ
యాఱు గుణంబు లేన్నృపులయందు రహింపవో వారినూర కే
యాఱడి గొల్వనేల గలదా ఫలనూశ్రితకోటి కెంతయున్.

చ. వనజభవుండు మున్నెసట వ్రాసిన దెంతయొ యంత కొంచమో
ఘనమొ సురాద్రినున్న మరుభూమినిఁ జేరిన వచ్చు హెచ్చురా
దనఘ వృథావ్యథల్గనకు మాఢ్యులచెంత ధరింపు ధైర్యమూ
నిన ఘటికెచ్చునే జలము నీరధి ముంచిన నూత ముంచినన్.

ఉ. కారణ మింత లేక కెరిఁ గాంచినఁ గిన్కవహించు టాత్మని
ష్కారుణికత్వ మొందుటొరుకాంతఁ దలంచుట లన్యవిత్తము
ల్గోరుట బంధులు స్సుజనులు న్గను మేలు సహింపకుండుటల్
గ్రూరవిచారులౌ నరులకున్ మృషగాదు స్వభావసిద్ధముల్.

చ. లలితకళావిలాససమలంకృతుఁడై నను దుర్జనుండు చెం
తలవసియింపఁగా దగఁ డనర్హుఁడు వానిఁద్యజింప నేతగున్
గళితనవారుణారుణధగద్ధగితోరుఫణామణిప్రభల్
గల వని చెంత నున్న భయకంప మొనర్పదె సర్పమేరకిన్

చ. త్రప జడవృత్తి సద్వ్రతము దంభము శుద్ధతమైమబంధము ని
ష్కృపుఁడు గురుండు బుద్ధిప్రియరీతులు వల్కుట దైన్యవృత్తి తే
జపుఁ బస గర్వపూ స్థిరుఁ డశక్తుఁడు వక్తబహుప్రజల్పుఁడం
చెపుడును నిందసేయు ఖలుఁడే సుగుణంబిఁక వాఁడు మెచ్చునో.

చ. అవగుణ మేల లోభ మెనయన్ గొల లేటికి గొండెమున్న స
త్యవచన మున్న నేల తప మాత్మశుచిం గనఁ దీర్థమేల మే
లవు సుజనత్వ మేల సుగుణాళి మహత్త్వమె చాలు సొమ్ములే
ల విభవ మేల విద్యప్రబలన్ సడిఁజెందిన మృత్యు వేటికిన్.

చ. పగలిటఁ గాంతిలేని శశిప్రాయము దేఱిన భామ పద్మినిం
దగులమి రిత్తయౌకొలన నక్షరరూప వదాస్యమున్ ధనా
శగల ప్రభుండు లేమి ననిశంబుఁ గృశించుబుధుండు భర్తయో
లగమున నుండు సూచకుఁ డిలన్ విడఁగూడని సప్తశల్యముల్.

ఉ. ఆతత చండకోప దహనాశ్రయ రూక్ష కరాత్ములైన ధా
త్రీతల నేతలందు గలదే తనవారను ప్రీతి తప్పినన్
ఘాతయ సేయఁ జూతురధికత్వరమండెడు వహ్ని వ్రేల్పుతో
హోత నటంచు నంటుకొన నోరిచి శీతల వృత్తిఁ జూపునే.

ఉ. ఊరక యున్న మూగ వచనోద్ధతిఁ జూపిన గొంటు చేరువన్
జేరిన దంట దవ్వుల వసించినచో నసమర్థుఁ డోర్పుతో
నోరిన కొన్న భీరుఁడు దురుక్తులు సైచిన జాతిహీనుఁడం
చాఱడి బెట్టు రాజువశమా నృపసేవ యగత్య మేరికిన్.

చ. సకలబలావళిన్ బ్రియ మెసంగఁ బ్రకాశ మొనర్చి హెచ్చి పా
డికిఁ జొరలేక తాము ను ఘటించినదుష్టతమాధకక్రియా
ప్రకరము లన్నియున్ మఱచి భాగ్యముచే సిరిఁజెంది సర్వదా
పరుఁ డగుదుష్టదృష్టిఁ బడి సౌఖ్యము లెవ్వరు గందు రిమ్మహిన్

ఉ. హెచ్చిలుఁ దొల్తఁ బిమ్మటఁ క్షయించును రేపటిపూఁటనీడ నాఁ
గుచ్ఛితుచెల్మి దొల్తఁగడుగొంచమయ్యెమఱిమీఁద హెచ్చుచున్

వచ్చువివేకిమచ్చిక ధ్రువంబుగ మాపటిపూటనీడనా
నిచ్చలు నిత్తెఱంగెఱిఁగి నెయ్యము సేయదగు న్వివేకితోన్.

ఉ. సిరము బూరి సంతసము నిచ్చలు జీవనమై జొనంగ నె
వ్వారికిఁ గీడు సేయక ప్రసక్తులు మీనమృగాద్యులందు ని
ష్కారణ వైరమూనెదరు కష్టులు జాలకిరాతసూచకుల్
వారిజగచ్చకట్టడయె వారిదమూరహితస్వభావమో.

చ. పరగుణరీతి బ్రీతి గురుపట్ల వినీతి బుధాప్తివాంఛయున్
దలఁచుగ విద్య నాస్థయు సధర్మశిక్ష పతి లోకనిందలన్
వెఱపు శివార్చ భక్తిమతినిగ్రహశక్తియు దుష్టసంగమం
దరకియు గూర్చి యెప్పుడుమహాత్ములఁ గూర్చినమస్కరించెదన్.

ఉ. ఆపదలందు ధైర్యము మహాభ్యుదయంబున నోర్పు ప్రౌఢవా
చాపటిమంబు రచ్చలను సంగరరంగమున స్వరాక్రమా
టోపము కీర్తి నిచ్చయుఁ గడున్ వ్యసనంబు శ్రుతిన్ దలిర్ప బ్ర
జ్ఞాసరు లొప్పుచుండు రవి సాజముతై తమయందు బొందఁగన్.

చ. కరమున శ్లాఘ్యదాన మొసఁగెన్ దల శ్రీగురుపాదవందనం
బొరయ ముఖంబు సత్వరమఁ బూనుజయోన్నదవృత్తి బాహులన్
మెఱయు మహేచ్ఛవృత్తి మదినించ శ్రుతంబు శ్రుతిద్వయిన్ దగన్
సిరులు వినా విభూషణులుగఁ జేయుదు రీగుణముల్ మహామహుల్

చ. ఒకరిధనంబుఁ గోర కనృతోక్తులు పల్కక వధ్యనైనఁ జం
పక తగువేళ నీవి కలమాత్రము మానక నన్యఁ గూర్చి ప
ల్కక గురుభక్తి వీడ కతికాంక్షలఁ గూడక భూతమైత్రి బా
యక నడుచున్నమంచి తెరువంచు శ్రుతుల్ స్మృతు లెంచునాపుడున్

ఉ. సంపదఁ గన్న వేళ గుణశాలులచిత్తము గూరవృత్తి వ
ర్తింపక నూత్నపల్లవశిరీషను నుత్పలకోమలస్థితిన్
సొంపు వహించు నాపదలు సోకినవేళ విశాలశైలని
ష్కంతటస్థలస్ఫురదఖండశిలాకృతిఁ గర్కశంబగున్

చ. నయగతిఁ బ్రీక్షి ప్రాణములు నాశిలినక మలినత్వ మింతలే
మియు ఖలు లన్నఁ జేరమియు మిత్రుల నొచ్చియు వేడఁబోనియు
న్కియు వెతలందుఁ దాల్మియు మనీషులజాడ మెలంగుటల్ బుధా
శయములు కత్తిమీద పెనుసాము లి వెవ్వరిచేత నేర్చిరో.

ఉ. ఎంతయు దాముగుప్తముగ నిత్తురు సజ్జను లిల్లు జేర బూ
జింతురు ప్రీతి జేసినది సెప్పరు మేల్ సభ నెంతు రన్యుమె
స్వాంతన కుగ్గడింతు రసమింతురు శ్రీగలగర్వ మంచిత
స్వాంతులు కత్తిమీది పెనుసాము లి వెవ్వరిచే నెఱింగిరో.

చ. బలువుగఁ గ్రాగునయ్యనుముపైఁ బడ తోయకణంబు నాశిలున్
బొలుపగు తామరాకుపయి ముత్యపురూపున నిల్చుగొంత సే
పల జలబిందు వే యుదధియందలిశుక్తిని వ్రాలి ముత్య మై
మలయును దత్సమం బధమమధ్యమనుత్తమ సఖ్యముల్ క్రియల్.

చ. తగునడవళ్ళఁ దండ్రికి ముదం బొదవించినవాడె పుత్త్రుఁ డున్
మగనికి సంతసం బెసగ మన్కువ జూపిన దే పురంధ్రి ప్రే
మ గలిగి కల్మిలేముల సమంబుగ వర్తిలువాఁడె మిత్త్రుఁ డీ
ముగురు లభింతు రచ్ఛమతి మున్ సుకృతంబు లొనర్చువారికిన్.

చ. ఒరులకు నమ్రు లైఘనత నొంది పరస్తుతి నాత్మసద్గుణ
స్ఫురణ దెలార్చి యన్యపయి బూనియు స్వార్థములున్వహించి ము
ష్కరుల దురుక్తి యుక్తి లతిశాంతిని మార్చి తదార్తి కాదు లై
యరు దగుచర్యల న్మెలఁగు నార్యులు పూజ్యులు గారు యేరికిన్

చ. ఫలముల బిక్కటిల్లియును శాదపముల్ గను నమ్రభావముల్
జలధరపంక్తి దవ్వల నెసంగియు నమ్రత నిచ్చుదోయముల్
గలిమి జెలంగియున్ ఘనులు గర్వముఁ జెందక యుందు రెంతయున్
దలఁప బరోపకారులగు ధన్యుల కైన స్వభావకృత్యముల్.

చ. చెవు లురుకుండలద్యుతులచేతను గాదు శ్రుతి న్వెలుంగు ర
త్నవలయుక్తిఁ గాదు కయి దానముచేఁ జెలఁగున్ దయామతిన్
సవు రగువారి దేహములు చందనకుంకుమచర్చ చేతఁ గా
దవనిఁ బరోపకారమహిమాతిశయంబునఁ జాల శోభిలున్.

చ. జలజపరంపరన్ సురుచిసంపద నింపుని నుండు కైరవో
త్పలనికరంబుల న్గరము భాసిలఁ జేయు సుధాంశుఁ డంబుదా
వళి తనయంతఁ దా గురియు వర్షముఁ జెంద లోక మి
ట్లలఘుమతుల్ స్వయంగతపరార్థహితుల్ సుకృతుల్ దలంపగన్

చ. ఒరులపనుల్ ఘటింతురు నిజోద్యమముల్ ద్యజియించి యుత్తముల్
పరులపనుల్ స్వకార్యమునుఁ బాయక పూనుదు రుద్యమధ్యముల్
పరహితముల్ నిజార్థరతిభగ్న మొనర్తురు మర్త్యరాక్షసుల్
పరహిత మూరకే చెరచు పామరు లెవ్వరొ తోప దాత్మకున్.

ఉ. పాపము సేయనీఁడు హితపద్ధతిఁ గూర్చు రహస్యకార్యమా
దాపను జూచు సద్గుణవితానము లంద ఱెఱుంగ నెంచు దా
నాపద వచ్చిన న్విడువ డక్కఱవేళల నిచ్చు దీర్చు సం
తాపము మంచిమిత్రుఁ డని తద్గుణముల్ బుధ లెంతు రెంతయున్.

చ. తను గలసెన్ జలంబు లని దానికి బాల్ స్వగుణం బొసంగి వెం
టనె యిది గావఁగాఁబడు నెడన్ జల మోర్వక కాకనింకె న
య్యనుగు విపత్తు సైపక మహాగ్నిఁ బడంగఁ దొడంగెఁ బాలుఁ గ్ర
క్కున జలమంతలోఁ గలయ గ్రమ్మఱె నిట్టివి సాధుమైత్రముల్.

ఉ. ఇందె శయించినాఁడు కమలేశ్వరుఁ డిందె వసించె దద్విష
ద్బృందము లిందె చెందె శిఖరిచ్ఛటలున్ శరణంబు బాడబం
బుం దగి నిండె యిందె ఘనపుష్కలముఖ్యము లున్నవద్దిరా
యెందున గాన మెంతబరు వీజలధీంద్రుని మేను పూనెడిన్.

ఉ. ఆతతలోకధారిచరమాంగలసత్కమఠేంద్రుఁ డొక్కఁడే
జాతుఁడు జన్మ మన్న ధ్రువుజన్మమె సద్గ్రహచక్రవర్తన
స్థితతక్రిందమీఁద హితశీలుఁడు గాని జడుల్ వృథాశ్ఛదా
జ్ఞాతభవాండ భాండఫలజంతుసముల్ మృతజాతు లేటికిన్.

ఉ. ఆస నడంపు బూను క్షమ యానకు గర్వము నాడు సత్యమే
దోషము సేయఁబోకుము బుధు ల్పనుత్రోవలె పొమ్ము విద్వదు
ల్లాస మొనర్చు ముగ్రరిపులన్ శమియింపు వహింపు కీర్తి సం
త్రాసులఁ బ్రోవు సద్గుణము నాఁపుమి వే కద సాధుకృత్యముల్,

చ. మనసులు వాక్కు లంగములు మానితపుణ్యసుధా ప్రపూర్ణతం
దనరనిజోపకారము లుదితత్రిజగజ్జనులై పరు ల్బరిం
చినపరమాణుమాత్రగుణశీలము లద్రులు చేసి హర్షతో
యనిధుల నోల లాడుచు మహామహు లుందురు కొందఱీధరన్

చ. గురుడు ప్రబోధకుం డశని ఘోరపువా లమరుల్ స్వసైనికుల్
పురి దివి దంతి యభ్రకరి పోర సహాయుఁడు దైత్యభేది, యి
ట్లరు దగుబల్మి గల్గియు బలారి బలా రిపుధాటి కోడఁడే
శరణము దైవమే పురుషశక్తి వృథా యది యేల కాల్పనే?

చ. అసువుల నాసగ్రుంగ దను వంతయుఁ బెద్ద మునుంగ నింద్రియో
ల్లసన మణంగ నాకట నలంగుచు నోటన రేయిఁ బల్కు బె
ట్టైసరఁగ దానబడ్డలరి డిగ్గన భోగాను భోగి తత్ఫసన్
వెస జను దైవమేల క్షయవృద్ధుల స్వస్థత నుండుడీ జనుల్.

ఉ. లేవడిఁ బొందియున్ వెతల లీనతఁ బొందియు లేచు గ్రక్కునన్
దైవబలంబునన్ బుధుఁ డుదారతఁ గందుక వృత్తిహత్తి దు
ర్భావ్యుఁడు తద్విధంబున విపద్దశవచ్చిన నొచ్చి నాశిలున్
లేవక మంటిముద్ద ధరణింబడి యట్టె యణంగు కైవడిన్.

చ. వడి నెద యెండ బట్టతలవాఁ డొక డెండను నెత్తి మండ నల్
గడలను నీడచో టరసి కానక దవ్వుల తాటిచెట్టు గ
న్పడఁ జని క్రింద నిల్వ నలపండుపడన్ దలబ్రద్దలయ్యె నె
య్యెడలకుఁ జన్న దైవహతు నించుక డించక ముంచునాపదల్.

చ. గజభుజగంబులన్ బలుఖగంబులఁ గట్టుట సూర్యచంద్రులన్
గజిబిజి చేసి దుర్గ్రహము క్రౌర్యమునన్బలించియేచుటల్
ఋజుమతు ధీమహాత్ములు దరిద్రత వేగుట జూచి యయ్యయో
నిజగతి నెంత చేసె నతినిష్ఠురదైవ మటంచు గుందుచున్.

చ. సరసగుణాద్యశేషగుణసంపద నిల్వ నిధాన మామహా
పురుషశిఖామణిన్ భువికి భూషణరాజముగా సృజించి య
త్తఱిక్షణభంగురంబుదను, దాని నొనర్చియెని యేటి నే
ర్పరి విధి యాతఁ డానినను పండితభావము కష్టమక్కటా.

చ. అతులసుధారసైక విధియై సకలౌషధు లేలునాధుఁడై
శతభిషగర్వితో ద్గమనసంభృతుఁడై శివమౌళిభాగలం
కృతమణియై వెలుంగు శశి యిప్పుడుఁ బాయఁడు రాజ్యలక్ష్మ హా
హాతవిధిపాక మేదారల కైనను దాఁట నలంఘ్యమేకదా!

చ. హతవిధి యన్కు లాలవరుఁ డాత్మయనందగు మ్మృత్తికామలో
ద్ధతిఁ గొనిముద్దచేసి వ్యధ యన్ పృధుచక్రముఁ జేర్చి యాపద
న్నతఘనదండఘూటన మనంబును బల్మిఁ ద్రిప్పుచున్నవాఁ
డతఁ డిఁక నేమి సేయునో కదా చెలికాడ వెలుంగ వేమియున్.

చ. పతివిధి యేమి యెవ్వనికిఁ బ్రాప్త మొనర్చెనో వచ్చు నంతయే
యతనికి నిచ్చు సంశ్రయమహాశ్రయముల్ గుటిగావు సర్వది
క్ప్రతతులు నిండి మేఘము ప్రత్యహముం గురియంగ నేయభీ
ప్సితములు గల్గె స్వాతిజలబిందువులే కద చాతకాళికిన్.

ఉ. అంబుజబాంధవుం డహరహంబును డగ్గతివారి గూడి యా
యంబరఖండ మూని తిరుగాడుచునుండును గ్రుంకుదాఁక న
య్యంబరఖండ మొందియు సుధాంశుఁడు ద్రిమ్మరు రాత్రులెల్ల దై
వంబె ఘటించినన్ గడువవచ్చునె దుర్గతి యెంతవారికిన్.

చ. ఉరగణయోగి భర్తృహరి పూని చమత్కృతిసంఘటింపఁగా
గరము దనర్చునీతిశతకం బది పట్టి తెనుంగుబాసచేఁ
దిరముగఁ జెప్పెఁ బుష్పగిరితిమ్మన చంపకమాలికాపరం
పరలు శివాంఘ్రిపూజలుగఁ బండితు లెంతయు సంతసింపగన్.

క. ఈ కావ్యము లిఖియించినఁ
జేకొని చదివినను వినిన శిష్టుల కెల్లన్
శ్రీకంఠుఁ డిచ్చుఁ గరితుర
గాకల్పానల్ప సురుచిరాయుష్యంబుల్.

పుష్పగిరి తిమ్మకవికృత
నీ తి శ త క ము
సంపూర్ణము.

# న వ ల లు

| | | రు | అ |
|---|---|---|---|
| విషహృదయము | | 1 | 0 |
| వలపులరాణి | | 1 | 0 |
| నే నెవరి భార్యను ? | | 1 | 4 |
| నే నెవరి భర్తను ? | | 1 | 4 |
| తల్లావఝ్ఝల శివశంకరశాస్త్రిగారి | | | |
| జీవనప్రభాతము (రఘునాథజీ) | | 1 | 8 |
| జీవనసంధ్య (తేజసింగు) | | 1 | 8 |
| దేవరాజు వెంకటకృష్ణారావుగారి | | | |
| నా శేవీడు | 1 వ భా॥ | 1 | 8 |
| నేనే | 2 వ భా॥ | 1 | 8 |
| కాలూరాయి | 3 వ భా॥ | 1 | 8 |
| (వంగభాషనుండి తర్జుమా చేయబడిన బహుచక్రాణి నవలలు 3 భాగములు చదివినచో కథ పూర్తియగును) | | | |
| అగ్గిరాముడు | | 1 | 0 |
| భయంకరుడు | 1 వ భా॥ | 1 | 0 |
| నరేంద్రుడు | 2 వ భా॥ | 1 | 0 |
| రమేశ్ బాబు | | 1 | 0 |
| సర్కిల్ రంగనాథన్ | | 1 | 0 |
| శకుంతల బి. ఏ. | | 1 | 0 |
| చదువుకున్న భార్య | | 1 | 0 |
| నీవే నా ? | | 0 | 12 |
| ఖాడ్గదసుడు | | 0 | 12 |
| శక్తికుమారి | | 1 | 0 |
| పంజాబు మెయిల్ | | 1 | 0 |
| కన్నపుదొంగ | 1 వ భా॥ | 1 | 0 |
| పగటిచుక్క | 2 వ భా॥ | 1 | 0 |
| డిటో | 3 వ భా॥ | 1 | 0 |
| (పై మూడు భాగములు చదివిన కథ పూర్తియగును) | | | |
| రమాసుందరి | 1 వ భా॥ | 1 | 0 |
| డిటో | 2 వ భా॥ | 1 | 0 |

| | | రు | అ |
|---|---|---|---|
| రక్తవాహిని (పదు హత్యలు) | | 1 | 0 |
| ఇంద్రజాలము | | 1 | 0 |
| రాజద్రోహి | | 1 | 0 |
| అర్ధరాత్రపువింత (3 హత్యలు) | | 1 | 0 |
| దురాశ | 1 వ భా॥ | 1 | 0 |
| డిటో | 2 వ భా॥ | 1 | 0 |
| దొంగలనాయకుడు | | 1 | 0 |
| మోహపిశాచము 270 పే॥ | | 1 | 8 |
| కాలసర్పము | 1 వ భా॥ | 1 | 0 |
| డిటో | 2 వ భా॥ | 1 | 0 |
| ఆనందభవనము | | 1 | 0 |
| అల్లరిపిల్ల | | 0 | 12 |
| మగడుకాని మగడు | | 0 | 12 |
| ధర్మరాజు | | 1 | 0 |
| హాతింతాయి | | 0 | 12 |
| కళాప్రపూర్ణ చిలకమర్తి లక్ష్మీనరసింహం పంతులుగారి | | | |
| అహల్యాబాయి | | 1 | 0 |
| రాజరత్నం | | 1 | 0 |
| కృష్ణవేణి | | 0 | 12 |
| హేమలత | | 1 | 4 |
| కర్పూరమంజరి | 1 వ భా॥ | 1 | 8 |
| డిటో | 2 వ భా॥ | 1 | 8 |
| రామచంద్రవిజయం | | 1 | 4 |
| సౌందర్యతిలక | | 1 | 8 |
| వినోదములు | 1 వ భా॥ | 0 | 12 |
| డిటో | 2 వ భా॥ | 0 | 12 |
| Tales of Rajasthan అను రాజస్థానకథావళి | 1 వ భా॥ | 1 | 8 |
| డిటో | 2 వ భా॥ | 1 | 8 |
| మణిమంజరి | | 0 | 6 |
| సువర్ణగుప్తుడు | | 0 | 6 |

# జ్యోతిష గ్రంథములు

| | రు | అ |
|---|---|---|
| జ్యోతిష రహస్యము 1 వ భా॥ | 2 | 0 |
| డిటో 2 వ భా॥ | 2 | 0 |
| జ్యోతిష విద్యాప్రకాశిక | | |
| సంజ్ఞాధ్యాయము 1 వ భా॥ | 1 | 0 |
| గణితాధ్యాయము 2 వ భా॥ | 1 | 0 |
| భావఫలాధ్యాయము 3 వ భా॥ | 3 | 0 |
| ద్వాదశభావఫలము 4 వ భా॥ | 3 | 0 |
| అదృష్టదీపిక | 0 | 10 |
| హస్తసాముద్రికము | 0 | 6 |
| జ్యోతిష ఫలప్రదర్శని | 0 | 10 |
| స్వప్న ఫలదీపిక | 0 | 8 |
| సకలసమస్తగుణ అదృష్టదీపిక | 1 | 0 |
| గౌతమసంహిత | 0 | 8 |
| వాంఛానాడీయము | 0 | 8 |
| కోడిపుంజుల శాస్త్రము | 0 | 6 |
| అంగసాముద్రికము | 0 | 8 |
| జాతకదర్పణము | 0 | 8 |
| జాతకపారిజాతము | 0 | 8 |
| జాతకరాజీయము | 1 | 0 |
| జ్యోతిషఫలగ్రంథము | 0 | 4 |
| శకునశాస్త్రము | 0 | 12 |
| ఉత్తమప్రశ్నశాస్త్రము | 1 | 0 |
| స్త్రీజాతకము | 0 | 12 |
| యవనజాతకము | 0 | 8 |
| జ్యోతిషార్ణవ నవనీతము | 1 | 8 |
| [illegible]భుక్తఫలచంద్రిక అను వృద్ధపారాశరి | 1 | 0 |
| [illegible]మచ్చలశాస్త్రము | 0 | 8 |
| [illegible]చంద్రిక గోచారరత్న[illegible]ము | 0 | 8 |

| | రు | అ |
|---|---|---|
| నవగ్రహచింతామణి | 0 | 4 |
| స్త్రీఋతుశాస్త్రము అను రజస్వలాజాతకము | 0 | 8 |
| మూలస్తంభం (శైవగ్రంథము) | 0 | 8 |
| రత్నపరీక్ష | 0 | 6 |
| గర్గసంహిత | 0 | 4 |
| జైమినీసూత్రములు | 1 | 0 |
| అనుభవజాతకతరంగిణి | 0 | 8 |
| పూర్వపారాశరి | 0 | 8 |
| బృహత్పారాశరసంహిత | 0 | 4 |
| ఆంధ్రజాతకతత్త్వము సూత్రములు 1 వ భా॥ | 1 | 8 |
| డిటో 2 వ భా॥ | 1 | 8 |
| గోచారసంహిత | 0 | 12 |
| కాలామృతము | 1 | 0 |
| శిల్పసంగ్రహము | 0 | 6 |
| ఆయుర్దాయయోగము | 1 | 0 |
| ముహూర్తదర్పణము | 1 | 0 |
| గ్రహమతశాస్త్రము 60 సంవత్సరముల పంచాంగము | 0 | 12 |
| సర్వార్థచింతామణి (ద్వాదశభావములు, దశాంతర్దశ వివరములు గల సంపూర్ణమూలగ్రంథము) | 1 | 0 |
| అష్టకవర్గు | 0 | 10 |
| జలార్గళశాస్త్రము | 0 | 6 |
| శ్రీపతి | 2 | 0 |
| షట్ప్రశ్నము (ప్రశ్నశాస్త్రము) | 0 | 6 |
| ఆరూఢరత్న సిద్ధాంజనము | 0 | 12 |
| సమ్మోహనశాస్త్రము అను అదృష్టయోగము | 1 | 8 |